151/95

# ఒక ఊరి కథ


డా॥ యార్లగడ్డ బాలగంగాధరరావు

యం. ఏ., పిహెచ్. డి.,

ప్రొఫెసర్ ఆఫ్ తెలుగు

నాగార్జున విశ్వవిద్యాలయం

నాగార్జుననగర్ - 522 510





వి. జి. యస్. పబ్లిషర్స్

విజయవాడ - 1

ఒక ఊరి కథ

—యార్లగడ్డ బాలగంగాధరరావు

199[illegible], ఆగస్టు

ప్రతులు : 1000



తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహకారముతో ప్రచురింపబడినది. అయితే ఇందు వెలిబుచ్చిన అభిప్రాయాలతో తెలుగు విశ్వవిద్యాలయమునకు ఏ సంబంధము లేదు.

ప్రతులకు :
శ్రీమతి యార్లగడ్డ నిర్మల
టిప్పర్ల రోడ్డు
మంగళగిరి - 522 503
&
వి. జి. యస్. పబ్లిషర్స్
11-63-6, బ్రాహ్మణవీధి
విజయవాడ - 520 001

మూల్యము : రు. 45-00

ముద్రణ :
వెంకట సత్య ప్రింటర్సు
విజయవాడ - 2.

# అంకితము



శ్రీయుత నాగభైరవ కోటేశ్వరరావు

ఆలోచనలో ఆచరణలో అచ్చపు రైతుబిడ్డ
నాకు దేవుడిచ్చిన అన్నకు అభిమాన
పురస్సరంగా

# ముందుమాట

'ఒక ఊరికథ' అనేది ఈ గ్రంథం పేరయినా, నిజానికిది ఏ ఒక్క ఊరి కథాకాదు. కథా శబ్దానికి జనబాహుళ్యంలో వున్న అర్థమూ సరిపడేది కాదు. ఊరి పేరు, ఆ పేరు ఏర్పడడానికి నేపథ్యం సవదరించిన వివిధ కారణాల కథనం కనుక ఇది కథ. ఎంపిక చేసికున్న కొన్ని ఊళ్ళ కథలను ఇందులో సంగ్రథితం చేయడం జరిగింది.

ఊరి పేరనగానే, ముందు తమ ఊరిపేరు మనసులో మెదులుతుంది ఎవరికైనా. అలాగే పరిచయమైన మరికొన్ని ఊళ్ళపేర్లు జ్ఞాపకం రావడం సహజం. ప్రత్యేకమైన జిజ్ఞాస లేకపోతే, వాటిని గురించే అంతగా పట్టించుకోరు. బాగా పరిచయమైన పేర్లే గావడంతో, వాటిని గూర్చి ప్రత్యేకంగా తెలిసికోదగినది ఏముంటుందని చాలమంది భావన. ఇలాంటి భావన సాధారణ జనానీకానికి ఉండడంలో ఆశ్చర్యంలేదు. కాని కొందరు భాషా పండితులకు కూడ ఇదే ఆలోచన వుంది. బహుశా ఈ భావనకు కూడ ఆ పేర్లతో గల అధిక పరిచయమే గావచ్చు. కాని మీ ఊరి పేరేమిటి, దాని కర్థమేమిటని అడిగితే తబ్బిబ్బు పడతారు. కొందరు కొంత ఆలోచిస్తారు. మరికొందరు తెలియనితనాన్ని కప్పిపుచ్చుకోడానికి వివిధ విన్యాసాలు చేస్తారు. దానికేమి.

భాషా వ్యవహారంలోని వివిధ పదాలకు వివరణలు తెలియని సందర్భంలో తెలిసికొనే ప్రయత్నం చేస్తున్నాము గదా ! ఊళ్ళపేర్లు కూడ భాషాపదాలేగదా ! వాటికి వివరణలుండవా ? తెలిసికొనే ప్రయత్నం చేయవద్దా. భాషలోని అన్నిపదాల వివరణలను క్రోడీకరించకుండా, భాషా సమష్టిపై పరిశోధన సంపూర్ణమెలా అవుతుంది. కనుక అన్నింటి వివరణా అవసరమే. అందులో భాగమే ఊళ్ళపేర్ల వివరణ.

ఈ ఊళ్ళపేర్ల వివరణ, నామవిజ్ఞానశాస్త్ర (Onomastics) సంబంధి. నామములను గూర్చి వివరించేది నామవిజ్ఞానశాస్త్రం. ఓనామ (Onoma) అనే లాటిన్ పదానికర్థం నామము. ఇక్కడ నామమంటే పేరనేది సాధారణార్థం. అయితే నామశాస్త్రవేత్త దృష్టిలో భాషలోని ప్రతిపదము పేరే. అంటే అతని దృష్టిలో, సామాన్యంగా భాషాభాగాలుగా పేర్కొనబడే నామవాచకం, సర్వనామం, క్రియ, విశేషణం, అవ్యయం-ఇత్యాది విభాగం లేదు. భాషలోని (వాక్యం) వివిధ పదాలు, వాటిస్థానం, ఉద్దిష్టార్థ బోధలో అవి నిర్వహిస్తున్న వ్యాపారాన్ని ఆశ్రయించి చేసిన విభాగమిది. నామవిజ్ఞానవేత్త దృష్టి దీని కతీతమైనది. అతడి దృష్టిలో క్రియ కూడా పేరే. ఎలాగంటే ఒకడు నడచి వెళుతున్నాడు. మరొకడు పరుగెత్తుతూ వెళ్తున్నాడు. భాషావేత్త దృష్టిలో ఈ నడచు, పరుగెత్తు అనేవి క్రియలు.

అంతర్జాతీయ స్థాయిలో ఈ అధ్యయనం గావించేవారి సంస్థ అంతర్జాతీయ నామ విజ్ఞాన సంఘం (International committee for onomastic sciences) వుంది. దీని కేంద్రస్థానం బెల్జియం. ఈ సంస్థ మూడేండ్ల కొకమారు సదస్సు నిర్వహిస్తోంది. ఒనామా అనే పత్రికను వెలువరిస్తోంది. ఇదిగాక ప్రపంచమంతటా దాదాపు అన్ని దేశాల్లోను, ఆయా దేశాలలోని జనావాసాలను అధ్యయనంచేసే సంస్థ లున్నాయి. అమెరికన్ నేమ్సొసైటీ, న్యూయార్క్ కేంద్రంగా పనిచేస్తూ, నేమ్స్ అనే త్రైమాసిక పత్రికను వెలువరిస్తోంది. భారతదేశంలో కూడ మైసూరు కేంద్రస్థానంగా భారతీయ స్థల నామ సంస్థ పనిచేస్తోంది. మైసూరు విశ్వ విద్యాలయ భూత పూర్వ ఉపాధ్యక్షులు ఆచార్య జావరేగౌడ ఈ సంస్థ వ్యవస్థాపకాధ్యక్షులు. ప్రస్తుత అధ్యక్షులు డా॥ కె.వి. రమేష్. ఈ గ్రంధకర్త ఉపాధ్యక్షులు. నాగార్జున విశ్వ విద్యాలయంలో ఈ నామ విజ్ఞాన శాస్త్రాధ్యయనం ఎం.ఎ. తెలుగు కోర్సులో ఐచ్ఛిక పాఠ్యాంశంగా బోధింపబడుతోంది.

నామ విజ్ఞాన శాస్త్రంలోని వివిధ అంశాలలో, స్థల నామాధ్యయనం పైననే కృషి జరిగింది. జరుగుతోంది. అందులోను గ్రామ నామాధ్యయనంపైన విశేష కృషి జరుగుతోంది. వివిధ విశ్వ విద్యాలయాలలో పరిశోధకులు పలువురు ఈ అధ్యయనంపై కృషి గావించి పరిశోధక డిగ్రీలను (Ph. D., & M. Phil) పొందారు.

సాధారణంగా ఏ గ్రామ నామంలోనైనా రెండు పదాలుంటాయి. కొన్ని ఏక పద సంఘటితాలుగాను (దర్శి, కంబం, తడ, చెరువు, కోట, వసంత, లంజ, కవిత మొదలైనవి) వుంటాయి. రెండు పదాలున్న గ్రామ నామాలలో చివరిపదం, సాధారణ జనావాస సూచకమై వుంటుంది. వీటిని ఆంగ్లంలో జెనిరిక్సు (Generics) అంటారు. కొండపల్లి అనే గ్రామనామంలో 'పల్లి' అనేది ఇలాంటిది. అలాగే పోచంపాడు, కొండవీడు, పాలపర్రు, మొగలి తుర్రు మొదలైన గ్రామ నామాల్లోని పాడు, వీడు, పర్రు, తుర్రు అనేవి కూడా ఇలాంటివే. అన్నీ జనావాస సూచకాలే అయినపుడు ఇన్ని విధాలైన పదాలు ఎందుకు సంకేతింపబడ్డాయి. స్థూలమైన భావనలో జనావాసమే అయినా, అవి వేరు వేరు లక్షణాలకు ప్రతీక అన్నమాట. అంటే ఏ లక్షణాలున్నది పాడో, పర్రో, తుర్రో, మిర్రో మన ప్రాచీనులకు తెలుసు నన్నమాట. ఈ నేటి కాలంలో ఎక్కడైనా కొత్తగా జనావాస మేర్పడితే, దాని కేదో 'నగర్' అనో, పాలెం అనో, పేట అనో సంభావిస్తున్నాము. అంటే ఆ జనావాస మేర్పడిన చోటుకు అచ్చటి పరిస్థితులకు దానికి పెట్టుకున్న పేరుకు ఏమి సంబంధముండదు. కాని ప్రాచీన గ్రామాలు అలాకాదు. తుర్రు అంటే అది నెల కొన్న చోటు యొక్క నైసర్గిక లక్షణాలను ప్రతిబింబిస్తుంది. అలాగే పేట అంటే తప్పకుండా అది వ్యాపార స్థలమై వుంటుంది. పూడి అంటే తప్పక దాని సమీపంలో

ప్రవాహ ముంటుంది. మిర్రు అంటే ఎత్తైన స్థలమై వుంటుంది. దీనినిబట్టి గ్రామాలకు పేర్లుంచడంలో మన పూర్వుల అవగాహన ఎలాంటిదో తెలుస్తుంది.

ఇక ఇలాంటి వాటిపై చేరిన మొదటి పదాలు. (కొండపల్లిలో కొండ లాంటిది) వీటిని ఆంగ్లంలో స్పెసిఫిక్స్ (Specifics) అంటారు. అంటే ఇవి చివరినున్న పదాన్ని నిర్దేశించి, విశేషించి చెపుతాయి. ఒక జనావాసం నెలకొన్న చోటును బట్టి, దానిని పర్రుగా సంభావింపవలసిన స్థితి వుందని భావిద్దాం సరిగా అలాంటి స్థితి గతులే వున్నచోట దానిని కూడా పర్రు అనే సంభావించాలి. ఇలా ఒక ప్రాంతంలో అనేక పర్రులు ఏర్పడ్డాయనుకోండి. అందులో ఒక ఒక పర్రుకు వెళ్ళవలసిన స్థితి ఏర్పడినపుడు, దానికి దారి తెలియనపుడు, ఏ పర్రుకని అడగగలడు. ఎవరైనా ఏ పర్రు అని సమాధానమివ్వగలడు. ఉన్న అనేక పర్రులలో, నిర్దేశింపబడిన పర్రు ఎలా తెలియడం. కనుక వివక్ష అవసరమవుతోంది. ఆ దిశగా ఏర్పడిన వివక్ష వలననే ఒకటి పాలపర్రు అయితే మరొకటి బల్లిపర్రు అయింది. ఇంకొకటి కొండిపర్రు అయింది. అలాగే, వున్న అనేక పల్లెలలో కొండ వున్న పల్లె కొండపల్లె అయింది. బ్రాహ్మణులున్న పల్లె బ్రాహ్మణపల్లె అయింది. ఉదాహరణగా ఇచ్చిన రెండింటిలో ఒకటి ఆ చోటు యొక్క నిసర్గమైన స్థితిగతులను ప్రతిబింబిస్తుండగా రెండవది ఒక కులాన్ని సూచిస్తోంది. ఇలాగ, సంఘంలోని బహుముఖాలు ఈ ఊళ్ళపేర్లలో, కనిపిస్తాయి. ఒక విధంగా ఊళ్ళ పేర్లు కదిలిపోయిన కాలపు కాలిముద్రలు. మన పూర్వుల బహుముఖ చేతనలకు, వారి పరిజ్ఞానానికి నిదర్శనాలు.

రెండవ పదాలైన వాటిలో ఎక్కువ భాగం జనావాసం నెలకొన్న నైసర్గిక స్థితిగతులను ప్రతిబింబిస్తాయి. కొన్ని కాలాంతరంలో సంఘంలో నెంకొన్న సంస్కృతిని ప్రతిబింబిస్తాయి. పూడి, పర్రు, తుర్రు, కుర్రు, బండ, కల్లు మొదలైనవి మొదటివాటికి ఉదాహరణములు. కాగా పేట, అగ్రహారం, బ్రహ్మదేయం, దశబంధం, పెంట మొదలైనవి రెండవ వర్గానికి ఉదాహరణలు. మొదటి పదాలలో కన్పించే కొండ, చింత, మేక, ఆవుల, చీకటి, గొడుగు (చింత), రాళ్ల అనేవి జనావాసాల స్థితిగతులకు, అక్కడ పెరిగే మొక్కలను సూచిస్తాయి. ఇవిగాక, కులాలపేర్లు, వ్యక్తులపేర్లు, సంఘటన (రణస్థలం) సూచకాలు, నాగరకత సంస్కృతులను ప్రతిబింబిస్తాయి. కొన్ని గ్రామాల పేర్లు అది నెలకొన్న చోటు యొక్క, ఉన్నతత్వాన్ని, నిమ్నత్వాన్ని, దిశలను, కేవలం చోటును సూచిస్తాయి. బండమీది-పల్లె, దిగువ తడకర, తూర్పు లంకపల్లి, పెన్నదరి, ఏటి ఆవల తాండ్రపాడు మొదలైనవి వీటి కుదాహరణలు. మరికొన్ని పేర్లు, కొంత తప్పిబ్బుకులోనుచేస్తాయి. గొడుగుచింతలోని గొడుగు ఛత్రార్థ బోధకత్వం కాదు. గొడుగుచింత అనేది

ఒక మొక్క పేరు. పుట్టగొడుగు తెలిసిందే కదా! అలాగే కవిత, లంజ, కోమలి దీపావళి అనేవి ఊళ్ళ పేర్లే నంటే కొంత ఆశ్చర్యం కలుగుతుంది. కాని అవి ఊళ్ళ పేర్లే. కాని సాధారణంగా మనకు తెలిసిన భావనలలో కాదు. వీటిలోని భావన వేరు. పదం ఒకటిగానే ఉన్నపుడు భావన వేరుకావడానికి దోహదం చేసిన పరిస్థితు లేమిటి? స్వరూపం మారి పదం అలా సిద్ధించినవి కొన్ని. మూల భావనలు ఒకటే అయినవి కొన్ని వేరువేరు ధాతువుల నుండి నిష్పన్నమైనవి మరికొన్ని. దీపాల ఒక రకం గడ్డి పేరు. లంజ అంటే ప్రవాహం. ఇక్కడ మూలార్థం వక్రగమనం గలది. అది ప్రవాహమైనా మనిషైనా ఒకేపదం. కవిత సంస్కృత శబ్దార్థ భావనవేరు. తెలుగు పదభావన వేరు. మొదటిది సాహిత్య సంబంధి. రెండవది కేవలం మొక్క మాత్రమే. అలాగే అగ్రహారాల్లో చాల భేదాలున్నాయి. కొన్ని బిల్మక్తా అగ్రహారాలు. ఇంకా కొన్ని సర్వఇనాం అగ్రహారాలు. మరికొన్ని జోడి అగ్రహారాలు. ఇంకొన్ని కట్టుగుత్త అగ్రహారాలు. ఈ పదాలు ఏ భేదాన్ని సూచిస్తున్నాయి. కొన్ని కేవలం మంగళ శబ్దంతో సంభావితాలు. మరికొన్ని చతుర్వేద మంగళ సంభావితాలు. ఈ రెంటికి భేదమేమిటి?

సాధారణంగా పూడి, పర్రు, తుర్రు, మిర్రు అనే నైసర్గిక గ్రామనామ బంధాలపై (genertess), నిర్దేశ సూచకంగా చేరే పదాలు (specific) నిసర్గ సూచకాలే అవుతాయి. కాని రెడ్డిపూడి, బొప్పూడి, తెనుగుబూడి మొదలైన వాటిలోని మొదటి పదాలు, కుల, వ్యక్తి, జాతి నామాలు. ఇలా ఎలా చేరాయి. ఈ విధమైన ప్రక్రియ దేనిని సూచిస్తోంది. వీటివలన గ్రామ నామకరణంలోని అనుపూర్విని తెలిసే అవకాశ ముంది. అలాగే గ్రామనామం సంస్కృతీకరణం. మరికొన్ని సందర్భాల్లో పేర్లను మార్చివేయడం. వీటి వెనుకగల నేపథ్యమేమిటి? ఈ శాస్త్రాధ్యయనం వలన ఇవన్నీ తెలుస్తాయి.

ఇలా ఊళ్ళ పేర్లనేవి, ఒక భాషాసమాజపు సంపూర్ణ చైతన్యానికి ప్రతీకలు. వాటిని అధ్యయనం చేయడం ద్వారా ఆ భాషా సమాజాన్ని, అధ్యయనం చేసే వీలుంది. చారిత్రక భూగోళాన్ని పునర్నిర్మించవచ్చు. వెనుకటి కాలపు రహదారులను-వ్యాపార కేంద్రాలను గుర్తింపవచ్చు. చరిత్రలో పూరింపబడకుండా మిగిలిపోయిన భాగాలను పూరింపవచ్చు. స్థానికంగా పండిన పంటలను, పెరిగిన జంతు, వృక్ష జాలాన్ని గుర్తింపవచ్చు. ఆ జాతి కొలిచిన దైవాలను, వారి సంస్కృతిని తెలియవచ్చు. నిఘంటువుల కెక్కని అనేక పదాల అట్టుపుట్టాన వాళ్ళ జాడ తీయవచ్చును. ప్రాంతీయ చరిత్రను సమగ్రం గావింపవచ్చును. ఇది ఒక చిన్న ప్రయత్నం. సహృదయులైన పాఠకుల మనసు కెక్కుతుందని ఆశిస్తున్నాను.

—యార్లగడ్డ బాలగంగాధరరావు.

# కృతజ్ఞత

ఈ గ్రంథం రూపొందడానికి నేపథ్యం సవదరించిన వారెందరో మహానుభావులు. ఆంధ్ర విశ్వవిద్యాలయం ఎకడమిక్ స్టాఫ్ కాలేజీలో ఈ విషయాన్ని గూర్చి ప్రసంగించినపుడు, ఇది జన బాహుళ్యానికి అందించడం మీ బాధ్యత అంటూ ఎదుర పరచినవాడు, నా సహాధ్యాయి పైడిపాల (డా॥ పి. సత్యనారాయణరెడ్డి). అంతటితో సరిపెట్టుకోక, ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక సంపాదకులు శ్రీ తోటకూర రఘుగారికి విషయసూచన గావించాడు. దానిపై వెంటనే స్పందించి, దీని అక్షరాకృతికి మూలమైనవారు శ్రీ రఘుగారు. నీకు మాత్రమే తెలిసిన విషయం, చెప్పడం నీ కర్తవ్యమంటూ బోధ చేసినవారు, శ్రీ నాగభైరవ కోటేశ్వరరావుగారు, సత్యశోధన, సత్యదర్శన, సత్యప్రకటనలపట్ల వెనుకంజ వేయరాదని వెన్నుదట్టిన వారు, నాగార్జున విశ్వవిద్యాలయ భూతపూర్వ ఉపాధ్యక్షులు ఆచార్య ఎడ్ల చిన సింహాద్రి, వారి ధర్మపత్ని శ్రీమతి నాహాకొగారలు. నాకీ విషయంపై ఆసక్తి కలిగించినవారు మద్గురువర్యులు ఆచార్య తూమాటి దొణప్పగారు. నాగార్జున విశ్వవిద్యాలయంలో నామ విజ్ఞానశాస్త్రాధ్యయనాన్ని ప్రోత్సహించి, దానికొక పాఠ్యాంశంగా చేర్చడంలో ప్రత్యేక శ్రద్ధ తీసికున్నవారు ఆచార్య కొమ్మారెడ్డి రాజరామమోహనరావుగారు. ఆ ప్రయత్నంలో సహకరించినవారు ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తంగారు. అహరహము నా శ్రేయస్సే కోరినవారు శ్రీమతి డా॥ బీనా, గోపాలరావు దంపతులు. గ్రంధ ముద్రణ విషయంలో శ్రమించినవారు డా॥ రాజగోపాల చక్రవర్తి, డా॥ ఆదినారాయణ, శ్రీ సింగుపురం నారాయణరావు గారు, శ్రీ సి.హెచ్. సత్యనారాయణగారు, వి.జి.ఎస్. పబ్లిషర్స్ అధినేతలు శ్రీ ఎస్. రామారావుగారు, గ్రంధ ప్రచురణకు ఆర్థికసాయమందించినవారు తెలుగు విశ్వవిద్యాలయంవారు. సకాలంలోముద్రించిన "వెంకటసత్య ప్రింటర్స్" విజయవాడ వారు. వీరందరికి కృతజ్ఞతాపూర్వక అభివందనాలు.

గృహైక విషయకంగా సహకరించిన నెమ్మది కలిగించిన నా కుటుంబ సభ్యులు నా శ్రీమతి నిర్మల, నా కుమారులు చి॥ నాగేశ్వరరావు, చి॥ వెంకటరమణ, కోడలు శ్రీమతి నీలిమ. వీరికి నా ఆశీస్సులు.

# సర్వగురు నమస్కారము

నాకు జన్మనిచ్చిన తలిదండ్రులు శ్రీమతి కృష్ణమ్మ భూషయ్యగారలు. నన్ను పెంచి పెద్దచేసినవారు శ్రీమతి మండవ మాణిక్యమ్మ, నాగయ్య గారలు. నాకు విద్యాబుద్ధులు గరపినవారు శ్రీయుతులు కృత్తివెంటి సత్యనారాయణమూర్తి గారు. శ్రీ మోపిదేవి నారాయణమూర్తి గారు. శ్రీ పెదప్రోలు వేణుగోపాలకృష్ణమూర్తి గారు. శ్రీ కాపూరి రామకృష్ణయ్య గారు. శ్రీ తుమ్మల గోపాలకృష్ణయ్యగారు. శ్రీ తుమ్మల శ్రీరాములుగారు. శ్రీ జోస్యుల సూర్యనారాయణమూర్తిగారు. శ్రీ పింగళి ఆంజనేయులుగారు. శ్రీ పెదప్రోలు శివరామయ్యగారు. కృత్తివెంటి రామలింగంగారు ఆచార్య కాకర్ల వెంకట రామ నరసింహంగారు. ఆచార్య తూమాటి దోణప్పగారు. ఆచార్య చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ఆచార్య ఎక్కిరాల కృష్ణమాచార్యగారు ఆచార్య మధుసూదన షడంగిగారు. ఆచార్య లకంసాని చక్రధర రావుగారు.

ఈ పరిశోధన విషయమై ప్రోత్సహించినవారు ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు. ఆచార్య జాస్తి సూర్యనారాయణగారు. ఆచార్య కోరాడ మహాదేవ శాస్త్రిగారు. ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావుగారు. ఆచార్య కొత్త సచ్చిదానందమూర్తిగారు. ఆచార్య కోనేరు రామకృష్ణారావుగారు. ఆచార్య సంజీవదేవ్‌గారు. ఆచార్య వి. రామచంద్రగారు. ఆచార్య లింగంనేని బసవ శంకరరావుగారు.

వీరందరికి వినయపూర్వక నమస్సుమాంజలి.

# ఒక ఊరి కథ

**అక్కాజంపల్లె :**

అనంతపురం జిల్లా గుత్తి తాలూకా గ్రామం. అక్కాజమ్మ పల్లె వ్యవహారంలో అక్కాజంపల్లె అయింది. అక్కాజి శబ్దంపై గౌరవసూచకంగా అమ్మ చేరింది. అక్క శబ్దంపై 'జి' చేరడం మరాఠి భాషా ప్రభావం.

అక్క తెలుగున జ్యేష్ఠ సోదరికి సంకేతం. కాగా గౌరవవాచకంగా స్త్రీ నామాంత పదాలపైన, సంబోధనలోను వర్తిస్తుంది. పురుషనామాల్లో కూడా అక్కయ్య మొదలైన విధంగా కనిపిస్తుంది. సప్తమాతృకలను అక్కలుగా సంభావించడ ముంది. అక్కగల దేవరహళ్ళి అనే గ్రామం ఇదే జిల్లాలో మడకశిర తాలూకాలో వుంది. అక్కచెరువు అనే గ్రామం మార్కాపురం తాలూకాలో వుంది. పల్లె శబ్ద వివరణ ముందు చూడవచ్చును.

**అక్కుపిళ్ళ వూరు :**

శ్రీకాకుళం జిల్లా టెక్కలి తాలూకా గ్రామం. అక్కుపిళ్ళ అనే వ్యక్తి పేరు మీదుగా వచ్చిన గ్రామం. అక్కు, అక్క శబ్ద సంబంధి. అక్క శబ్దం తెలుగులో జ్యేష్ఠ సోదరి అనే భావంలో చెల్లి వస్తుంది. కాగా స్త్రీ, వ్యక్తి నామాల్లో అను బంధంగా కనిపిస్తుంది. ఉదా : తిమ్మక్క, రామక్క. కేవలం జ్యేష్ఠ సోదరి అనే అర్థంలోనే గాక, వయసులో పెద్దవారైన స్త్రీలను సంబోధించే గౌరవపదంగా కూడ వ్యవహృతము.

ఇక పిళ్ళ, పిళ్ళై అనేది తమిళనాట ఒక జాతిని సూచించే పదం. పిళ్ళారి అంటే గణపతి. మాప్పిళ్ళ అంటే, అదే భాషలో అల్లునికి సంకేతం.

ఇంక పిళ్ళ శబ్దంతో చిత్తూరుజిల్లాలో పిళ్లారిగుంట (కాళహస్తి డివిజన్) పిళ్ళ చెరువు, పిళ్ళపాలెం (చంద్రగిరి తాలూకా) పిళ్ళారి కుప్పం, పెళ్ళారిపట్టు (పుత్తూరు తాలూకా) అనే గ్రామాలున్నాయి.

కాగా పిళ్ళ అనేది తమిళ భాషలో వ్యక్తి నామాల్లో, వృక్ష, జంతు, పక్షి నామాల్లో అనుబంధంగా ఉంది. ఇంకా ఆ భాషలో పిళ్ళ శబ్దం, శిశువు, బాలుడు, కుమార్తె, చిన్న, అనే అర్థాల్లోను, ప్రాచీన వైష్ణవాచార్యులకు పెళ్ళాల్ కులంవారి బిరుద నామంగాను, భైరవునికి సంకేతంగాను కనిపిస్తుంది.

ఊరు జనావాస సూచకం అయితే ప్రధానంగా, ఊరు శబ్దం నీటి సంబంధిగా కన్పిస్తుంది. ఊరు, (సీరూరు), ఉరక, ఉరవడి, దిగుట (కాప్కు ఉరులు దిగనపి) మొదలైనవాటిని గమనించినపుడు పై అభిప్రాయం స్థిరపడుతుంది. నిరంతరాయంగా, నీటి వసరున్న చోటే, జనావాసం సుకరమవుతుంది. కావడానికి అన్ని జనావాసాలే (-పల్లె -పాడు -పఱ్రు -కుఱ్రు -తుఱ్రు) అయినా దేని అర్థాలు దానికున్నాయి. ఎప్పుడు నెడతెగక పారు ఏరు గల చోటనే నివాసముండాలంటాడు సుమతీ శతకకారుడు. ఊరు అనుబంధంగా గల గ్రామాలు చాల తక్కువగా కన్పిస్తాయి.

**అచ్చుతాపురత్రయం :**

తూర్పుగోదావరి జిల్లా కాకినాడ తాలూకా గ్రామం. అచ్చుత, అచ్యుత శబ్ద భవం. ఇది ప్రధాన గ్రామం. కాగా దీనిలో మరి రెండు గ్రామాలు చేర్చి అచ్చుతాపురత్రయంగా ఏర్పరచాడు. అలా చేర్చిన గ్రామాలు బుచ్చంపేట, రామేశ్వరం గ్రామాలు. మొత్తం మూడు గనుక త్రయ శబ్దంతో సంభావితము.

ఇక 'పుర' అనే సంస్కృత శబ్దానికి, గోడ, బలిష్టమైనది. కోట, హర్మ్యము, నగరము అని అర్థాలు కన్పిస్తాయి.

**అడవివరం :**

విశాఖ జిల్లాలో, విశాఖపట్నానికి దాపున గల, సింహాచల క్షేత్రానికి దిగువన గల గ్రామం. దీని వ్యవహార నామం అడివారం. నిజానికిదే సరైనది. అడవివరం అనేది పైదానికి కృతక ప్రామాణిక రూపం.

ఎగువున గల నరసింహ క్షేత్రం గల ప్రాంతం మాత్రమే సింహాచలం లేదా సింహగిరి. ఇందలి సింహ శబ్దం నృసింహ శబ్దం నుండి విడివడిన రూపం. కాగా దానిపై అచలం (కొండ, చలింపనది) చేరి సింహాచలమైంది. అంతేకాని చలం కాదు. కాగా వ్యక్తి నామాల్లో చలపతి అని వ్యస్తంగా, చలం అని వ్యవహారంలో స్థిరపడింది. పదస్వభావం సమంగా తెలియకపోవడం వలన ఇలా జరుగుతుంది. దీనిని భాషాశాస్త్రంలో అనుచితవిభాగం అంటారు (wrong splitting) గిరి అంటే కొండ.

ఇక అడివారం సంగతి తెలుసుకుందాం. ఇది అడవివరం కాదని చెప్పడం జరిగింది. అడై అనే తమిళ పదానికి క్రింద, దిగువ అని అర్థం. మేల్ అంటే ఎత్తు, పైన (పశ్చిమం, అధికం) అని అర్థం. కొండ పాదాన గల భూమిని అడివారం అని,

ఫలసాయంలో భూకామందుకు గల భాగాన్ని మేల్వారమని, స్వాధీనపు హక్కును, ఫలసాయంలో సేద్యగాని భాగాన్ని కుడివారమని అంటారు. వార శబ్దానికి, హద్దు, తీరము, గట్టు అనే అర్థాలున్నాయి. కనుక అడివారమంటే సింహాచలక్షేత్రానికి దిగువన (కొండపాదం) గల భూమి అని అర్థం. అంతే తప్ప అడవివరంకాదు. ఇలాంటిదే గనివారం. వ్యవహారంలో గన్నవరం అయింది. దీనిని వేరుగా చర్చింప వచ్చును. అయితే మాధారం, లక్ష్మారం మొదలైనవి మాత్రం మాధవరం, లక్ష్మవరం అనేవే. అంటే వాటిలో 'వరం' అనే అనుబంధముంది. ఇక్కడే ఒక మాట చెప్పాలి. సింహాచలం రైల్వేస్టేషన్ను నార్త్ సింహాచలం అని అంటారు. ఇందలి నార్త్ (North) ఆంగ్లశబ్దం. ఉత్తర దిగ్బోధకం. సింహాచలానికిది ఉత్తరంగా ఉండడం కారణంగా దీనిని అలా వ్యవహరిస్తున్నారు. కాగా తెలుగు ఉచ్చారణలో నారద సింహాచలమైంది. ఇక నారద మహర్షితో స్థల పురాణం చెప్పడం వింతకాదు గదా !

వరం అనే శబ్దం చేసిన తపస్సుకు, కృషికి, సాయానికి ప్రతిఫలంగా ఇవ్వ బడింది అనే అర్థంలో సుబోధకం. కాగా వరశబ్దానికి శ్రేష్ఠమైన అనే అర్థముంది. పెండ్లి కుమారుని వరుడనడం తెలిసిందే. వరించు శబ్దం, కోరు అనే అర్థంలో సమసిస్తుంది.

గ్రామనామాల్లోని 'వరం' ఇలాంటిది కాదు. ఇలాంటిదేనని భావించి, రాజు చేత ఇవ్వబడింది లేక దానగృహీత చేత కోరబడింది, అనే అర్థాలు చెప్పడం జరుగు తోంది. ఫలితార్థం గ్రామమివ్వడమే అయినా, ఇవ్వడం వలన అది వరంకాలేదు. సంస్కృతంలోని వృధాతువుకు, ఆవరణము, ఆవరింపబడిన (to enclos. enclosure) అనే అర్థాలున్నాయి. అంటే ఏదైనా పెద్ద గ్రామంనుండి కొంత భాగాన్ని ప్రత్యేకించి గ్రామంగా నిర్మించి ఇచ్చినది వరం. వరం అనే అనుబంధంతో గల గ్రామాలన్నీ వ్యక్తి, జాతి, కుల, కుటుంబపరంగా వుంటాయి. అవి కొన్ని సందర్భాల్లో దానకర్తను, మరికొన్ని సందర్భాల్లో దానగృహీతను సూచిస్తాయి.

**అడిగొప్పుల :**

గుంటూరు జిల్లా పల్నాడు తాలూకా గ్రామం. 'అడిగొప్పుల హోరుగాలి నడిగితినమీ' అన్న శ్రీనాథుని చాటు పద్యపాదం విని వుంటారు. ఇంటి పేరుగా 'అడిగోపుల' అని కన్పిస్తుంది. తరిగొప్పుల అనే గ్రామం కృష్ణాజిల్లాలోను, ఎర్రగొప్పుల అనే బేచిరాక్ గ్రామం తూర్పు గోదావరిజిల్లా ఎల్లవరం డివిజన్‌లోను వున్నాయి. బేచిరాక్ అనేది బేచిరాగ్ అనేదానికి వికృతరూపం. బేచిరాగ్ అంటే

దీపం లేనిది అని అర్థం. ఫలితార్థం ఖాళీ అయిన జనావాసం (depopule village) ఒక అడిగొప్పుల శాసనాల్లో అడిగప్పులుగా పేర్కొనబడింది.

కాగా కప్పరిలి, కప్పరద్దు అనేవి ఒక రకం గడ్డి జాతికి చెందిన మొక్క దీని శాస్త్రీయనామం Panicum Colonum, Linn. (a spreading he Malva rctundifolia L). కప్పరొట్టగిడ, అనే మొక్క కన్నడంలో కన్పిస్తుం

కప్పలవొడ్డి అనే గ్రామం కృష్ణాజిల్లా బందరు తాలూకాలోను, కప్పత్రా అనే గ్రామం కర్నూలు జిల్లా పత్తికొండ తాలూకాలోను, కప్పలబండ అనే గ్రా అనంతపురం జిల్లా పెనుకొండ తాలూకాలోను వున్నాయి.

కాగా కొప్పల్ అనే కన్నడ శబ్దానికి శివారు గ్రామమనే అర్థం, ఎత్తైన ఆ అర్థాలున్నాయి. అడశబ్దానికి దిగువ, తక్కువ అనే అర్థాలున్నాయి. బహు తక్కువ ఎత్తుగం భూమి అనే అర్థం కావచ్చు. తరి అంటే కన్నడం, ఒక రక పొదమొక్క (the shrub ovtru Acacia catecu Willd). కదిరిచెట్టు అ అంటే ఆ మొక్కలు అధికంగా గల ఎత్తైన నేల అని చెప్పవచ్చును. ఎర్రశబ్ద వర్ణసూచకం.

అత్తిరాల :

కడపజిల్లా రాజంపేట తాలూకా గ్రామం. ఇందలి రాల శిలా (రాయి సంబంధి కాదు. రేవుల (రేవు+లు) రాలగా పరిణమించింది. దుగ్గిరాల, ఓగిరా కూడా ఇలాంటివే. శాసనాల్లో అత్తిరాల అరతురేవులుగా, దుగ్గిరాల, దుర్గిరేవులు కన్పిస్తుంది. అత్తి ఒక మొక్కగా తెలిసిందే. దీనినే అత్తిపత్తి అనికూడా అంటార నిద్రగన్నేరు అనికూడా పిలుస్తారు. దీనిని స్పృశిస్తే ముడుచుకుపోతుంది. దీ శాస్త్రీయనామం (Mimosa pudica Linn). అయితే ఇది బ్రెజిల్ నుంచి కొ రాబడిందని వ్యవసాయ పదకోశం.

ఈ గ్రామనామంలోని 'అత్తి' ఇది కాకపోవచ్చు. శాసనాలలో దీని పే 'అరతురేవుల' గా కనిపిస్తుందని పైన చెప్పడం జరిగింది.

ఈ పదం తెలుగు నిఘంటువులోనికి రాలేదు. కన్నడంలో అర్ర అ పేరుతో ఒక మొక్క కనిపిస్తుంది. (The plant Barleria Celrulea Roxb) గల శబ్దంతో తెలుగులో మొక్కలు కన్పిస్తాయి. ఉదా : అందుగల, పొందుగల గ్రామాల్లో ఉన్నవి మొక్కల పేర్లే. నిజానికి 'గలగల' అనే గ్రామం కూడా వుంది

౩క తమిళంలో అరత్తై అనేది ఒక రకం పొద పేరుగా (Alpinia) కనిపిస్తుంది. ౪క అర్తమూర్తు, అర్ధవీడులలోనిది కూడా ఇదే కావచ్చును.

శాసనం : "సాళువ నరసింగయ్యదేవ మహారాజుల అవసర అణ్ణామరుసయ్యంగారు
శిద్దవట్టానకు విచ్చేసి వుండి గోకులాష్టమి పుణ్యకాలానను అరతురేవులకు
విచ్చేసి, అరతురేవుల క్షేత్రేశ్వర భయిరవదేవర "

## అధ్వాన్నం నారాయణ కట్టుబడి :

నెల్లూరు జిల్లా రాపూరు తాలూకా గ్రామం. ఇందలి అధ్వాన్నం, అధ్వాన శబ్ద సంబంధి. తెలుగు నిఘంటువులు దీనికి అమార్గము అని అర్ధం చెపుతాయి. అధ్వాన్నం చతుర్మధ్యం అనే నానుడి వుంది. సంస్కృతంలో అధ్వాన శబ్దానికి మార్గమనే అర్ధం. ఏమైనా ఇక్కడ ఇంటి పేరుగా సంభావితము. ఆ ఇంటి పేరుగల నారాయణ అనే వాని కట్టుబడి అంటే ఆవాసము అని బోధపడుతుంది.

కట్టుబడి అనేది కౌలుకు సంబంధించినపదం. ఈ కౌళ్ళలో చాలరకా లున్నాయి. భూకామందుకు సేద్యగానికి, ఫలసాయంలోగల వంతునకు సంబంధించి నది. మక్తా, భోగం, వీసబడి, పాయకారి మొదలైనవి కూడా ఇలాంటివే. లింగారావు పాలెం బిల్మక్తా' గుడిగళ్ళ భోగ, పాయకారి కండ్రిగ మొదలైన గ్రామాలున్నాయి. లోపాయకారి అనే మాట వినే వుంటారు. ఇది నిజానికి, లో, పాయకారి. పాయకారి అంటే పైన చెప్పిన వంతులాంటిది. భూకామందు దగ్గర ఒకరు కౌలుకు తీసుకుంటే, ఆ వంతును బట్టి అది పాయకారి. కాగా, ఆ కౌలుకు తీసుకొన్న వారివద్ద మరొకరు కౌలుకు తీసుకుంటే అంటే మొదట పాయకారికి లోబడినది' లోపాయకారి అవుతుంది. ఇలాంటి సందర్భంలో, ఈ ఏర్పాటు, అసలు భూకామందుకు తెలియకపోయే అవకాశముంది. ఈ అర్ధంలోనే, లోపాయకారి అనే పదం, గుట్టు, రహస్యం, మూజువాణి ఏర్పాటు అనే అర్థాల్లో స్థిరపడింది. లోపాయకారి వ్యవహారమేదో జరిగింది అనడంలో ఉద్దేశమదే.

## అనంతపురం :

ఆ పేరు గల జిల్లాకు కేంద్ర కార్యస్థానం. అనంత, పురంల కలయిక అనంతపురం. న, అంతల కలయిక అనంత. సంస్కృతశబ్దం. అంతము లేనిది, మేరలేనిది, తరగనిది అనేవి పద సంబంధమైన స్వాభావిక అర్థాలు. కాగా, విష్ణువు, ఆదిశేషుడు, కృష్ణుడు, బలరాముడు, శివుడు, వాసుకి, పార్వతి, పరబ్రహ్మము,

No : 36; S. I. I., Vol xvi

ఒక మేఘము, భూమి, అనంత చతుర్దశినాడు, కుడి భుజానికి కట్టుకునే పదునాల్గు ముడులు గల పట్టుత్రాడుకు కూడా అనంతశబ్దం చెల్లివస్తుంది. తెలుగువారి వ్యక్తి నామాల్లో కనిపిస్తుంది.

ఇక ఈ అనంతపురం వ్యక్తి నామపరంగా ఏర్పడింది. క్రీ. శ. 1364 లో అప్పటి విజయనగర ప్రభువు బుక్కరాయల దివానుగా వున్న చిక్కప్ప ఒడయరు దేవరకొండకు సమీపాన పందలేరు ప్రవాహానికి అడ్డుకట్ట పోయించి, కట్ట రెండు చివరల రెండు ఊళ్ళు కట్టించాడు. పడమటి వైపు జనావాసానికి, తన భార్య అనంతమ్మ పేరు మీదుగా అనంత సాగరమని, తూర్పువైపు జనావాసానికి తన ఏలిక పేరున బుక్కరాయ సముద్రమని పేర్కొన్నాడు. పెద్ద తటాకాలను, రాయలసీమలో సముద్రాలనటం కద్దు. ఆ అనంతసాగరం కాలక్రమంలో అనంత పురమయింది.

కాలక్రమంలో ఆనకట్టకు గండి పడినప్పుడు, దాని రక్షణ కొరకు బుక్క రాయ సముద్రానికి చెందిన బసిరెడ్డిగారి కోడలు ముసలమ్మ ప్రాణత్యాగం చేసింది.

దీనికే హండే అనంతపురం అని మరొక పేరు. క్రీ. శ. 1569 లో రామ రాయల పాలనాకాలంలో సలక తిమ్మ చేసిన తిరుగుబాటును అణచివేయడంలో తోడ్పడిన హండే హనుమప్ప నాయనికి, అనంతపురం, దాని చుట్టుప్రక్కల ప్రాంతాలు ఇవ్వబడ్డాయి. శా. శ. 1582 లో హండే హనుమంతప్ప మరణించాడు. ఆ తరువాత రెండు శతాబ్దాల పాటు అనంతపురం ఈ వంశీయుల పాలనలో వుంది ఆ విధంగా హండే అనంతపురమయింది. క్రీ. శ. 1860 వరకు ఈ వంశస్థులకు పెన్షను లభించింది. క్రీ. శ. 1882 లో, ఇది జిల్లా కేంద్ర కార్యస్థానమైనది.

అనంతపురం పేరుతో, ఇదిగాక ఇదే జిల్లాలో గుత్తి తాలూకాలో, మడకశిర తాలూకాలో గ్రామాలున్నాయి. కళ్యాణదుర్గం తాలూకాలో గల అనంతపురాన్ని రాళ్ళ అనంతపురమంటారు. ఇవిగాక చిత్తూరుజిల్లా చిత్తూరు తాలూకాలో, కాళహస్తి డివిజన్‌లో అనంతపురం అనే రాచెరువు మదనపల్లె తాలూకాలో, కడపజిల్లా కమలాపురం. ప్రొద్దుటూరు, రాయచోటి తాలూకాలో, నెల్లూరుజిల్లా కావలి, నెల్లూరు తాలూకాలలో వున్నాయి.

**అనంతవరం :**

గుంటూరుజిల్లా మంగళగిరికి సమీపంలో ఉంది. వ్యక్తి పేరు మీదుగా ఏర్పడింది. దీనిని దేవుడనంతవరం అని కూడా అంటారు. గుంటూరు తాలూకాలో మరో అనంతవరముంది. దానిని మీసరగండ అనంతవరమంటారు. మీసరగండ అనేది

ఒక ఓరుదు, ఇవిగాక, గుంటూరు జిల్లాలో నరసరావుపేట సత్తెనపల్లి, తెనాలి తాలూకాలో అనంతవరాలున్నాయి. గుంటూరు తాలూకాలో అనంతవరప్పాడు అనే గ్రామముంది.

ఇంకా అనంతవరాలు తూర్పుగోదావరి, ప్రకాశం, నెల్లూరు, విశాఖపట్నం జిల్లాల్లో ఉన్నాయి. వరం ఇంతకు పూర్వం వివరింపబడింది.

అంతకాపల్లె :

విశాఖపట్నం జిల్లా గ్రామం. దీని పూర్వనామం అనంతవాపల్లె అని శాసనాల్లో చెప్పబడింది. కాలక్రమంలో అంతకాపల్లెగా మారింది. ఇది వ్యక్తి నామపరంగా ఏర్పడింది. బహుశా అనంతక్క > అనంతకా > అంతకాగా మారి వుండ వచ్చును.

ఇక పల్లె, తెలుగువారి గ్రామనామాల్లో చాల ఎక్కువ గ్రామాల్లో ద్వితీయావ యవంగా కనిపిస్తుంది. పల్లెటూరు, పల్లెటూరు బైతు అనే వ్యవహారాలు తెలిసినవే. ఇక్కడ పల్లె శబ్దం ముఖ్యంగా రెండవ వ్యవహారంలోని దానినిబట్టి అనాగరకమనే అర్థాన్ని బోధపరుస్తుంది. ఇది పట్టణ, నగర, బస్తీవాసులు నాగరకులనీ, తద్భిన్న మైన పల్లెటూరి జనులు అనాగరకులని బోధ కాగా, పల్లెకారు అనే శబ్దం చేపలు పట్టే ఒక జాతి జనులకు సంకేతనామం. హరిజన ముఖ్యంగా మాల కులస్థులుండే, ఆవాసాన్ని పల్లెగా సంభావించడం కద్దు.

ఇక పల్లేరు (Tribulus terrestrıd, Linn) అనేది ముండ్లున్న కాయలు గల ఒక రకం పాకుడు తీగె. దీనివలన వ్యాపించు అనే అర్థం ఊహింపవచ్చును. సంస్కృతంలో పల్లెను పల్లికా శబ్దంతో కూడా సంభావించారు. పల్లి పల్లికా శబ్దాలకు చిన్న జనావాసము, గిరిజన తెగలుండే ఆవాసము అనే అర్థాలున్నాయి. పల్లి శబ్దా నికి ధాన్యాగారమనే అర్థముంది. పల్లె పల్లతి అనే ధాతువులకు వెళ్ళు చరించు అనే అర్థాలున్నాయి. వీటివలన మొదట ఇది వ్యాపనము అనే అర్థంలో ఉండేదేమోననిపిస్తుంది. కాగా బౌద్ధుల ఆవాసాలను పల్లెలని, జైనుల ఆవాసాలను పాడుయగా సంభావించారని ఒక ఊహ—

అన్నవరం :

ఈ పేరుతో చాలా గ్రామాలున్నాయి. తూర్పుగోదావరి జిల్లాలోని సత్యనారా యణస్వామి ఆలయంగల అన్నవరం ప్రసిద్ధమైనది. ఆలయం నెలకొన్న కొండను రత్నగిరి అని పేరు. కృష్ణాజిల్లా నందిగామ తాలూకాలో వైరదరి అన్నవరం, చట్టన్నవరం అని రెండు గ్రామాలున్నాయి. వైరా నదీతీరాన గలది గనుక

వైరదరి అన్నవరం. చట్టు (రాయి) గల అన్నవరం గనుక చట్టన్నవరం. వివక్ష కొరకు ఇలా ఏర్పడ్డాయి.

అన్న తెలుగులో జ్యేష్ఠ సోదరునికి సంకేతం. కాగా వ్యక్తి నామాల్లో ద్వితీయావయవంగా కూడా కన్పిస్తుంది. ఉదా : వెంకన్న, లక్ష్మన్న. తనకంటె వయసులో పెద్దవారిని పూజ్యార్థంలో ఈ పదంతో సంబోధించదంకద్దు. తమిళ, మలయాళ, కన్నడ భాషల్లో అణ్ణై, అణ్ణ అనే విధంగా కనిపిస్తుంది.

**అప్పాజీపేట :**

అనంతపురం జిల్లా గుత్తి తాలూకా గ్రామం. అప్పాజీ, మహారాష్ట్ర ప్రభావముతో వచ్చిన వ్యక్తినామం మహామంత్రి తిమ్మరుసును, కృష్ణదేవరాయలు, అప్పాజి అనే వ్యవహరించేవాడు. ఈ గ్రామానికి పూర్వం "అలుగువాటి" అనే పేరున్నట్లు శాసనంవల్ల తెలుస్తోంది. ఇక్కడ రామేశ్వరస్వామి ఆలయముంది.

అప్ప శబ్దంపై 'జీ' అనే పూజ్యార్థ సూచక హిందూస్థానీ పదం చేరి అప్పాజి ఏర్పడింది. అప్ప వ్యస్తంగా తెలుగున జ్యేష్ఠ సోదరికి సంకేతం. తండ్రి అనే అర్థం కూడా ఉంది. వ్యక్తి నామాల్లో రాయలసీమ జిల్లాల్లో పూజ్యార్థ సూచకంగా కన్పిస్తుంది.

ఇక పేట పింరాళబ్దాడవమని ప్రౌఢవ్యాకర్త బహుజనపల్లి సీతారామాచార్యులవారు. కాగా సంస్కృతంలో పేట శబ్దానికి బొత్తి, వ్రేళ్ళు చాచిన అరచేయి అనే అర్థాలున్నాయి. తెలుగులో వరుస (ముప్పేట) అనే అర్థముంది. కాగా గ్రామ నామాల్లోని పేట, శాఖానగరము, శివారు గ్రామము అనే అర్థాల్లో రూఢమైంది. కాని మొదట మొదటవ్యాపారస్థలాలకు మాత్రమే ఇది సంకేతం. కొన్ని గ్రామాల మధ్య, వ్యవసాయోత్పత్తులు, ఇతర సామాగ్రి అమ్మకం చేసేచోట్లు మొదట పేటలుగా వ్యవహరింపబడ్డాయి. అనంతరం అక్కడ జనులు నివాసముండడంతో అవి స్వతంత్ర జనావాసాలయినాయి. వారంలో నిర్ణీతమైన రోజున ఇలాంటి వ్యాపారం జరిగే చోటులు అనంతరం, ఆ రోజుల పేర్లతో జనావాసాలయినాయి. బుధవారప్పేట, శనివారప్పేట ఇలాంటివి. లబ్బీపేట (విజయవాడ) శాఖానగరానికి ఉదాహరణ. చిలకలూరిపేట శివారు గ్రామానికి (పురుషోత్తమపట్నం) ఉదాహరణ.

**అప్పాపురం :**

ఇది వ్యక్తి నామపరంగా ఏర్పడిన గ్రామం. ఈ పేరుతో చాలా గ్రామాలుండవచ్చు. అప్ప శబ్దానికి జ్యేష్ఠసోదరి, తల్లి, తండ్రి, అనే అర్థాలున్నాయి. వ్యక్తి

నామాంత్యపదంగా కూడా (రామప్ప, బసవప్ప) కన్పిస్తుందని ముందు చెప్పడం జరిగింది. సింహాచలంలోని దేవుని అప్పన్నగా సంభావించడం కద్దు. ఇక నరసరావు పేట తాలూకాలోని అప్పాపురం కోట కమ్మనాంటిసీమ స్థలంబునందలిదిగా చెప్ప బడింది. కమ్మనాడు తర్వాత వివరింపబడుతుంది. కోటవంశస్థులు ధరణికోటను పాలించారు. వారి అధీనంలో గల కమ్మనాటి భాగం కోట కమ్మనాడు. ధరణికోట నుండి కొణిదెన వరకు కొండవీటి కొండలకు వెనుకగల భూభాగాన్ని కోటకమ్మ నాడుగా భావించవచ్చు. పురం ఇంతకుపూర్వం వివరింపబడింది.

**అప్పారావుపేట :**

పశ్చిమ గోదావరిజిల్లా ఏలూరుతాలూకా గ్రామం. నిజానికి దీని పూర్తి పేరు రామచంద్ర అప్పారావుపేట. పూర్వపు దినాల్లో ఈ ప్రాంతం నూజివీడు పాలన లోనిది. ఆ వంశంలోని పాలకులందరికి 'అప్పారావు' అనేది సామాన్య బిరుదు నామం. 'మేకా' అనేది ఈ వంశపు గృహనామం. మూలపురుషుడు మేకా బసవన్న. గొల్లపల్లి వీరి మొదటి ఆవాసం. శ్రీ బసవన్న తర్వాత ఆయన మునిమనుమని (కోనప్ప) కుమారుడు వెంకటాద్రి. ఆ పిదప ఈయన కుమారుడు అప్పన్న ఈ పరగాణాకు ఏలికలైనారు. ఈయనను విజయ అప్పారావు అంటారు. 1667లో ఈయన గోల్కొండ నవాబులనుండితహవీర్, వజాలాలత్, దస్తుగహ అనే బిరుదు పొందడమే గాక రాజాబహదూర్ అప్పారావు అనే సంభావనను పొందాడు. ? నుండి ఈ వంశస్థులందరికిఅప్పారావు అనేది ఆనువంశిక నామమైంది.

ఇక చర్చలోని రామచంద్ర అప్పారావు 1931 మార్చి 1వ తేదీన జమీందారీ పాలనకు వచ్చిన శోభనాద్రి అప్పారావుగారి తండ్రి. వీరి తల్లిగారు తన భర్త పేరుతో, స్వంత ధనంతో ఈ గ్రామం నిర్మించినట్లు నమోదైన సాక్ష్యముంది. సమీపంలోని అప్పారావుపాలెం కూడా ఈ వంశస్థుల పేరుమీదుగా వచ్చిన గ్రామమే. నిడదవోలు వరకు ఈ వంశస్థులు పాలన చెల్లివచ్చింది.

**అమరావతి :**

ఈ అమరావతి (గుంటూరుజిల్లా) పంచారామాల్లో ఒకటిగా చెపుతారు. ప్రసిద్ధ బౌద్ధక్షేత్రం. ధాన్యకటకము, బెజ్జాకటకమనే పేర్లు కూడా ఉన్నాయి. ధాన్యశబ్దం తెలిసిందే. అయితే ఇచ్చట ధాన్యశబ్దం కేవలం ధాన్యానికి గాక సంపదకు కూడా సంకేతం. ఇక కటకం. అడవిలోని పల్లెను కటకమంటారు. ఒరిస్సా

లోని కటక్, బిస్సం కటక్, చిత్తూరు జిల్లాలోని నగరి కటకం ఇలాంటివే. ఇ
కటకంలోని బెణ్ణ, వెణ్ణ నుండి ఉత్పన్నమయింది. వెణ్ణ, వేణికి మారురూపం.
కృష్ణవేణికి అంటే కృష్ణానదికి సంకేతం. బెణ్ణా కటకమంటే కృష్ణవేణికి సమీపాన
కటకమని అర్థం. ఈ అమరావతిని చాలామంది పరిపాలించారు. చివరివాడు వాసి
వెంకటాద్రినాయుడు. వీరు చింతపల్లి జమీందారులు. అమరావతిని రాజధానిగా
కున్నది వెంకటాద్రినాయుడు. అమరావతి ఇంద్రుని నగరంగా తెలిసిందే.
చారిత్రక కాలంలో దీనిని కోట వంశస్థులు పరిపాలించారు. అప్పట్లో దీని
కొండపల్లి సీమగా వ్యవహరించేవారు. కొండ అంటే కొండవీటి కొండలు. దాని
ప్రక్కగా ఉన్న సీమ. సమీపంలోని సీమ గ్రామసత్తం అని గ్రామానికి చేరుని
ఉన్న భూములను అంటారు. దీనికి సమీపంలోని గ్రామాలు, కోగల్లు, తాడివాయ
చల్లగరిగ, గెంజిపాడు, అమ్మలపూడి. వీటిలో కోగల్లును కోటకేతరాజు తమ త
పేరుమీదుగా సబ్బాంబికాపురంగా మార్చాడు. తాడివాయ, చల్లగరిగ, గెంజిపాడ
గ్రామాలను తన తండ్రి పేరుమీదుగా, భీమాపురములుగా మార్చాడు. అమ్మలపూడి
అన్న తన చోడరాజు పేరుమీదుగా చోడపురంగా మార్చాడు. కాని ఆ పేర్లు నిల
లేదు.

**అమాని చిరువెళ్ళ :**

ఇది నెల్లూరుజిల్లా గ్రామం. చిరువెళ్ళ అనేది గ్రామం పేరు. ఇది చిరువెళ్ళ కాదు. చిరవు ఎళ్ళ. ఇలాంటిదే తురుమెళ్ళ. ఇవి మొక్కల పేర్లు. చిరువేరు తెలిసిందే గదా. ఇక ఎళ్ళ లేక ఎన్న అనేది గ్రామనామ ద్వితీయావయవంగా చాలా గ్రామాల పేర్లలో కన్పిస్తుంది. నాదెళ్ళ, వేజెండ్ల, అవులెన్న, నూజెళ్ళ అన్నీ ఈ కోవలోనివే వస్తాయి. ఆయా మొక్కలు వ్యాప్తమైన స్థానిక భూభాగంగా దీనిని భావిస్తున్నాను.

అమాని అనేది ఉర్దూపదం. ఇది రెవెన్యూ పాలనా పరమైన పదం. వెనుకటి తరాల్లో మనకు జమీందారీ వ్యవస్థ ఉంది. అదే సమయంలో కోస్తా జిల్లాలలో, ఇంగ్లీషువారి పాలన కొనసాగింది. స్థానిక జమీందారులు, ఇంగ్లీషు 'కంపెనీ' పాలకు లకు జరిగిన వాదోపవాదాలు ప్రసిద్ధమైనవే. జమీందారులు, తమ జమీలోని భూములను తాము కొంత స్వంత కమతంగా ఉంచుకొని, మిగతా భూములను స్థానిక రైతులకు కౌలుకు, మక్తాగా బిల్‌మక్తాగా, శేరీగా, ఈనాముగా, మొఖాసాగా ఇస్తుండేవారు. పై పదాలు ఫలసాయాన్ని పొందడంలో రైతుకు జమీందారుకు గల వంతులోని నిష్పత్తిని సూచిస్తాయి. జమీందారీ వ్యవస్థను క్రమంగా బలహీనపరచడంలో,

భూస్వామ్యంలో గల వివాదాలను ఆసరాగా తీసుకొని కంపెనీవారు భూమిని తమ అధీనంలోనికి తీసుకొని సాగుదార్లకు దఖలు పరిచారు. అలా చేయబడ్డ గ్రామాలను అమానీ గ్రామాలని వ్యవహరించేవారు. అమానీ అంటే ప్రభుత్వం. దాని అధీనంలో గలది అని అర్థం. అలా చేయబడ్డ గ్రామాలలో చిరువెళ్ళ ఒకటి. గుంటూరుజిల్లాలో అమాని వ్యవస్థకు అంకురార్పణ చేసినవాడు నాటి జిల్లా కలక్టరు ఓక్స్‌దొర. ఇతనిపై కృతజ్ఞతాభావంతో రేపల్లె తాలూకాలో ఏర్పడిన ఆనావాసం ఓక్స్‌పేట.

**అమీన్‌బాద :**

ఇది గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా గ్రామం. అమీన్, ఆబాద్‌ల కలయిక అమీన్‌బాదు. ఏదైనా ఒక పాలనా ప్రాంతంపై తాత్కాలికంగా నియమింపబడిన అధికారి, రాచకార్యంపై పంపించబడ్డ అమలుదారుడు. న్యాయాధిపతి అనే అర్థాలు, 'అమీన్' శబ్దానికున్నాయి.

ఇక ఆబాదు ' అంటే అభివృద్ధి అయిన, బస్తీ అయిన ఆవాసము. సాగుబడి చేయబడ్డ ప్రాంతం. ఇక చర్చలోని అమీన్‌బాద మాలిక్ అమీన్‌దారు మీదుగా ఏర్పడింది. మహమ్మద్ కులీ పాదుషా ప్రధాని శక సంవత్సరం 1514 (క్రీ.శ. 1592) నందన సంవత్సర వైశాఖ శుద్ధ తదియ గురువారంనాడు కొండవీటి సీమలోని సామంతులు తిరుగుబాటు చేయగా, దాని నణచివేయుటాఖకి పాదుషా ఆజ్ఞ మేరకు ఈ మాలిక్ అమీన్ ఇక్కడకు వచ్చాడు. నాటినుండి అప్పటి గల గ్రామంపేరు ఇతని పేరుమీదుగా వ్యవహారంలోకి వచ్చింది. దీని అసలు పే ముల్లంగూరున ఆ గ్రామంలోని దుర్గాపరమేశ్వరియైన ముల్లగూరి శక్తికి బొక్కసం నాగపనాయనిగారు శ. క. 1496 (క్రీ. శ. 1574) భావసంవత్సర జ్యేష్ఠ పౌర్ణమి నాడు, ముల్లగూరు గ్రామంపై వచ్చే ఆదాయంలో సగభాగం దానంచేశాడు. మిగతా సగభాగం రాజుకు చెందుతుంది. ఈతడు కొండవీటిసీమపై అధికారి. ఈ అధికారం అతనికి విజయనగరాన్ని పాలిస్తున్న శ్రీ రంగదేవ మహారాయులు సంప్రాప్తింపచేశారు.

ఈ ముల్లగూరి శక్తి కొండవీటి రెడ్డిరాజుల ఇలవేల్పు. ఈ పేరుతో రాజ మహేంద్రవరంలో వీరభద్రారెడ్డి పాలనా కాలంలో శక్తి దేవాలయముంది "పాలించునే వీటి ప్రాగుదృక్కోణంబునుమటోటి శ్రీ ముల్లగూరి శక్తి" అంటాడు కవిసార్వ భౌముడు.

కాగాశక సంవత్సరం 1337 మన్మధవత్సరం మఖమాసము పూర్ణిమనాడు, కొండవీటి నేలిన రాచవేమారెడ్డి, తన తల్లి సూరమాంబ, నేటి ఫిరంగిపురం సమీపాన,

సంతానసాగరమనే పేరుతో కట్టించిన చెరువుకు, నీటి సరఫరా నిమిత్తం ఈ ముల్లగూరు నుండి కొండవాగులను మళ్ళించి, జగనొబ్బ గండకాలువ తీయించాడు. జగనొబ్బగండ అనేది సూరమాంబ తండ్రికి (రాచ వేమారెడ్డి తాత) గల బిరుదు. ఇతడు అమరావతికి ప్రభువు.

ఇక ముల్లగూరు పదవ్యుత్పత్తి. ముల్ల, కుర్రుల కలయిక ముల్లగూరుగా పరిణమించింది. కుర్రు, ప్రవాహాల వెంట గల ఎత్తయిన భూములను సూచిస్తుంది. ముల్ల ఒక రకం అడవిమల్లె. పైన ప్రస్తావించిన మాలిక్ అమీన్ పేరు మీదుగా ఏర్పడిన మరో గ్రామం మందడం. సమీపంలోని మల్కాపురం. దీనికే శ్రీ రుద్రదేవీ పురమనే పేరుండేది. కాకతి గణపతి దేవుని కుమార్తె రుద్రమ పేరుమీదుగా ఆ గ్రామమేర్పడింది.

**అమృతలూరు :**

తెనాలి తాలూకాలోని గ్రామం. దీనిని అమర్తలూరు అనికూడా అంటారు. శాసనాల్లో[8] దీనిని అముతునూరు. అమర్త (Cammelina benghalensis. Linn) అనేది ఒక రకం కాడమొక్క. అమృతలూరు కృతకరూపం. ప్రాశస్త్యాన్ని అంటగట్టే దిశగా మార్పుచేయబడిన వ్యవహారం. ఊరు పూర్వం వివరింపబడింది.

**అంబవరం :**

కడపజిల్లా గ్రామం. అంబ, వరం - అంబవరం అయింది. ఈ గ్రామాన్ని పుష్పగిరియందు వేంచేసియున్న చెన్నరాయనికి తాళ్ళపాక అన్నమాచార్యుల మనుమడు తిరు వెంగళనాధయ్య వారు సమర్పించినట్టు శాసనం చెపుతోంది. ఇది వారికి అగ్రహారగ్రామం. శక 1481 (క్రీ.శ. 1559) సిద్ధార్థి నామ సంవత్సరం ఆషాఢ బహుళ ద్వాదశినాడు ఈ శాసనం వేయబడింది.

ఈ అంబశబ్దం తెలుగున అమ్మ అయింది. దుర్గ, పార్వతి, శక్తి, దేవతలను అంబశబ్దంతో సంభావిస్తారు. సప్తకృత్తికలలో ఒకరిపేరు అంబ. తెలుగువారి స్త్రీ వ్యక్తి నామాల్లో కన్పిస్తుంది.

**అయ్యంకి :**

అయ్యంకిలోని అయి శబ్దానికి అర్థం నీటికి అంటివున్న, నీటికి మొగదల వున్న భూమి అని అర్థం. ఇది కృష్ణాజిల్లాలో వుంది. ప్రస్తుతం ఈ ఊరు దగ్గర ఏ ప్రవాహము ఉన్నట్లుకన్పించదు. అయితే ఒకప్పుడు కృష్ణ బందరువైపుకు ప్రవహించింది. పామర్రుకుసమీపానగల పుల్లేరు, నాగులేరు, లంజకాల్వ, పెదపూడినుంచి ప్రవహిస్తున్న

భీమేరు ఇవన్నీ ఒకప్పటి కృష్ణానదీ భాగాలు, అప్పటి స్థితిలో దీని అర్థాన్ని భావించాలి. కాగా అయ్యగడ్డ (Fimbristylis Speeics) అనేది తుంగలాగా పెరిగే కలుపు మొక్క. అందువలన మొక్క పేరుతో కూడా వచ్చి యుండవచ్చును.

ఇక అంకి అంటే హద్దు. మేర, అడ్డ కి తెలుసు. అడ్డు, అంకి రెండూ ఒకటే. హద్దు, అదుపు అంటున్నాంగదా. అలాగన్నమాట "అంకిలి సెప్పలేదు చతురంగ బలంబులతోడ నెల్లియో పంకజనాభ" అని పోతన్నగారి భాగవత ప్రయోగం ఇక గ్రామనామాల్లోని అంకి అంటే కూడ, మేర, అవధి అనే అర్థం. అంటే సమీపంలోని నదీప్రవాహానికి ఆ చోటు హద్దు అన్నమాట. అంటే అది దాటి ప్రవాహం ఆ వైపుకు విస్తరించదు అని అర్థం. ఈ అంకి అనేదానితో ఉన్న గ్రామాలన్నీ నదులు, ప్రవాహాల సమీపంలోనే వుంటాయి. గమనించి చూడండి. వీరంకి, పోరంకి, తాడంకి, రోణంకి, జలదంకి, నూతక్కి, మున్నంగి, వేళంగి, రేలంగి మొదలైనవాటిని పరామర్శించండి. నదికి ఎంత వరద వచ్చినా, ఆ మేరదాటి పొన్నతూ విస్తరించలేదన్నమాట. ఒక్కసారి, గ్రామనామకరణ విషయంలో మన పూర్వులు ఎంత శ్రద్ధ వహించారో ఆలోచించిచూడండి. అలాగే 'పూడి' అనే గ్రామాలన్నీ ఒకపాటి వరదకు మునిగిపోతాయి. 'పర్రు' ఒకపాటి వరదకు మునగదు. తుర్రు, కుర్రు, మిర్రు అనేవి ఎప్పటికీ మునగవు.

'ఏండ్లూ పూండ్లూ' అనేమాట విని వుంటారు. ఏదైనా ఒక పని చేయడానికి ఎక్కువ కాలం పడితే ఏండ్లూ పూండ్లూ పట్టిందంటాము. అంటే కాలాన్ని బోధిస్తున్నది. పెద్దన్నగారు మనుచరిత్రలో ఈ అర్థంలోనే ఉపయోగించారు. నిజానికిది సరికాదు. దానికి ఈ అర్థం ఎలా వచ్చిందో చూడండి.

ఏండ్లు అంటే సంవత్సరాలు అని చెప్పటం సులభమే. మరి పూండ్లు అంటే చెప్పలేరు. నిజానికిచ్చట ఏండ్లు అంటే ఏరులు, నదులు అని అర్థం. పూండ్లు అంటే పూడిక నేలలు, బురదనేలలు. ఏరులను పూండ్లను, అధిగమించి రావాలంటే కాలయాపన జరుగుతుంది. ఆ విధంగా ఆ అర్థం సిద్ధించింది. పెద్దన్నగారు అలా ప్రయోగించడానికి కారణం వ్యవహారబలమే. పూండ్ల గ్రామం తెలుసుగదా—

**అయ్యవారిపల్లె :**

కడపజిల్లా బద్వేలు తాలూకా గ్రామం. అయ్యవారు అంటే ఉపాధ్యాయుడు, గురువు అనే అర్థాలున్నాయి. తమిళనాడులో అయ్యంగార్లు అని చెప్పబడే బ్రాహ్మణులున్నారు. అయితే ఇక్కడ పై అర్థాల్లోకాక, అయ్య అనేపేరు గలవారి పల్లె

కావడానికి వీలుంది. అయ్య అనేది యాదవులకు బిరుదు నామం కూడా. మరొక అయ్యవారి పల్లె కమలాపురం తాలూకాలో వుంది. అయ్యవారి కంబాలదిన్నె అనే గ్రామం జమ్మలమడుగు తాలూకాలో వుంది. దీనికి కారణం మలమీద కంబాలదిన్నె అనే మరో గ్రామం ఇదే తాలూకాలో వుండడం. అయ్యవాండ్లపల్లె అనే గ్రామం చంద్రగిరి తాలూకాలో, అయ్యవారి నాయుడుఖండ్రిక తిరుత్తని తాలూకాలో వున్నాయి. నెల్లూరుజిల్లా గూడూరు, రాపూరు తాలూకాల్లో అయ్యవారిపాలెం, ఉదయగిరి, కనిగిరి, కందుకూరు తాలూకాల్లో అయ్యవారిపల్లె, సూళ్ళూరుపేట తాలూకాలో అయ్యపాలెం, గంగులవారి అయ్యవారిపల్లె అనే గ్రామాలున్నాయి. అయ్యవారి రుద్రవరం అనే గ్రామం కృష్ణాజిల్లా కైకలూరు తాలూకాలో వుంది. ఇవిగాక అయ్యన పేరుతో పల్లెలు, పాలెంలు ఉన్నాయి.

పై పేర్లనుబట్టి ఇది జాతిపరంగా వచ్చిందని బోధపడుతుంది. ఈ 'అయ్య' అనేది ఒక వంశనామం కూడా. ఈ వంశస్థులు తమిళనాడులోని రామనాథపురం ప్రాంతాన్ని 8, 9 శతాబ్దాలలో పరిపాలించారు. వీరి ఇష్టదైవం వేణుగోపాలకృష్ణుడు. కృష్ణా మండలంలోని దివి ప్రాంతాన్ని అయ్య వంశస్థులు పాలించారు. జాయప సేనాని ఈ వంశస్థుడు. ఈతని ఇద్దరుఅప్పసెల్లెండ్రను కాకతిగణపతి వివాహమాడాడు. ఈ మేరకు శాసనాధారాలున్నాయి. ఈ వంశస్థులు కట్టించిందే దివిసీమలోని హంసల దీవి వేణుగోపాలస్వామి ఆలయం. ఇక్కడి శాసనాలు తమిళంలో వుండడం విశేషం. ఇక కాసుల పురుషోత్తమ కవి 'లలిత కృష్ణాబ్ధి సంగమస్థల విహార పరమ కరుణా స్వభావ గోపాలదేవ' అనే మకుటంతో చెప్పిన వేణుగోపాల శతకం ఈ దేవుని గూర్చి చెప్పినదే. అయ్యవారి పోలవరం అనే గ్రామం తూర్పుగోదావరి జిల్లాలో వుంది.

**అలమేలు మంగాపురం :**

తిరుపతి సమీపంలోని ఈ గ్రామం పేరు వినని వారుండరు. నిజానికి దీని పేరు ఇదికాదు. అసలుపేరు తిరుచానూరు. 'తిరు' అనేది వైష్ణవాలయాలున్నచోట వ్యవహరింపబడుతుంది వివరణ ముందు ఇవ్వబడుతుంది. చానూరును అకునూరుతో పోల్చి చూడండి. చా, చాను అంటే ఒక రకం మొక్క. ఇక ఈ పేరు రావడానికి కారణం అక్కడ లక్ష్మీదేవి (మంగాదేవి) ఆలయముండటమే. లక్ష్మీదేవిని అలర్‌మేల్మై మంగతాయారు అంటారు. అలరులపై (పుష్పాలపై, తామరపై) వేంచేసియున్న మంగతాయారు. మేల్మై అంటే ఎత్తైన అని అర్థం. మంగశబ్దం మంగళశబ్ద భవం, తాయారు అంటే అమ్మ అని అర్థం.

అయితే చిత్తూరు జిల్లాలో చాలా మంగాపురాలున్నాయి. పైది చంద్రగిరి తాలూకాలోనిది. మిగిలిన మంగాపురాలు చిత్తూరు తాలూకాలో మంగాపురం, మంగమాంబాపురం, కాళహస్తి తాలూకాలో మంగమాంబాపురం, శక్తి గణపేశ్వరం అనే కోట మంగాపురం, పుత్తూరు తాలూకాలో అలమేలు మంగాపురం, వేపగుంట అనే అలమేలు మంగాపురం, అలమేలు మంగతాయారమ్మ అగ్రహారం, తిరుత్తని తాలూకాలో అలమేలు మంగాపురం, మంగాపురం అనే గ్రామాలున్నాయి. నెల్లూరు జిల్లా ఉదయగిరి తాలూకాలో అలవేలు మంగాపురం అనే గ్రామం కలదు.

**అలుగురాజుపల్లి :**

ఇది పల్నాడులోనిది. దీని పూర్వనామం 'గంద్రకోట అనుంగురాజుపల్లి' అని శాసనాల్లో వుంది. ప్రస్తుతం అలుగురాజుపల్లి అనే వ్యవహరిస్తున్నారు. పలనాటి నేలిన వారి వంశంలో అనుగురాజు కలడు.

శాసనం : (అప్పాజిపేట, గుత్తి తాలూకా, అనంతపురం జిల్లా)

క్రీ.శ. 1548 సదాశివరాయల కాలం.

"జగతాపగుత్తికి చెల్లే పెనమాంగిణి పెన్నకచెర్ల సీమ పాలించనడపగా, ఆ రామరాజుగారు తమ పెంనకచెర్ల సీమలోని అలగువాట గ్రామమందు రావిమాని కాలువ ఆథాతిథి పుణ్యకాలమందు అలుగువాటి రామేస్వర దేవునికి ... ...." [1]

**అల్లాపల్లె :**

అనంతపురం జిల్లా గ్రామం. ఇస్లాం మతానుయాయుల దైవం 'అల్లాహ్' పేరులో ఏర్పడింది. దీని పూర్వనామం నరసింహపురం. బహుశా విజయనగరరాయ వంశస్థుల్లోని వ్యక్తి పేరు మీదుగా ఏర్పడి ఉండవచ్చును. అనంతర కాలంలో మహమ్మదీయ పాలనా ప్రభావంతో పై విధంగా మార్చబడి, అదే వ్యవహారం స్థిర పడింది.

**అవనిగడ్డ :**

కృష్ణాజిల్లాలోని దివి తాలూకాకు ముఖ్య కేంద్రం. అవని అంటే భూమి అని చెపుతారు. ఆ పదానికి ఆ అర్థం అన్నమాట వాస్తవమే. దీనినే అవనిజపురమని, అవనిపురమని, ధనదవోలు అని సంభావించిన దాఖలాలున్నాయి. కాని నిజానికిది అయినిగడ్డ. స్థానికంగా సామాన్య జనానీకం ఇప్పటికీ అలాగే ఉచ్చరిస్తారు. అది

[1] No. 166 Vol. xvi

పొరపాటని భ్రమించి, దానిని అవనిగా ఉచ్చరిస్తున్నారు. అయిని లేక అయిశబ్దా ర్థం నీటిని అంటివున్న, నీటికి మొగదల ఉన్న భూమి అని, అయ్యంకి ప్రస్తావించినపుడు చెప్పబడింది. ఇది కృష్ణానది ఒడ్డునే ఉంది. అయ్యం అయిలూరు, అయినవోలు, అగినిపర్రు (అయినపర్రు) మొదలైనవన్నీ నీటిని అం ప్రవాహాలను అంటివుండటం గమనార్హం. ఇందులో అయినవోలు తప్ప అన్నీ కృష్ణ నదిని అంటి ఉన్నాయి. అయినవోలు గుంటూరుజిల్లాలో కొండవీటి వాగ (పుల్లేరు)ను అంటివుంది. ధనదుడు అంటే కుబేరుడు.

గడ్డ అంటే ఎత్తైన భూమి. ముఖ్యంగా ప్రవాహాల వెంట గల భూమి ప్రత్యేకం. వక్కలగడ్డ, పురిటిగడ్డ, కొక్కిలిగడ్డ, యార్లగడ్డ ఇలాంటివి. ఇక గ లేక గెడ్డకు ప్రవాహమనే అర్థం, గిరిజన ప్రాంతాల్లో వుంది. లోతుగడ్డ అనే పేర ప్రవాహం వల్లనే వచ్చింది.

**అవురుపూడి :**

కృష్ణాజిల్లా గ్రామం, 'అవురు' (A variety of Saccharum spontaneum) అనేది ఒక రకం గడ్డి. పూడి అంటే ప్రవాహ సమీపాన, మునకకు (పూడు) గురి కాగల భూభాగం. ఈ గ్రామం పుల్లేరుకు సమీపాన ఉంది. ఈ పుల్లేరు (కృష్ణా జిల్లా) కు సంస్కృతీకరణం మలాపహారిణి. ఈ అవురుకు పూర్వరూపం అగురు, సువాసనగల నూనెను అగరుసూనె అనడం తెలిసిందే.

**అహోబిలం :**

కర్నూలు జిల్లాలోని ప్రసిద్ధ వైష్ణవక్షేత్రం. అహో, బిల శబ్దాల కలయిక హోబల అని చెప్తారు. శ్రీ నరసింహుని శక్తికి అబ్బురపడి, అహోబల అనడంవలన అలా ఏర్పడిందని వ్యుత్పత్తి చెపుతారు. ఎఱ్ఱనామాత్యుడు హరివంశంలో ఈ కథనే కథనం చేశాడు. కాని నిజస్థితి ఇది కాదు.

అహో, బిలం ల కలయిక అహోబిలం. అహో శబ్దం సంస్కృత శబ్దం 'అధస్' నుండి ఉత్పన్నమైన ప్రాకృత పదం. క్రింద అని అర్థం. క్రిందగల బిలం అని అర్థం. బిలం అంటే భూమిలోపల మూళిగగా ఏర్పాటైన ప్రదేశం. అయినపుడు బిలం ఎప్పుడూ క్రిందే ఉంటుంది. అయినపుడు తిరిగి క్రింద ఉన్న బిలం అనడం సరియైనది కాదనిపిస్తుంది. నిజమే, కాని ఆకాశానికి ఊర్ధ్వబిలమని సంకేతం. ఆకాశం దేవతలుండేచోటు అని భావన. అహోబిలంలో నరసింహదేవర వెలిశారు. ఊర్ధ్వబిలానికి వ్యతిరేక దిశలో ఏర్పడిన పదం అహోబిలం.

ఈ శబ్దం ఓబుళగా రూపెత్తింది. అనంతపురం జిల్లాలోని ఓబుళదేవరపల్లి ఇలా ఏర్పడిందే. పెన్నానది ఒడ్డున వచ్చిన ఓబుళ గ్రామం పెన్నోబులమనుంది. ప్రసిద్ధక్షేత్ర నామాలు వ్యక్తి నామాలుగా రూపొందాయి. ఉదా: చిదంబరం, శ్రీశైలం, తిరుపతి, తిరుమల, మంగళాద్రి, సింహాచలం. ఇదే పద్ధతిలో ఓబుళ కూడ వ్యక్తినామంగా కుదురుతుంది.

**ఆకుమళ్ళ :**

కర్నూలు జిల్లా కోయిలకుంట్ల తాలూకా గ్రామం. అవుకుసీమలోనిదిగా శాసనంలో పేర్కొనబడింది.

శాసనం : కోయిలకుంట్ల తాలూకా, కర్నూలుజిల్లా.

క్రీ. శ. 1544. సదాశివరాయల కాలం.

"శ్రీమన్మహామండ్లేశ్వర సోమ వంశాధీశ్వరులైన ఆత్రేయ గోత్ర పవిత్రులైన ఆరవీటి బుక్కరాజుగారి ప్రపౌత్రులు రామరాజుగారి పౌత్రులు తింమరాజుగారి పుత్రులు చినతింమ్మయ్య దేవమహారాజులు గారు యజన యాజన అధ్యేయన అధ్యాపక దాన దానప్రతిగ్రహ షట్కర్మ నిరతులైన ఆకుమాళ స్థితాసేష విద్వంన్మహాజనాలున్ను ఇచ్చి ధంర్మశాసనము మా నాయకరానకు చెల్లె అవుకుసీమలోని మీ ఆకుమాళ అగ్రహారన నగరికి . "[1]

ఆకుమడికి బహువచనం ఆకుమళ్ళు. ఆకునూరు, ఆకులమన్నాడు, ఆకుల అల్లూరు మొదలైన గ్రామాలున్నాయి. తమలపాకులను వ్యవహారంలో 'ఆకులు'గా సంభావిస్తారు. తెల్లాకులు అంటే కూడా తమలపాకులే. ఈ మేరకు క్రీడాభిరామంలో (తెల్లనాకులు) ప్రయోగముంది. తెల్లాకుల ఇంటిపేరు గలవారున్నారు. 'ఆకుల' కూడా ఇంటిపేరుగా కన్పిస్తుంది. ఆకుమళ్ళ రామయ్య ఖండ్రిక అనే గ్రామం చిత్తూరుజిల్లా పుత్తూరు తాలూకాలో వుంది. ఆకుల అల్లూరనే గ్రామం నెల్లూరు జిల్లాలో వుంది.

మడి, చిన్న పరిమాణం గల భూమికి, సాగు భూమికి, నారుపోసి పెంచే కొద్దిపాటి నేలకు సంకేతం. కాగ మడిచీర అంటే తడిచీర, తడినేల అనేది మడికి సహజార్థం.

[1] No. 134; Vol. xvi

**ఆకురాజపల్లె :**

పల్నాడు తాలూకా గ్రామం. అయితే శాసనాల్లో ఇది ఆకరాజపల్లిగా కన్పిస్తుంది. ఈ గ్రామంతోపాటు పినగారపాడు, కరాలవీడు మొదలైన గ్రామాలపై వచ్చే ఆదాయాన్ని కుమారగిరిరెడ్డి తాను కట్టించిన అనంతగిరి నరసింహస్వామికి సమర్పించారు.

వ్యక్తి నామపరంగా ఆక లేక ఆకు శబ్దాలకు తెలుగున అర్థాలు కానరావు. పత్ర సూచకార్థం ఇక్కడ సరిపడదు. అయితే కన్నడంలో ఆకె శబ్దానికి బలము, శక్తి అనే అర్థాలు. ఆకెవాళ అంటే, శక్తి సంపన్నుడు, బలవంతుడు అనే అర్థాలున్నాయి. తెలుగున ఆక శబ్దానికి నిరోధము, అడ్డగింత, అనే అర్థాలున్నాయి. ఆకరాయి పదము తెలిసిందే. రాజు, ప్రభువు అనే అర్థంలో తెలిసిందే. వ్యక్తినామాల్లో నామాంత్య పదంగా క్షత్రియ వంది కులాల్లో కన్పిస్తుంది. నియోగి బ్రాహ్మణుల ఇంటి పేర్లలో కూడా అంత్యపదంగా కన్పిస్తుంది. ఉదా : మాచిరాజు, బుద్ధిరాజు, ప్రస్తుత గ్రామ నామం వ్యక్తి నామ సూచి గావచ్చును. లేదా గృహనామ సూచిగా వచ్చును. అప్పుడు పూర్వరూపం ఆకురాజు వారి పల్లె అయివుంటుంది. కాలక్రమంలో వారి లోపించి వుండవచ్చు. గృహనామం కూడా వ్యక్తి నామం వలననే వచ్చింది. పల్లె పూర్వం వివరింప బడింది.

**ఆకులమన్నాడు :**

కృష్ణాజిల్లా గ్రామం. మన్నాడు, మన్ననాడు, మన్న అంటే సాగుభూమి మరుమన్న అంటే బీడుభూమి. బంజరు నేల. నాడు అంటే ప్రాంతం. ఆకుల మన్నాడు అంటే ఆకులు(తమలపాకులు) పండే ప్రాంతం. ఇలాంటిదే ఆకుల అల్లూరనే గ్రామం కూడా వుంది. ఇక ఇది ఆకులమన్నాడు కావడానికి కారణం, మరొక మన్నాడు వడ్లమన్నాడు వుండడమే వడ్లు అంటే వరిధాన్యమే. వడ్లపూడిలోని వడ్ల శబ్దం కూడా వరిధాన్యాన్నే సూచిస్తుంది. ఇక్కడొక విశేషం. మిగిలిన ధాన్యాలకు, ఇతర దినుసులకు, ఆయా మొక్కల పేర్లే వాటి ఫలాలకు వర్తిస్తుంది. మామిడిచెట్టు - మామిడికాయ, పెసరమొక్క - పెసలు, జొన్నపైరు-జొన్నలు, కందిమొక్క - కందులు, కాని వడ్ల పంటను ఇచ్చే పైరును వరి అంటారు. ఇది కొంత విచిత్రంగా వుంది కదూ !

వరిధాన్యానికా పేరు రావడానికి గల కారణం గమనిస్తే సమస్య విడిపోతుంది. సంస్కృతంలో 'వృద్ధి' శబ్దం తెలుగులో వడ్డి అయింది. అసలు వడ్డి పాయిదాల విషయం తెలుసుగదా. ఆ 'వడ్డి' శబ్దంపై బహువచనం చేరి 'వడ్లు'

అయింది. ఎలాగంటే మిగతాపైర్ల కంటే దేనితో పోల్చి చూసినా, ఒక నిర్ణీత వైశాల్యంలో వేసిన ఏ పైరుకంటే కూడా, వరిపైరు ఎక్కువ (వృద్ధి) దిగుబడి నిస్తుంది. ఆ వృద్ధియే అంటే వడ్డీపై బహువచనం 'లు' చేరి వడ్లు అయింది. ఈ వడ్లు పండించడానికి ఏర్పాటు చేసిన చెరువులే వడ్డి చెరువులు. ఇలాంటివి గుడివాడ తాలూకాలో పొలాలలో అధికంగా వుంటాయి. అంటే గుడివాడ తాలూకాలో కృష్ణపై ఆనకట్ట కట్టడానికి పూర్వమే వరిధాన్యం పండుతుంది. అలా వరి పండిన క్షేత్రాలను వ్రీహిక్షేత్రాలని పిలిచారు. ఈ మేరకు శాసనాధారాలున్నాయి. అవి వడ్డి చెరువులు కాగా, ఊరిలో నున్నవి ఊరి చెరువులు, వడ్డి చెరువులకు నీరు సమీపంలోని ప్రవాహాల నుండి కాలువల ద్వారా అందేది.

**ఆచంట :**

నరసాపురం తాలూకా గ్రామం. ఇచ్చటి రామేశ్వర దేవాలయం ప్రసిద్ధి చెందింది. ఆచంట వ్యుత్పత్తికి జననిరుక్తి వుంది. దాని యథార్థ యథార్థాలు అలా వుంచితే, సండ అనేది ఒక రకం కంచె యొక్క ఆసడి, ఆసండ అనేవి కన్నడంలో, మొక్కలుగా కన్పిస్తాయి. సంస్కృతంలో ఆషాఢ శబ్దం మోదుగకర్రను సూచిస్తుంది. హరవిలాసంలోని, అజినాషాఢధరుండు అన్న శ్రీనాథుని ప్రయోగం తెలిసిందే. శాసనాల్లో 'అసంట్ట' అని కన్పిస్తుంది. అసండ యొక్క ఔపవిభక్తికరూపం అసంట. ఇక్కడొక విశేషం. ఈ ఆచంట గుండము అసలు అలుగు ఉత్తరాన, 500 పోక చెట్లు గల భూమిని, విష్ణువర్ధన మహారాజు విజయాదిత్య చక్రవర్తి, తన కుమార్తె మైలారదేవిని, ఆచంట నూరపరాజునకిచ్చి వివాహం చేసిన సమయాన, అరణంగా ఇచ్చినట్లు శాసనం చెపుతోంది.

**ఆంజనేయపురం సందాయతం :**

తిరుత్తని తాలూకా గ్రామం. ఆంజనేయపురం దైవపరంగా వచ్చినది. ఆంజనేయపురం పేరుతో మరొక గ్రామం వుంది. అయితే చర్చలోనిది సందాయత గ్రామం. సందాయిత అంటే చెల్లింపబడిన పన్ను. ఈ పేరుతో ఇంకా రాజానగరం సందాయతం, సందాయితం కొత్త కండ్రిక అనే గ్రామాలు కూడా ఉన్నాయి. ఇవన్నీ పూర్వపు దినాలలోని గ్రామ కట్టుబడులకు, గుత్తలకు, ఈనాములకు సంబంధించిన పద్ధతులు. కాగా, సముదాయం అనే గ్రామం పుత్తూరు తాలూకాలో వుంది.

**ఆత్మకూరు :**

ఈ పేరుతో ఆంధ్రదేశంలో చాల గ్రామాలు కన్పిస్తున్నాయి. కొన్ని ఇదే రూపంతోను, మరికొన్ని 'ఆత్కూరు' అనే రూపంతోను, మరికొన్ని ఆతుకూరుగాను కన్పిస్తాయి.

ఆత్మ, ఊరుల కలయికవలన, మధ్యలో 'కు' ఆగమంగా వచ్చిందని చెప్పడం సులభమే. కాని నిజస్థితి ఇదికాదు. దీని అసలు రూపం అంతుకుర్రు. ఈ మేరకు శాసన రూపం కన్పిస్తుంంది.

శాసనం : నందికొట్కూరు తాలూకా, కర్నూలు జిల్లా; క్రీ.శ. 1505
ఇమ్మడి నరసనాయకుడు .. [1]

"ఈ ఆతుకూరి గ్రామం తథా తిథి కంన్యా బృహస్పత్తి పుంణ్యకాలమంద్దు

"శ్రీశైలం నందికొట్కూరు తాలూకా, కర్నూలు జిల్లా.

క్రీ.శ. 1515 శ్రీకృష్ణదేవరాయలు శ్రీశైల మల్లిఖార్జున స్వామికి సమర్పించిన శాసనం. శ్రీముఖ సంవత్సర వైశాఖ శు 11 గురు వారానను మధ్యాహ్నమ వసరం మహా నైవేద్యానకు పారుమంచాల అనెడి గ్రామమును అతుకూరి అనెడి గ్రామముంను సమర్పించిరి."

'అంతు' అనేది ఒక రకపు గడ్డిమొక్కగా బోధపడుతోంది. ఇందేదో అర్థాన్ని భావించి 'ఆత్మ'గా మార్చబడింది.

'కుర్రు' అనేది నేల స్వభావాన్ని సూచిస్తుంది. మోతుకూరు, మోదుకూరు, కంటుకూరులలోని 'కు' కూడ ఆగమం కాదు. కృష్ణాజిల్లాలో గని ఆత్కూరు, దోనె ఆత్కూరు అనే గ్రామాలున్నాయి. బండి ఆత్మకూరు కర్నూలుజిల్లాలో వుంది.

**ఆర్యవట్టం :**

ఇది కాకినాడ తాలూకాలో వుంది. శాసనాల్లో దీని పేరు అరియవట్టనముగా కన్పిస్తుంది. అరియ శబ్దం 'రాజు' శబ్ద సంబంధి. వట్టం శబ్దం పట్టణశబ్ద సంబంధి. పట్టణంముందు వివరింపబడుతుంది. కాకినాడ ప్రాంతాన్ని పోలునాడుగా, కడల నాడుగా వ్యవహరించేవారు. లేక ఆర్యశబ్దం పుజ్యార్థకము గావచ్చు. మరో ఆర్యవట్టం, తిరువనంతపుర (కేరళ) సమీపాన వుంది.

1 No. 49, S. I. I. Vol. xvi

**ఆసీలుమెట్ట :**

ఇప్పటి విశాఖనగరంలో ఒక భాగం. ఆసీలు అనేది ఒక రకం పన్ను. పట్టణంలో సరుకులు అమ్మకానికి వసూలుచేసే పన్ను. మెట్ట ఎత్తైన నేల. అయితే ఇక్కడ అది కాదు. ఇది వాస్తవానికి మెట్టు. మెట్టు అంటే పన్ను వసూలు చేసే చోటు. ఖమ్మం మెట్టు కూడ ఇలాంటిదే.

మెట్టు శబ్దాన్ని రాయలసీమలో పాదరక్షకు సంకేతంగా ఉపయోగిస్తారు. వివాహిత స్త్రీలు పాదాంగుళీయకంగా ధరించే మెట్లు తెలిసినవే. నిజానికి మిద్దు, మెట్ట, మెప్పు, మేలు, మేట, మెట్టు (కొండ; పైకి ఎక్కడానికి గల మెట్లు) మెచ్చు- ఇవన్నీ ఒకే ధాతు జన్యాలు. అన్నింటిలోను ఉన్నత తత్వభావన వుంది గమనించండి.

**ఇక్కుర్రు :**

ఇది నరసరావుపేట తాలూకా గ్రామం. కుర్రు శబ్దం, నీటి ప్రవాహాలచెంత గల ఎత్తైన భూమిగా ఇంతకు పూర్వం వివరింపబడింది. అయితే శాసనాల్లో ఇకూర్కురుగా కన్పిస్తుంది. ఇది బహుశా శాసన లేఖకుని పొరపాటు గావచ్చు. ఇలాంటి పొరపాటు చాల శాసనాల్లో కన్పిస్తుంది. ఇది ఓగేరుకు సమీపాన గల గ్రామం. కనుక ఇక్కుర్రు రూపమే సరియైనదిగా భావింపవచ్చును.

**ఇంజరం :**

ఇది కాకినాడ తాలూకా గ్రామం. పూర్వపు నాళ్ళలో జమిందారీ గ్రామం. గోదావరి ముఖద్వారాన గల రేల 1708లో ఇక్కడ బ్రిటీష్‌వారు ఫ్యాక్టరీ స్థాపించారు. 1757లో బుస్సీ నాయకత్వంలో ఫ్రెంచి వారికి స్వాధీనమైనది. పూర్వపు దినాల్లో ఇక్కడ నుండి 'లాంగ్‌క్లాత్' అనే పేరు గల బట్టి ఎగుమతి అయ్యేది. ఇంజర శబ్దం ఒకరకం కందను సూచిస్తుంది. కాగా 'వింజ' అనేది ఒక పక్షి కూడా. ఒకరకం చేపను కూడా సూచిస్తుంది. దీనిని పోలిన గ్రామాలు వింజమూరు, ఇంజనంపాడు మొదలైనవి.

**ఇనామతి బోడిరెడ్డి పల్లె :**

చిత్తూరుజిల్లా చంద్రగిరి తాలూకా గ్రామం. ఇలా వ్యవహరించడానికి కారణం మరో బోడిరెడ్డిగారి పల్లె ఇదే తాలూకాలో ఉంది. ఇది వ్యక్తి నామపరంగా వచ్చింది. కాగా 'ఇనామతి' అనేది వంశపారంపర్య గ్రామాధికారులుగా నున్నవారికి ఉచితంగా గాని, లేదా వారి సేవలకు పరిహారంగా గాని ఇచ్చిన భూమి. ఈనాము శబ్దం బహుమతి

అనే అర్థంలో తెలిసిందే. ఇదే తాలూకాలో ఇనామతి ముప్పిరెడ్డి వారి పల్లె అనే మరో గ్రామం వుంది. పేరుగా ముప్పిరెడ్డి గారి పల్లె మరొకటి వుంది. ఈ నాలుగు గ్రామాలు, మొన్న మొన్నటివరకు జమిందారీ గ్రామాలు.

బోడి శబ్దం జుట్టులేని తలను, బోసి నోటిని సూచిస్తుంది. బోడి జంగము అంటే జుట్టులేని జంగము. ప్రవాహ వేగానికి సారవంతమైన మట్టి కొట్టుకుపోయిన నేలకు బోడినేలలంటారు. అంటే పనికిరానిది అని అర్థం. తలలు బోడులైన తలపులు బోడులగునా అని వేమన. బహుశా వ్యక్తినామాల్లోని ఈ బోడి (బోడిమ్మ బోడియ్య) శివలింగానికి ప్రతీక కావచ్చు.

ఇక రెడ్డి శబ్దం, తెలుగునాట ఆ పేరుతో వ్యవహరింపబడుతున్న జాతి జనులకు సంకేతం. ఆ కులంలోని వారికిది నామాంత్య పదం. గ్రామాధికార పదవీ సూచకం కూడా. కనుక రెడ్డరికం అంటే ప్రభుత అనే అర్థం కూడా ఇస్తుంది. ఇది రాష్ట్రకూట శబ్దభవమని భావన. రాష్ట్రకూట > రట్టగుడు > రాట్టొడి > రట్టడి > రడ్డి > రెడ్డి అయిందని భావన. ఈ శబ్దాలన్నీ శాసనాల్లో కన్పిస్తున్నమాట వాస్తవం. రాష్ట్రకూట అనేది పూర్వపునాళ్ళలో ఒక ప్రభు వంశం. మహారాష్ట్రులు. కనుక నే వారు రాష్ట్రకూటులయినారు. రెడ్లు, మహారాష్ట్రం నుండి ఆంధ్రదేశంలోనికి కాకతీయులకు కొంత పూర్వమే ప్రవేశించారు. రెడ్డి శబ్దం, రాజస్థాని శబ్దం రారోడ్ శబ్ద సంబంధి. ఈ రారోడ్, రట్టాడు, రడ్డి అయి రెడ్డిగా స్థిరపడింది. రారోడ్ అనేది అక్కడ ఒక జాతి నామం. వారు గుజరాత్ మీదుగా మహారాష్ట్రలోనికి ప్రవేశించారు. పిదప ఆంధ్రదేశంలోనికి వచ్చారు. ఆ రోడ్‌లే, రాష్ట్రకూటులు కూడా అయివుండవచ్చు. కాని రెడ్డి శబ్దానికి సమీపవర్తి అయిన శబ్దం రాష్ట్రకూట కాదు. రాతోడ్ మాత్రమే వీరి సంప్రదాయం, ఆచారాలు దేశీయమైన వాటికంటె భిన్నంగా తోచాయి గాబోలు, తెనాలి రామకృష్ణుడు 'రడ్డలు నడిచిరి పురస్సరద్వార్యముగా' నంటాడు. పల్లె పూర్వం వివరించబడింది.

**ఇందుగల :**

ఇది నల్గొండ జిల్లా గ్రామం. 'ఇందుగు' ఒక చెట్టు. ఇలాంటివే పొందుగల, మాడుగుల. పొందుగల గుంటూరు జిల్లాలోను, మాడుగుల గుంటూరు, విశాఖపట్నం జిల్లాల్లో వున్నాయి. నల్గొండ జిల్లాలో మాడుగులపల్లి అనే గ్రామముంది. ఇందుకూరు, ఇందుపల్లెలలోని ఇందు శబ్దం కూడా పై అర్థాన్నే సూచిస్తాయి.

**ఇమ్మడి చెరువు :**

కనిగిరి తాలూకా గ్రామం. ఒకే పేరుగలవారున్నప్పుడు అందు రెండవ వారిని 'ఇమ్మడి' అని, మూడవ వారిని 'ముమ్మడి' అని సంభావించడం కద్దు. అలా అయినపుడు ఇది అలాటి వ్యక్తి నామపరంగా వచ్చిందని భావించాలి. అలాకానప్పుడు 'ఇబడి' లేక 'ఇబ్బిడి' అంటే ఒక విధమైన నల్లని కలపచెట్టుగా భావించాలి. ఆధిక్యార్థంలో ఇబ్బడి ముబ్బడి అనడం తెలిసిందే.

చెరువు, జలాశయార్ధంలో తెలిసిందే. ఆ అర్థంతో స్థిరపడిందే తప్ప నిజానికి చెరువు అంటే జలాశయంకాదు. దానికి పోసిన కట్టలే చెరువులు. ప్రాచీన ద్రావిడంలో రెత్ అనే శబ్దం కన్నడంలో కెరె అయింది తెలుగులో చెరువు అయింది. ఈ శబ్దాని అర్థం నిరోధించు, అడ్డగించు అని. అంటే ఇక్కడ నీటిని అడ్డగిస్తున్న కట్ట చెరువు. నేలకు పాదానికి మధ్యగల నిరోధం గనుక చెప్పు (పాదరక్ష) చెరసాల, చెరపట్టుట లోని చెర కూడ నిరోధము, అడ్డగించు అనే అర్థాలనిస్తాయి. చెరచులో నిజానికి లైంగిక క్రియలేదు. నిరోధించు, బలవంతము చేయుట మాత్రమే. అర్థ విపరిణామం వలన బలవంతపు లైంగిక క్రియకు మారుగా చెరచు వ్యాప్తినందింది. కనుక చెరువు తవ్వించడం వుండదు. కట్టించడమే వుంటుంది. మన పూర్వుల వ్యవహారం (శాసనాల్లో) చెరువు కట్టించడమే వుంది.

**ఇరుకుపాలెం :**

ఇక్కడ ఇరుకైన అని అర్థంకాదు. ఇరుకు శబ్దాని కర్థం చిట్టడవి అలాంటి చోట వచ్చిన గ్రామం కనుక ఇది ఇరుకుపాలెం. ఇరికిపెంట అనే గ్రామం చిత్తూరు జిల్లాలో ఉంది. పెంట అంటే పశువులను మందవేసే స్థలం. ఇదికూడా పై అర్థాన్నే సమర్థిస్తోంది.

పాలెం అనేది నేడు ఏదైనా ప్రధాన గ్రామానికి అనుబంధంగా వచ్చిన జనావాసానికి సంకేతంగా నిలిచింది. నిజానికిది పాళయం. వ్యవహారంలో పాళెం, పాళ్యం, పాళయం, పాలెంగా స్థిరపడింది. మనకు పూర్వం పాళెగాండ్ర వ్యవస్థ ముఖ్యంగా కృష్ణదేవరాయల కాలంలో వుంది. పాళెగాడు స్థానికంగా ఒక ప్రాంతానికి అధికారి. ఆ అధికార ప్రాంతం పాళయం. అతడు నివాసమున్న చోటుకు కూడా పాళయం వ్యవహారమైంది. అతను, అతని అవసరాలు చూడటానికి గల సిబ్బంది వుండే ఆవాసం మాత్రమే. మొదట పాళయం కాలక్రమంలో అనుబంధ గ్రామమనే అర్థంతో స్థిరపడింది. వ్యవసాయంలో కొంత వంతుకు సాగుచేసే వాడు పాలికాపు లేక

పాలెగాడు, పాలు అంటే భాగము, వంతు అనే అర్థాలు తెలిసినవే. తమిళ ప్రభావంచే పాళయం అయింది. నిజరూపం పాలు మాత్రమే.

**ఇర్లపాడు :**

ఇది నరసరావు పేట తాలూకా గ్రామం. దీని శాసన నామం ఇఱ్ఱులూరు.

శాసనం : " .. దెవియకు నిచ్చిన గొతియ 55 పీని చేకొని ఇర్లూరి ప్రోలియ బోయిండు ." [1]

"శకవర్షంబులు 1057 గునేండు శ్రీమత్సోమన పెగ్గడ దన ప్రభుత్వం బైన ఇఱ్ఱులూర శ్రీ సోమేశ్వర మహాదేవరంబ్రతిష్టించి.. " [2]

"శ్రీ మన్మహామండలేశ్వర చోడెరాజు ఇఱ్ఱులూరి శ్రీ సోమేశ్వర మహాదేవరకు...." [3]

ఇందలి 'ఇర్ల' వృక్ష సూచి. ఇఱ్ఱి లేక ఇఱ్ఱ అనేది తెలుగున నేడు రచ్చ చెట్టుగా వ్యవహరిస్తున్నారు. మఱ్ఱి తెలిసిందే గదా ! ఇంకా 'ఇరి' శబ్దంతో ఇరిమేద, ఇరుగుడు (నరుగుడు వలె) అనే చెట్టుకూడా తెలుగున కన్పిస్తాయి. కన్నడంలో ఇరవన్తి అనేది ఒక రకం మల్లె. తెలుగులో జంటమల్లె లాంటిది. (The many flowered Nykthantner)

పాడు చాల గ్రామనామాల్లో ద్వితీయావయవంగా కన్పిస్తుంది. పాడైన చెడిన అనే అర్థాలు దీనికున్నాయి. పాటిమట్టి తెలిసిందే. ఇక్కడ పాటి శబ్దంతో సారవంతము (శ్రేష్ఠము) పాత అనే అర్థాల్లో వ్యవహృతము. కాగా పాటిమట్టిలోని పాటి శబ్దం పాడుకు ఔపవిభక్తిక రూపం. నేడు గ్రామాల నంటి వున్న పాటిమట్టి దిబ్బలన్నీ ఒకప్పటి జనావాసాలే. వాటిని తవ్వినపుడు, అవి జనావాసాలేనని అక్కడ దొరుకుతున్న వస్తువులని బట్టి తెలుస్తోంది. అంటే కాలక్రమంలో ఆ చోట జనావాస మంతరించి, సమీపంలో రూపెత్తిందని బోధపడుతుంది. ఇలా జనావాసాలు అంతరించి పోవడానికి చాలా కారణాలుంటాయి. అగ్నిప్రమాదం, నీటిమునక, అచ్చిరాక పోవడం, పరపీడనం వలన గ్రామం నాశనం గావడం-ఇలా ఏదైనా కారణం గావచ్చును. 'పాడు' లన్నీ మొదలు జైనావాసాలనే భావన ఉంది. స్వధర్మాచరణం నుండి తప్పి, ఇతర ధర్మాన్ని ఆచరిస్తూ పాడైపోయినారనే

[1] No. 926 S. I. I; Vol. iv

[2] No. 927 S. I. I; Vol. iv

[3] No. 928 S. I. I; Vol. iv

భావనలో, వారి నివాసస్థలాలను పాడులని వ్యవహరించి వుండవచ్చు. అనంతరం గ్రామనామ ద్వితీయావయవంగా సామాన్యీకరణం చెందివుండవచ్చు. గుంటూరు జిల్లాలో మాతంగ (మాదిగ) జాతివారు నివసించే ఆవాసాన్ని పాడుగా సంభావించడం గలదు.

ఇల్లిందల :

ఖమ్మం జిల్లా గ్రామం. ఇది ఒక చెట్టు. ఉల్లిందల కూడా ఒక రకం చెట్టు. (Dıospynos capıtulata. W.) కాగా ఇల్లిందల పఱ్ఱు పేరుతో రెండు గ్రామాలు పశ్చిమగోదావరి జిల్లా తణుకు తాలూకాలో వున్నాయి. అందొకటి కాకుల ఇల్లిందల పఱ్ఱు మరొకటి సోమరాజు ఇల్లిందల పఱ్ఱు, కాకుల ఇల్లిందల పఱ్ఱు అనే పేరు సమీపంలోని కాకిలేరు వలన వచ్చింది. ఇందలి 'కాకి' శబ్దం పక్షికాదు. ఒక చెట్టు పేరు. (Cantnıum parviflorum Linn). ఆ పేరుతో అనంతపురం జిల్లాలో ఒక గ్రామముంది. సోమరాజు ఇల్లిందల పఱ్ఱు అనే గ్రామం, సోమరాజు అనే వ్యక్తికి, ఇనాముగా లేక అగ్రహారంగా ఇచ్చింది కావచ్చును. సమీపంలో ఒకే పేరుతో రెండు గ్రామాలున్నప్పుడు, సమమైన వివక్ష కొరకు ఇలా మరొక పదం చేర్చి వ్యవహరిస్తారు. ఉల్లిందల పేరుతో కృష్ణాజిల్లా దివితాలూకా పెదప్రోలు గ్రామంలో ఒక ప్రాంతముంది. పూర్వం ఆ చోట ఆ చెట్లుండేవి. ఉల్లిపాలెం పేరుతో దివితాలూకాలో ఒకటి, గుంటూరుజిల్లా రేపల్లె తాలూకాలో మరొక గ్రామము ఉన్నాయి.

పఱ్ఱు, పఱ శబ్ద సంబంధి. వ్యవసాయ యోగ్యంకాని భూమిని పఱలనడం తెలిసిందే. కనుచూపుమేర ఇసుక వ్యాపించిన భూములను ఇసుకపఱలనడం తెలిసిందే. వ్యాప్తి వ్యాపనము అనే అర్థాల్లో పరచు శబ్దం తెలిసిందే. సౌఖ్యంకొరకు శయ్యపై వేసుకొనే పరుపు, పరచు శబ్ద సంబంధియే. కనుక ఈ శబ్దానికి స్వాభావికార్థం విశాలము, వ్యాపనములు. గ్రామనామాల్లోని పఱ్ఱు ప్రవాహాల వెంటనంటి, కొంత ఎత్తుగా వున్న భూమికి సంకేతం. బఱ్ఱు, మఱ్ఱు, వఱ్ఱు దీని రూపాంతరాలు. పామఱ్ఱు (పాంబఱ్ఱు అని శాసన రూపం) ఉల్లిపఱ్ఱు, ఎలమఱ్ఱు, తొటివఱ్ఱు ఇలాంటివి. ఇవన్నీ ప్రవాహాల వెంటే వున్నాయి. పూడి ప్రవాహ పరటపట్టంతో సమానమైన నేల కాగా పఱ్ఱు దానికంటె కొంచెం ఎత్తయినది. మరీ ఎత్తయినవి తుఱ్ఱు, కుఱ్ఱులు. వీటిలో వేల స్వభావం కూడా కలిసివుంది. ఇసుకపాడు ఎక్కువ

గలిగిన తుప్పనేల తుప్ప, ఇసకపారు కలిగిన నేలకుర్రు. ఇంకా ఎత్తయినది మిట్ట.

**ఈడుపుగల్లు :**

కృష్ణాజిల్లాలోని గ్రామం ఇది. దీని పూర్వనామం ఇడుపుంగల్లు. ఇందు కల్లు శిలా సంబంధి కాదు. కొలనుకొల్లుగా మారింది. పశ్చిమ గోదావరిలోని మొంగొలను మొగల్తూరా మారింది. ఇడుపు అంటే సన్నని అని అర్థం. ఈ ఊరిలోని చెరువు కారణంగా దీనికా పేరు వచ్చింది. ఇడుపు అంటే చీలిక అనే అర్థం కూడా వుంది. ఈ రెండి అర్థాల్లో దేనికన్నైనా దానికా పేరు వచ్చియుండవచ్చును.

**ఈదర :**

కృష్ణాజిల్లా గ్రామం. చెరువునుండి పారే కాలువకు ఈదర అని పేరు. అలాంటి భౌతికస్థితి వున్నచోట వచ్చిన గ్రామం ఈదర. సముద్రం ప్రక్కన వచ్చిన గ్రామాన్ని యాదర అంటారు. కృష్ణాజిల్లాలో సముద్రాన్ని అంటి, చినయాదర, పెదయాదర అనే రెండు గ్రామాలున్నాయి.

**ఈలప్రోలు :**

ఇది విజయవాడకు సమీపాన గల గ్రామం. ఈల, ప్రోలుల కలయిక ఈలప్రోలు. ఈల శబ్దంలో గల మరొక గ్రామం ఈలచెట్ల దిబ్బ. కృష్ణాజిల్లా దివి తాలూకాలో వుంది. ఇది ఒక మొక్క అని స్పష్టమవుతోంది గదా! 'ఈ' శబ్దంతో గల మరొక వూరు ఈపూరు. ఈతచెట్టు తెలిసిందే. అయితే ఇవన్నీ ఒకటిగాదు. వేర్వేరు మొక్కలు. నరసరావుపేట తాలూకాలోని ఇర్లపాడులోని 'ఇర్ల' కూడా వృక్షసంబంధియే. అలాగే ఇక్కుర్రు కూడా. ఇక ఈలప్రోలులోని 'ప్రోలు' శబ్దం కలిగిన మరికొన్ని గ్రామాలు పెదప్రోలు, పెనుగంచిప్రోలు, నిడదవోలు (నిరవద్య ప్రోలు) మొదలైనవి. ఇంకా ఈ 'ప్రోలు' వ్యక్తి నామాల్లో కూడా కన్పిస్తుంది. పోలయ్య, పోలమ్మ, పోలిగాడు తెలంగాణంలో ప్రముఖంగా వినిపిస్తాయి. రెడ్డిరాజ్య వంశంలో ప్రోలయ వేమారెడ్డి. చరిత్రజ్ఞులకు చిరపరిచితుడు. ఈ ప్రోలు శబ్దానికర్థం సంపద, నిక్షేపము, ఖజానాలాంటి అర్థాలు తమిళంలో కనిపిస్తాయి.

తమిళంలో దీని రూపం పుతిల్. తొలుత ఈ 'ప్రోలు' గల గ్రామాలు నేటి తాలూకా ప్రధానకేంద్రాలు వున్న ప్రదేశాలవంటివి. దాని పై అధికారి పోలి లేక ప్రోలి. పోలి అనే గ్రామం కడపజిల్లా రాజంపేట తాలూకాలో వుంది. అనంతరం వ్యక్తి నామాల్లో చోటు చేసుకొని వుండవచ్చు. ఇలాంటి పేర్లు పెట్టడంలో తల్లిదండ్రుల

అభిలాష వ్యక్తమవుతుంది. ఇక ఈ పోలి శబ్దమే 'పొలిమేరపొలి, బలియోబలి, రావేలు గలవాడ రారా పొలిగాడ' అనే పాటలోని 'పోలి' శబ్దానికి మూలమై వుండ వచ్చు. అప్పుడు 'హోము' కూడా దీనినుండే ఉత్పన్నమైందని భావింపవచ్చు. అయితే వ్యర్థమైన, పనికిరాని, తాలు అన్న భావానికి మూలమైన 'పొల్లు' శబ్దానికి మూలం అన్వేషించవలసి వుంది.

ఉదక మండలం :

దీనినే మనం ముద్దుగా ఊటీ అని పిలుస్తాం. నీలగిరి అని కూడా అంటాం. ఉదకమంటే నీరు. అంటే నీరు గల మండలమని దాని అర్థం. అర్థాన్ని ఊహిస్తే పప్పులో కాలేసినట్లే. వాస్తవానికది 'ఒట్టకక్కల్ ముంద్' ఒట్టకక్కల్ అంటే ఒకే రాయి. ఏకశిల. కల్లు అంటే తెలుగులో కూడ రాయి అనే అర్థం. తమిళంలోనూ అంతే. ఒట్ట అంటే ఒకటి. ముంద్ అంటే దైవము. మనకు తెలుగులో ముండ అంటే పతిహీన, విధవ అనే అర్థాలున్నాయి. కాని ఈ పదాల అర్థాన్నికూడా కొంచెం సాగదీస్తే దైవమనే అర్థమే వస్తుంది. విధవ గౌరవార్హురాలిగా పరిగణింపబడటం లేదు. అంటే పూజనీయురాలు గాదు. నిషేదార్థంలో అంటే నిజానికి పూజ్యార్హత గల దైవతమనే అర్థానికి భిన్నంగా విధవను ముండగా సంభావించడం జరుగుతోంది. తెలుగులో తప్ప ఇతర గిరిజన సంబంధి ద్రావిడ భాషల్లో కూడ ముండ అంటే దైవమనే అర్థం పొసగుతుంది. శ్రీనాథుడు కాశీఖండంలో 'ముగురన్ గూర్చిన ముండ దైవ'మని నిందార్థంలోనే ప్రయోగించాడు. అదలా వుంచుదాం. ఒట్టకక్కల్ ముంద్ అంటే ఏకశిలలో మలచిన దైవం. మీరు ఊటి ఎప్పుడైనా వెళితే, బస్సు కండక్టరును అడగండి. ఊటీ ప్రారంభంలోనే కన్పిస్తుంది. ఈ ఒట్టకక్కల్ ముంద్‌ను ఆంగ్లేయులు OOTTAKAKMUND అని వ్రాశారు. కాలక్రమంలో OTTAKMUND అయింది. తమిళులు పద మధ్యంలో అచ్చుల మధ్య శ్వాస వర్ణాన్ని, నాదవర్ణంగా పలుకుతారు. ఆ క్రమంలో 'ట' కారంలో 'డ' కారమై పోయింది. అప్పుడది ODAKMAND అయింది. పదాది ఒ, ఉగా మారుతుంది అలాగే ఉ, ఒ గాను మారుతుంది. 'డ' కాస్తా 'ద' కారంగా మారింది. చివరకు డ కారంతో అంతం కావడం, ఆదేదో పొరపాటనుకొని ఉదకమండలం అని మార్చేశారు. OTTAKMAND ను సంక్షిప్తపరిచి OOTY ఊటీగా వ్యవహ రిస్తున్నారు.

**ఉద్దాన రామకృష్ణాపురం :**

ఇది శ్రీకాకుళం జిల్లా గ్రామం. రామకృష్ణ అనే వ్యక్తి పేరు మీ ఏర్పడిన పురం. ఈ ప్రాంతంలో చాల రామకృష్ణాపురాలుండడం కారణ స్పష్టత కొరకు ఉద్దాన రామకృష్ణాపురంగా వ్యవహరించడం జరుగుతో శ్రీకాకుళం జిల్లా పలాస ప్రాంతాన్ని 'ఉద్యానవనం' అనే వాడుక ఉంది. కాః ఆ ప్రాంతం చెట్టు చేమలతో సంపద్వంతంగా వుండడం ఉద్యానవనం వాడుః ఉద్దానం అయింది. ఉద్దానం గోపీనాథపురం, ఉద్దానం కూర్మనాథపురం, ఉద్దా నరసింగంపల్లె కూడా ఇలాంటివే. పురం పూర్వం వివరింపబడింది.

**ఉప్పుమిల్లి :**

ఇది కాకినాడ తాలూకా గ్రామం. ఉప్పపల్లి ఉప్పుమల్లి అయింది. వెను ఉప్పలూరు, ఉప్పల మొదలైన వాటిలో కూడా ఉప్పుశబ్దం వుంది. వాటిలోని 'ఉప్పు' మెట్ట నేలల్లో పెరిగే ఒక రకం గడ్డి. Hackeloculog gvanulans. o. Kig ఇదిగాక ఉప్పుగడ్డి ఉప్పగడ్డి పైరుతో మాగాణీలో వచ్చే కలుపుమొక్క మరొకటుంది Chloris vivgata, Sw. అయితే ఇక్కడ లవణార్థకము కేవలం, లవణమని గాక సముద్రతీర భూమి అని అర్థం చేసికోవాలి. ఉప్పొంగల అన్నప్పుడు కూడా అలాగే అర్థం చేసికోవాలి. ఉప్పు + పొంగు ఉప్పొంగు. కడకు ఇది అతిశయార్థంలో రూఢం అయింది. దీన్నిబట్టి సముద్ర పర్యాయసూచికలో ఉపయుక్తమవుతున్నట్టు బోధపడుతుంది. ఉప్పెన తెలుసు గదా ! దివి తాలూకాలోని 'ఉపకాలి' కూడా 'ఉప్పొంగల' కు శిథిలరూపం. ఉప్పొంగల గ్రామం కూడా కాకినాడ తాలూకాలో వుంది. శాసనాల్లో ఈ ఉప్పుమిల్లి, ఉబ్బుటుంబల్లి నమోదైంది. ఉప్పు ఉరిసింది అనడం తెలుసుకదా ! ఉబ్బు శబ్దం వీటికి పర్యాయంగా కనిపిస్తుంది. కాప్పు ఉరులు దిగినాయి. నీరు ఉరుస్తోంది (కుండ) నీరు ఊరుతోంది. వీటన్నింటిలోను నీరు అనే అర్థం కనిపిస్తోంది. అలాగే 'ఉరుకు' వేగమని అర్థంలోనిది కూడా ప్రాథమికంగా వీటికి సంబంధించిందే ! వాగు ఉరకలెత్తుతోంది. దీనిమీద ఏర్పడిందే 'ఉరవడి' వీటన్నింటిని పోల్చి చూసినపుడు ఊరు అనేది నీటిపట్టు అని బోధపడుతుంది.

**ఉల్లంపర్రు :**

పశ్చిమ గోదావరి జిల్లా నరసాపురం తాలూకా గ్రామం. పర్రు పూర్వం వివరింపబడింది. ఉల్లం అనేది ఒక మొక్క. ఉల్లంగి, ఉల్లింద్ర, ఉల్లెందు అంటే

తెలుస్తుంది. కంచెమొక్కగా వేస్తారు. దివితాలూకా పెదప్రోలులోని ఒక స్థలానికి ఉల్లిందల అనే పేరుండేదని ముందు చెప్పబడింది. ఉయ్యందన అనే గ్రామం సత్తెనపల్లి తాలూకాలో వుంది. ఈ ఉల్లంపర్రు కాంజ (నేటి కాజ) సీమకు చెందినదిగా శాసనాల్లో చెప్పబడింది. శక. 1446 రక్తాక్షనామ సంవత్సరం వైశాఖశుద్ధ ఏకాదశి నాడు అత్తిలి సిద్ధిరాజా గోటేటి లింగరాజుగారు ఈ గ్రామంలోని కొంతభాగాన్ని పాలకొల్లు రామేశ్వరస్వామి అర్చకులకు, వారు ధూప దీప నైవేద్యాలు షోడశోపచారాలు నడిపించవలసిందిగా కోరుతూ, పాదుషాకు పుణ్యంగా దానమిచ్చాడు. ఈ గ్రామంపై లింగరాజుకు అప్పటికి ఇజారతి గ్రామం. ఇజారు అంటే గుత్త ఒక విధమైన కౌలు. కాంజ శబ్దంతో మరో రెండు గ్రామాలు కృష్ణా, గుంటూరు జిల్లాలలో వున్నాయి. వాటి వివరణ తరువాత ఇవ్వబడుతుంది.

**ఉసిరిక లంక :**

తూర్పు గోదావరి జిల్లా చోడవరం డివిజన్‌లో ఉంది. మరొకటి ఎల్లవరం డివిజన్‌లో ఉంది. కాని ప్రస్తుతం బేచిరాగ్ గ్రామం, చోడవరం డివిజన్‌లోనే ఉసిరిక దొనలు కూడా ఉంది. ఉసిరిక వలస వెంకటపతి రాజు పేట రాజాం తాలూకాలో ఉంది. ఇదే పేరుతో మరొక గ్రామం పాలకొండ తాలూకాలో ఉంది. అయితే ఈ ఉసిరిక, మనం పచ్చడి పెట్టుకునేది (ఆమలకి) కాదు, ఇది మెట్ట నేలల్లో పెరిగే కలుపుమొక్క (Phyllantnus emblica, Linn).

లంక సంగతి ముందు చెప్పడం జరుగుతుంది. దొనలు, దొనకు బహు వచనం. దొన ద్రోణశబ్ద సంబంధి. వలస శబ్దం తెలిసిందే. ఇక తినే ఉసిరిక దీనిని సంస్కృతంలో ఆమలక అంటారు. ఉసిరికలో పెద్ద ఉసిరక (మనం నిలువ పచ్చడి పెట్టుకునేది) రాచఉసిరి, నేలఉసిరి మొదలైన రకాలున్నాయి. ఇందులో దేనిమీదుగానైనా పై పేరు ఏర్పడి వుండవచ్చు. అయితే ఉసిరిక అనే పదాన్ని ఉచ్చరించడానికి మనవాళ్ళు ఇష్టపడరు. పేరులేని చెట్టు, నల్లపచ్చడి అని వ్యవహరిస్తున్నారు. పొన్నూరులోని ఒక శాసనంలో ఒకరు ఉసిరిక చెట్లు నాటించి, వాటిని అనామ తరువులు అని సంభావించాడు. ఇక కరతలామలకం అనే మాట విని వుంటారు. దేనియందైనా నేర్పరి అయినవాడిని వాడికా విద్య కరతలామలకం అని వ్యవహరించడం కద్దు. అంటే సునాయాసంగా అని భావిస్తాము. కాని నిజానికి కాదు. కరతలములోనికి ఉసిరిక తీసుకోవడం ఏమంత కష్టం కాదు అనే అర్థంలో సులభమని చెప్పవచ్చును. అయితే అరటిపండు మాత్రం సులభంగా గ్రహింప లేమా ? మరి ఉసిరికనే ఎందుకు చెప్పవలసివచ్చింది ? ఎందుకంటే దాని ప్రత్యేకత

దానికుంది. నిజానికి ఉసిరిక పండ్లు క్రిందపడితే ఉపయోగానికి పనికిరావు. క్రింద పడకుండానే ఉపాయాంతరంతో వాటిని సంగ్రహించాలి. ఇక ఇక్కడ అదికూడా కాదు. ఫాల్గుణ, చైత్ర మాసాలతో ఇది బాగా పక్వానికొస్తుంది. అప్పుడు ఆ చెట్టు కింద అరచేయి సాచి నిలబడితే అదృష్టంకొలదీ, పండు అరచేతిలో పడితే దాని గుణం ఇంత, ఇలాంటిది అని చెప్పడం సాధ్యంకాదు. అమృతంతో సమానమని చెపుతారు. ఇప్పుడు చూడండి. కరతలామలకమంటే ఏమిటో, అది ఎంత కష్ట సాధ్యమో, అయితే అలా దొరికితే మాత్రం అమృతమే. కనుకనే ఏదైనా విద్య సాంగోపాంగంగా అలవడితే, ఇక ఆ విద్యలో అతని కెదురుండదు. అప్పుడది కరతలామలకంతో సమానమే—

ఎకలస్కాన్ పేట :

ఇది ఒంగోలు తాలూకాలోని ధర్మవరం గ్రామంలోని అంతర్భాగం. ఇబ్రహీం పాదుషా కుమారుడు మహమ్మదు పాదుషా వద్దగల ఎకలాన్‌ఖాన్ అను సర్దారు కొండవీటి నుండి పాలించే రోజుల్లో, తనపేరు మీదుగా ఏకలాన్‌ఖాన్ పురమనే పేటను కట్టించినట్లు శాసనంలో చెప్పబడింది.

ఎనికేపాడు :

విజయవాడకు సమీపంలో గల గ్రామం. నిజానికిది వెనకపాడు. శాసనాల్లో మొట్టి వెనకపాడు. ఇచ్చటి మొట్టి, మొట్ట అంటే ఎత్తైన నేలను సూచిస్తుంది. మార్కాపురం ప్రాంతానికి మొట్టవాడినాడని పేరు. మొట్ట మోటుగా పరిణమిస్తుంది. చింతమోటు, బండ్లమోటు గ్రామాల్లో మోటు శబ్దానికి అర్థం ఎత్తుగా వున్న, వారగా (ప్రక్కన) వున్న భూమి అని అర్థం. గోదావరి జిల్లాలో మొట్టపరితి అనే గ్రామముంది. అది ఇంటిపేరు గలవారు కూడా వున్నారు.

ఎరడుకెర :

అనంతపురం జిల్లా గ్రామం. ఎరడు అంటే కన్నడంలో రెండు అని అర్థం, కెర అంటే చెరువు. ఇది కూడా కన్నడ భాషాశబ్దమే. ఫలితార్థం రెండు చెరువులు.

ఎర్రబాలెం :

ఇది మంగళగిరి సమీపాన వుంది. ఇచ్చటి సీతారామస్వామి ఆలయప్రాంగణంలో గల శాసనాన్నిబట్టి కోట కేతరాజు భోగస్త్రీలు, వారి తండ్రి ఎర్రమ నాయుడు, ఉండవల్లిలోని దేవాలయ దేవునికి ఉత్సవవిగ్రహం చేయించినట్లు తెలుస్తుంది. ఆ ఎర్రమనాయకుని పేర ఈ ఎర్రబాలెం ఏర్పడి ఉండవచ్చు.

**ఎలకమానిపెంట :**

ఇది చిత్తూరుజిల్లా గ్రామం. ఎలకమాను అనేది చెట్టుపేరని సులభంగా తెలుస్తోంది. తెలుగులో ఎలికచెలి, ఎలికజెముడు ఎలికజేడు (Ipomaea reinformis, cnois) అనే మొక్కలున్నాయి. కృష్ణాజిల్లాలోని గన్నవరం తాలూకాలోని ఎలికపాడు కూడా ఇలాంటిదే. ఎలమర్రు, ఎలపర్రు, ఎలమంచిలిలోని 'ఎల' దీని సంబంధం కలదే. మాను మ్రాకు శబ్ద సంబంధి.

పెంట కేవలం మలం అనే అర్థంలోనేగాక కసవుఅనే అర్థంలో పెంటపోగులో కన్పిస్తుంది. చెత్త పనికిరానిది (మానవోపయోగానికి) అని అర్థాలు. పొలాల్లో పశువులను, గొర్రెలను, మేకలను పెంట కట్టడం తెలిసిందే. గ్రామనామపరంగా ఈ అర్థం కాదుగాని, దీనికి సమీపార్థంలో వర్తిస్తుంది. వర్షాకాలంలో పశువులను మేతకొరకు అడవులలో తోలడం తెలిసిందే. ఆ పశువులను రాత్రివేళ మందవేసే స్థలం పెంట. అట్టిచోట ఏర్పడిన ఆవాసాలకు 'పెంట' అనేది ద్వితీయావయవమయింది. రాళ్ళ పెంట, వనిపెంట, సునిపెంట ఇలాంటివే.

**ఎలమంచిలి :**

విశాఖజిల్లా గ్రామం. మరొక ఎలమంచిలి గోదావరిజిల్లా నరసాపురం తాలూకాలో వుంది. ఎల శబ్దం క్రొత్త లేత అనే అర్థాలనిస్తుంది. కాని ఇది ఒక మొక్క. మంచి- మంచిచెట్లలోని మంచి కాదు. గ్రామనామాల్లోని మంచి శబ్దం నీటిపట్టును సూచిస్తుంది. దీని పర్యాయపదాలు, బెంచి, వంచ-జాలిబెంచి, కడదర బెంచి అనే గ్రామాలున్నాయి. పాల్వంచ తెలిసిందే. ఇక మంచి శబ్దంతో కట్టమంచి, కారుమంచి మొదలైన గ్రామాలున్నాయి. మంచినీరు అనేది త్రాగు నీటిని సూచించే విధంగా ఉపయోగిస్తున్నాము. అలాకాక మంచినీరు అంటే సూతినీరు అనే అర్థం పొసగుతుందేమో పరిశోధించవలసి వుంటుంది. ఇక ఎల శబ్దంతో ఎలకుర్రు, ఎలమర్రు (పర్రు) అనే గ్రామాలున్నాయని ముందు చెప్పడం జరిగింది.

**ఏలూరు :**

ఈ పేరుతో పశ్చిమగోదావరి, గుంటూరు జిల్లాల్లో గ్రామాలున్నాయి. పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు సంస్కృతీకరింపబడి హేలాపురిగా సంభావితము. దీనికి గల మరొకపేరు ఉప్పులూరు. ఈ వివక్షకు కారణం ఉత్తరార్కాడు జిల్లాలోని రాయవేలూరు కారణం. శాసనాల్లో ఈ ఏలూరు వేలూరుగానే ప్రస్తాపితము.

శాసనం : శ్రీకృష్ణదేవరాయ మహారాయలు పృధ్వీ సామ్రాజ్యం చేయు..
గాను వేలూరి సోమేశ్వర —
ఇది శక సంవత్సరం 1443లో వేయబడిన శాసనము.
ఇక గుంటూరు జిల్లాలోని ఏలూరు కూడా వేలూరుగా వ్యవహృతము.
శాసనాల్లో వేలూరుగా, ఏలూరుగా కన్పిస్తుంది. ఇందలి శకటరేఫ భ్రాంతి
గావచ్చును.

. ధరించిన కొండవీటి వేలూరి గ్రామాన క్షేత్రము.... [1]

. ఆచంద్రాక్కరము నడపంగ్గలవాండు ఏలూరి తూర్పున బోయని [2]

ఇది పరిచ్ఛేద చిక్క భీమరాజుకు కార్యస్థానముగా చెప్పబడింది.

ఏరూరు ఏలూరుగా పరిణమించి యుండవచ్చును. రెండు గ్రామాలకు సమీపంలో ఏరూరులున్నాయి. ఏరు ప్రవాహార్థంలో తెలిసిందే.

ఏలేశ్వరం :

తూర్పుగోదావరి జిల్లా పెద్దాపురం తాలూకా గ్రామం. పెద్దాపురానికి ఉత్తరంగా 15 మైళ్ళ దూరంలో వుంది. ఏల+ఈశ్వరం. ఈశ్వర శబ్దం పుణ్య క్షేత్ర సంబంధి. ఏల, సమీపంలోని ఏలేరునది వలన సంప్రాప్తించింది. ఈ ఏలేరు ప్రస్తావన శ్రీనాథుని భీమేశ్వర పురాణంలో కన్పిస్తుంది. ఈ ఏలేరు మఠం భీమవరం సమీపాన గల దోమకొండ నుండి ప్రారంభమై, ఎర్రవరం వద్ద ట్రంకురోడ్డును దాటిన తర్వాత రెండు పాయలైంది. ఒక పాయ ఉప్పాడ సమీపంలోని రామన్నపాలెం వద్ద సముద్రంలో కలుస్తుంది. మరొక పాయ పెద్దాపురం సామర్లకోటల మీదుగా ప్రవహించి మూడు పాయలుగా చీలింది. ఈ ఏలేశ్వరానికి మరో పేరు ప్రత్తిపాడు. ఏల అనేది ఒక రకం సువాసన నిచ్చే గడ్డి. వెనుక వెలగపూడి, వెలగలేరులను గూర్చి చెప్పినపుడు కూడా వెలగ ఒకరకం గడ్డియని చెప్పడం జరిగింది. ఈ ఏల కూడా దాని సంబంధియే.

ఏళంజి :

అనంతపురం జిల్లా రాయదుర్గం తాలూకా గ్రామం. శాసనాల్లో దీని పేరు ఎళహంజి.

---

1 No. 72, S. I. I; Vol. xvi

2 No. 96 S. I. I; Vol. vi

శాసనం : రాయదుర్గం తాలూకా, బళ్ళారి జిల్లా
క్రీ.శ. 1556 సంవత్సరము సదాశివరాయల కాలం.
"శ్రీమన్ మహామండలేశ్వర రామరాజు, విఠలరాజు, తిరుమలయ్య, దేవమహారాజులుగారు, శ్రీమన్ మహారాయ గురునామధేయాంక పరమ నైష్ఠిక రాయదుర్గం శీమకు చెల్లేటి యెళహంజి సోమలాపురం చెరు.... కట్ట...." [3]

లోగడ ఎలమర్రు, ఎలకుర్రుల గూర్చి చెప్పినపుడు ఇది గడ్డి జాతికి చెందినదిగా చెప్పడం జరిగింది. హంజి, కన్నడ శబ్దం. నిజానికిది హంచి. the general name of the genera of cyperus or different grasses) దీనితో చీపురు కట్టలు తయారుచేస్తారు. ఇది కూడా ఒక గడ్డి మొక్క. ఇందులో చాలా రకాలున్నాయి. అందులో ఈ ఏళంజి లేక ఎలహంజి ఒకటి కావచ్చు.

ఓటిగుంట :

చిత్తూరు జిల్లా చంద్రగిరి తాలూకా గ్రామం. పుత్తూరు తాలూకాలో ఓటిచేను ఖండ్రిక, చిత్తూరు తాలూకాలో ఓటివారిపల్లె, ఓటేరుపల్లె అనే గ్రామాలుకూడా వున్నాయి. గుంట, నీటిపల్లంగా తెలిసిందే. ఓటివారి పల్లె ఓటి ఇంటిపేరుగా గలవారు మొదలు ఆవాస మేర్పరుచుకున్న గ్రామం. ఓటి అనేది ఒక రకం మొక్క. కన్నడంలో ఓటికాయమర అంటారు. తెలుగులో సీమ చింత వాడచింత అనటం కద్దు. సంస్కృతంలో రక్తస్రవ.

ఖండ్రిక, ఖండశబ్దభవం. ఒక గ్రామంనుండి, కొంత భూభాగాన్ని విడదీసి, ఎవరికైనా సంక్రమింపచేస్తే అది ఖండ్రిక. అంటే వరం లాంటిది. వరంముందు వివరింపబడింది. ఈ ఖండ్రిక లేక ఖండ్రిక శబ్దంతో గ్రామాలు, నెల్లూరు, చిత్తూరు జిల్లాల్లో అధికంగా కన్పిస్తాయి.

ఒప్పిచెర్ల :

పల్నాడు తాలూకా గ్రామం శాసనాల్లో దీనిపేరు వ్రప్పిచెర్ల, చెర్ల, చెరువు లకుసంక్షేమ రూపం. వ్రప్పి అనేది ఒకరకం గడ్డి. నిజానికది వర్పిలగడ్డి. వర్పిడి అని కూడా అంటారు. మాగాణిలో వచ్చే వరిలాగా ఉండే కలుపుమొక్క.

[3] No. 213 S. I. I; Vol. xvi

**ఓక్స్ పేట :**

ఇది గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా గ్రామం. 'ఓక్స్' అనే వ్యక్తి పేర మీదుగాఏర్పడింది. ఈస్టిండియా కంపెనీ కాలంలో థామస్ ఓక్స్ 1811 నుండి 182 వరకు గుంటూరు జిల్లాను పాలించాడు. సత్తెనపల్లి (మానూరి జమిందారి) తాలూక గ్రామాలను (వాసిరెడ్డి వెంకటాద్రి నాయని మరణం తర్వాత) రైతువారీ గ్రామాలుగా (అమాని గ్రామాలుగా) మార్చిందితడే. ఈ ప్రయత్నంలో ఇతడు చాలా ఇబ్బందులను ఎదుర్కొన్నాడు,

ఈ ఓక్స్ దొర రైతులకు చేసిన మేలుకు కృతజ్ఞతగా ఈ జనావాసానికి పేరు పెట్టుకున్నారు. ఓక్స్ రిజిష్టరు అంటే ఏమిటో రెవిన్యూ అధికారులకు, దేవాలయ భూములను వంశపారంపర్యంగా అనుభవిస్తున్న వారికి తెలుసు. ఇక ఏ గ్రామం పేరుముందైనా అమానీ అని ఉంటే అది రైత్వారీ గ్రామమని అర్థం చేసుకోవాలి. అమాని గుడిపాడు అలాంటిది. ముందు అమాని చిరువెళ్ళ ప్రస్తావింప బడింది.

**కంకిపాడు :**

కృష్ణాజిల్లా గ్రామం. కోలవెన్నుకు చెందిన ఒక శాసనంలో ఇది క్రంకిపాడుగా పేర్కొనబడింది. క్రంకశబ్దంతో క్రంకటావ (శాసననామం, ప్రస్తుతనామం కంకటావ) కనిపిస్తుంది. క్రంక శబ్దానికి అర్థం సమంగా బోధపడడం లేదు. అయితే కన్నడంలో క్రకర (the shrub capparis aphylla roxb). అనేది ఒక రకం మొక్కగా కన్పిస్తుంది. ఏమైనా అర్థానికి ఇంకా ప్రయత్నం చేయవలసి ఉంది. ఇలాంటి చాలా పదాలు నిఘంటువుల్లో కన్పించవు. అలాంటి ప్రయత్నం అత్యవస రంగా కన్పిస్తోంది.

**కంచెల :**

నందిగామ తాలూకా గ్రామం. దీని పూర్వనామం కంచెర్ల. భక్తరామదాసు గోపన్న ఇంటిపేరు కంచెర్ల. ఇచ్చటి రామేశ్వర దేవాలయముంది. కంచి, చెర్ల కంచెర్ల అయింది. కంచికి చెర్ల కూడా ఇలాంటిదే. కంచి శబ్దం, కొణకంచి గ్రామనామ వ్యుత్పత్తిలో చూడనగును. చెర్ల చెరువు + లకు సంశ్లిష్టరూపం. చెరువు శబ్దం ముందు వివరింపబడింది.

**కట్టుగుత్త వెంగన్న గారిపల్లె :**

కడప జిల్లా కమలాపురం తాలూకా గ్రామం. వ్యక్తి నామ సూచి మరో వెంగన్నగారిపల్లె ప్రొద్దుటూరు తాలూకాలో వుంది. వెంగళన్న వెంగన్న అయింది..

వెంగళ శబ్దం వెళ్ + కొండల సమీకరణం. వెళ అంటే తెలుపు. ఫలితార్థం వెలి గొండలు. తిరుపతి కొండలకు వెలిగొండలని పేరు. వెళగొండ, వెళ్గొండ అవుతుంది. 'క'కారం తమిళోచ్చరణలో 'గ' కారమవుతుంది. అలా ఇది వెంగళ అయింది. తెలుగున వెంకన్న, తిరుమలపై వెలసిన స్వామి పేరు. అయితే వెంకటేశ్వర అనడం కూడా కద్దు. వేంకట శబ్దానికి పాపాలు హరించే వాడని చెపుతాడు. ఈ వెంగళ శబ్దంలోని 'వ'కారం లోపించి ఎంగయ్య, ఎంగమ్మ, ఎంగన్న అనే రూపాలేర్పడ్డాయి. అన్న జ్యేష్ఠ సోదరునికి తెలుగున సంకేతం. పూజ్యార్థ సూచకం కూడా నామాంత్య పదాల్లో కూడా కన్పిస్తుంది. ఉదా : రామన్న, సుబ్బన్న.

కట్టుగుత్త అనేది 'గుత్త' లోని ఒక రకం. ఒడంబడిక ప్రకారం ముందే భూకామందుకు చెల్లించే సొమ్ము గుత్త. ఇది ప్రతి సంవత్సరం మారవచ్చు. కట్టుగుత్త ఇలాకాక శాశ్వతంగా నిర్ణయింపబడినది.

**కడవకుదురు :**

ఇది ప్రకాశం జిల్లాలో వుంది. 'కుదురు' పేరుతో ఇంకాకొన్ని ఊళ్ళు నడకుదురు, పెనుగుదురు, ములుకుదురు మొదలైనవి కన్పిస్తాయి. రెండు ప్రవాహాలు కలిసినచోట అంటే భూమి సమంగా ఉన్నచోట ఈ కుదురు వర్తిస్తుంది. వాడికి కుదురులేదు, పాదుకు కుదురు చేయడం లాంటి వ్యవహారాలు తెలుసు గదా ! అలాంటిదన్నమాట. ఇక కడవకుదురులోని కడవ, నీరు తెచ్చుకోడానికి వుపయోగించే పాత్రకాదు. ఇది ఒక చెట్టు. కన్నడంలో కడవ, కడవాలదమర అనే పేరుతో చెట్టు ఉంది. కృష్ణాజిల్లాలోని కడవకొల్లు కూడా ఇలాంటిదే. కడవకుదురు శాసననామం కడాకుదురు.

**కత్తెరగండ్ల :**

కడపజిల్లా బద్వేలు తాలూకా గ్రామం. శాసనస్థ నామం కత్రకండ్ల.

శాసనం : బద్వేల్ తాలూకా, కడప జిల్లా

క్రీ.పూ. 1525 శ్రీకృష్ణదేవరాయల కాలం.

"గార్గ్య గోత్రం ఆపస్తంబ సూత్రం యజు శాకాధ్యాయులైన సర్వక్రతు వాజపేయాజులైన పడపీటి విరూపాక్ష దీక్షితులంగారి కొమారుడు అన్నాజయ్య వారు కత్రకండ్ల చెన్నకేశ్వర దేవరకు యిచ్చిన భూదాన ధర్మశాసన పట్టక్రమ మెట్లన్నను.... మాకుంజెల్లే కత్రకండ్ల పొలం లోను ..." 1

1 No. 78, S. I. I; Vol. xvi

ఘండికోట సీమకు చెందినదిగా చెప్పబడింది. ఇక్కడి అధిష్ఠాన దైవం చెన్నకేశవ స్వామి. శ్రీకృష్ణదేవరాయల పాలనాకాలంలో శక సంవత్సరం 1448 (క్రీ 1526) పార్థివ నామ సంవత్సరం పుష్య పౌర్ణమినాడు పదవాటి విరూపాక్ష దీక్షిత కుమారుడు అన్నాజయ్య ఈ గ్రామంలోని కొంత భూమిని దేవునికి దానం ఇచ్చినట్లు శాసనం చెపుతోంది. కత్రికండ్ల వ్యవహారంలో కత్తెరగండ్ల అయింది. ఇలాంటిదే పెరోపూరు కత్రిమల అనే గ్రామం. అనంతపురం జిల్లా గుత్తి తాలూకాలో ఉంది.

కత్తెర శబ్దం, దేనినైనా ఖండించడానికి ఉపయోగించే పనిముట్టుగా తెలుగు (Scissors) గ్రామనామాలతో దీనికి సంబంధం లేదు. కత్తి, కొడవలి అనే అర్థాలు కూడా ఇక్కడ సరిపోవు. భూమి కొలతకు సంబంధించి 'కత్తు' ఒక ప్రమాణంగా తెలిసిందే అయితే ఇది కూడా సమర్థనీయం కాదు. కత్తి అనేది ఒకరకం మొక్క. కత్తెరమాను అని కూడా అంటారు. కత్తిపూడి, కత్తెరమలలతో పోల్చి చూసినపుడు ఇది మొక్కగానే బోధపడుతుంది. కన్నడంలో కత్తిగురుబ (a common grass chloris barbata swartz) అనే మొక్క ఉంది. కత్తి చెట్టు అనే గ్రామం శ్రీకాకుళం జిల్లాలో ఉంది, పూడి, మల, కొండ అనుబంధంగా గల గ్రామాల్లోని చాలా పూర్వపదాలు స్థానికంగా పెరిగే మొక్కలనే సూచిస్తాయి. ఇక కండ అంటే సొంతమైన భూమి అనే అర్థంలో తెలిసిందే. ఇక్కడ కేవలం భూఖండం అనేది చెప్తున్నది. లేదా ఎత్తైన భూమిని కూడా సూచిస్తుంది. కండెం అంటే పొలిమేరను కూడా సూచిస్తుంది.

**కదిరి :**

ఇది అనంతపురం జిల్లా గ్రామం. కదిరి నరసింహస్వామి ఆలయం ప్రసిద్ధమైంది.

శాసనం : కదిరి తాలూకా, అనంతపురం జిల్లా

క్రీ. శ. 1352 మొదటి బుక్కరాయల పాలనాకాలము

"కదిరి అవుభళదేవర నగరి మంటపము తిరుబని పరిపూర్తిసేసిరి" . . [1]

క్రీ. శ. 1418 మొదటి దేవరాయల కాలం.

"శ్రీ కదిరి నారసింహ్యదేవర". . [2]

1 No. 48, S. I. I; Vol. xvi

2 No. 24, S. I. I, Vol. xvi

ఖదిర (Acacia catichu) అనేది చెట్టుపేరు. ఇంకా ఈ జిల్లాల్లో కదిరి బ్రాహ్మణపల్లె, కదిరి కుంట్లపల్లె, కదిరిపూవి కుంట అనే గ్రామాలున్నాయి. కదిరినాథుని కోట అనే గ్రామం చిత్తూరుజిల్లాలో వుంది.

**కపిలేశ్వరపురం :**

ఈ పేరుతో తూర్పుగోదావరి జిల్లాల్లో ఒకటి, కృష్ణాజిల్లాలో మరొకటి గ్రామాలున్నాయి. గజపతి వంశంలోని కపిలేశ్వర గజపతి పేరు మీదుగా ఈ రెండు గ్రామాలు వచ్చాయి. కపిల, ఈశ్వర శబ్దాల కలయిక కపిలేశ్వర. కపిల శబ్దానికర్థం గోరోజన వర్ణం. ఒక మునిపేరు మీదుగా తిరుపతిలోని కపిలతీర్థం ప్రసిద్ధమైనది.

ఈ గజపతుల కాలంలో పురుషోత్తమ గజపతి పేరు మీదుగా కృష్ణా, గుంటూరు జిల్లాల్లో, పురుషోత్తమ పట్నాలనే రెండు గ్రామాలేర్పడ్డాయి. విద్యాధర గజపతి పేరు మీదుగా విజయవాడ సమీపాన విద్యాధరపుర మేర్పడింది. వీరి సైనికాధికారి పేరుమీదుగా కృష్ణాజిల్లాలో బాహుబలేంద్రుని గూడెం ఏర్పడింది. వారి ఇంటి ఆడపడచుల పేరుమీదుగా విజయవాడ సమీపాన ముత్యాలంపాడు, భవానీపురంలు ఏర్పడ్డాయి.

**కప్తానుపాలెం :**

కృష్ణాజిల్లా దివి తాలూకాలోని పెదప్రోలు పంచాయితీకి చెందిన రెవిన్యూ గ్రామం. కప్తాను అనే పదం కేప్టెన్ (Captain) అనే ఆంగ్ల పదానికి మారు రూపం. సైనిక అధికార శ్రేణిలో ఒక పదవిని సూచిస్తుంది. ముఖ్యంగా నావికా సిబ్బంది విషయంలో, ఓడ ముఖ్యాధికారికి వర్తిస్తుంది. పోర్చుగీసు భాషలో 'కపితాన్, అంటే నావికుడు, నావికా సిబ్బంది అధికారి.

విదేశీపాలనా కాలంలో గ్రామాలలోనికి వారి రాకపోకలపై విధి నిషేధాలుండేవి. అందువలన ప్రధాన ఆవాసాలకు కొంతదూరంలో వారి నివాసాలుండేవి. ఈ గ్రామం విషయంలో విదేశీయులు ఈచోట వ్యవసాయోత్పత్తులను కొనుగోలు చేసే కేంద్రంగా వుండేదని స్థానికుల కథనం. కాగా, కేప్టెన్ హోదా కలిగిన అధికారి ఎవరైనా మొదట ఆవాస మేర్పరచుకున్న గ్రామం కూడా కావచ్చు. దేవరకోట జమీకి చల్లపల్లి కార్యస్థానం. ఆ జమీ అధిపతులు, తమ వ్యవసాయ భూముల అజమాయిషీకి, గుంటూరుజిల్లా నుండి వ్యవసాయ కుటుంబాల వారిని రప్పించారని తెలుస్తోంది. అలా ఏర్పడిన గ్రామాలు మంగళాపురం, నడకుదురు, పురిటిగడ్డ, రాముడుపాలెం, కప్తానుపాలెం మొదలైనవి తెలుస్తోంది. పాలెం ముందు వివరింపబడింది.

**కమతంవారి పాలెం :**

తెనాలి తాలూకా అత్తోట శివారు గ్రామం. కమతం ఇంటిపేరు గల వార మొదట ఆవాస మేర్పరుచుకోవడం వలన ఏర్పడిన గ్రామం.

కమతం, కమతగాడు అనే పదాలు వినే వుంటారు. పెద్ద వ్యవసాయ భూఖండాన్ని కమతం అంటారు. జీతగాడిని కమతగాడు అంటారు. పొలికి సేద్యం చేయడాన్ని కూడా కమతం అంటారు. కర్ణాటక ప్రాంతాల్లో ఇంటిపేరుగా విన్పించే కామత్ శబ్దం దీనినుండి ఏర్పడినదే. పాలెం శబ్ద వివరణ వేరుగా ఇవ్వబడింది.

**కమ్మపల్లె :**

ఇది చిత్తూరుజిల్లాలోనిది. గుంటూరుజిల్లాలో కమ్మవారిపాలెం వుంది. ఇందలి 'కమ్మ' శబ్దం ఒక కులాన్ని సూచిస్తోంది. కాని ఇది కుల శబ్దం కాదు. ఒక ప్రాంతపు జనులను సూచిస్తుంది. ఆ ప్రాంతం వారెవరైనా (కమ్మనాటివారు) కమ్మ వారే. కృష్ణాజిల్లా దివితాలూకా ప్రాంతంనుండి ఒంగోలు వరకు తూర్పుకనుమలు సముద్రము హద్దుగాగల ప్రాంతం కమ్మనాడు. కమ్మ అంటే నది. కృష్ణానదిని శాసనాల్లో పేరకమ్మగా సంభావింపబడింది. అసగా పెద్దనది దాని సమీపంలోగల చిన్ననది ఖడమేరు. ఒంగోలుకు సమీపానగల గుండ్లకమ్మకు పేరకమ్మకు (కృష్ణానది) మధ్యగల భూభాగం కమ్మనాడు, కమ్మనాటి జనులు కమ్మవారు. అంతే కాని అది కులం పేరుకాదు. అయితే సాధారణంగా భూమిపై ఆధారపడి జీవించే వారికి అంటే రైతులకు, ఆ నాడు పేరు చెల్లివస్తుంది. అలా, కమ్మ శబ్దం ఒక వర్గం వారికి పేరయింది ఆ వర్గంవారు మొదట నివాసం ఏర్పరుచుకోవడం వలన ఇది కమ్మపల్లె.

ఇక్కడ మరొక విశేషం చెప్పాలి. తెలుగునాట ఒక సామెత వుంది. 'కమ్మ గుట్టు గడపదాటదు' అని. దీనికర్థం, కమ్మవారింటి గుట్టు (రహస్యం) వారింట గడప దాటదు. అంటే అంత గోప్యంగా వుంటుంది అనే అర్థంలో చెపుతారు. నిజాని కిది సరికాదు. ఎందుకంటే ఎవరైతే మాత్రం వారింటిగుట్టును బహిర్గతం చేసి కుంటారు గనుక. వాస్తవమేమంటే కమ్మనాటి గుట్టు గడపదాటిపోదని, అంటే పాకనాడు దాటినా, రేనాటిసీమను దాటిపోదని అర్థం. కడప అంటే గడప అనే అర్థం. పాకనాటికి అటువైపు రేనాడులోని కడపే ముఖద్వారం. కడపజిల్లాలో దేవుని కడప అనే మరో గ్రామం కూడా వుంది.

### కయిదుగాడి కంౢడిక :

ఇదికూడా చిత్తూరుజిల్లా గ్రామం. ఖైదు అంటే తెలిసిందే. ఇక్కడ ఖైదు గాడు అంటే జైలుమీది అధికారి. గాడు అనేది కొంత అల్పార్థంలో వచ్చింది. అలాంటి అధికారి సేవలకు ప్రతిఫలంగా ఇచ్చిన కంౢడిక. కంౢడిక ముందు వివరింప బడింది.

### కలమళ్ళ :

కడపజిల్లా కమలాపురం తాలూకా గ్రామం శాసనములో దీని పేరు కెలుమళగా కన్పిస్తుంది.

శాసనం : కమలాపురం తాలూకా; కడపజిల్లా.

క్రీ.శ. 1546 సదాశివరాయల కాలం....

"సదాశివదేవ మహారాయలుంగారు పాలించిన పులివిందల సీమలోని కలుమళ్ళ గ్రామాన మంగళకాణాచివాడ్లు...." [1]

కలమళ్ళ, కమలాపురం తాలూకా; కడప జిల్లా.

క్రీ.శ. 1550 సదాశివరాయల కాలం.

"శుభమస్తు స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శక వర్షంబులో 1472 అగు నేటి సాధారణ సంవత్సర పుష్య బ 6 సో శ్రీ మదఖిలాండకోటి బ్రంహ్మాండనాయకులైన కలుమళ శ్రీచన్న కేశవమూర్తికి...." [2]

కలమళ్ళ, కమలాపురం తాలూకా; కడప జిల్లా,

క్రీ.శ. 1557 సదాశివరాయల కాలం.

"శ్రీ మదఖిలాండ్డకోటి బ్రంహాండ్డ నాయకులైన దైవసిఖామణి అఇన వేదవేదాంత వేద్యులైన శ్రీ పురాణ పురుషోత్తములైన కెలుమళ శ్రీ చంన్న కేశవమూర్తికి...." [3]

తెలుగులో కెలన, కన్నడంలో కెల శబ్దాలు ప్రక్క పార్శ్వము అని అర్థాలనిస్తాయి. కెళవు దూరము అనే అర్థాన్నిస్తుంది. మడి, సాగుభూమికి అనువర్తిస్తుంది. వెనుక 'ఆకుమళ్ళ' వివరించడం జరిగింది.

---

1 No. 147, S. I. I. Vol. xvi

2 No. 176, S. I. I. Vol. xvi

3 No. 220, S. I. I. Vol. xvi

(Eleusine aegyptiaca, Desf) అని పిలువబడే ఒకరకం గడ్డిమొక్క ఎఱ్ఱ నేలల్లో మొలుస్తుంది. పశుగ్రాసంగా ఉపయోగిస్తుంది. ఊరు ముందు వివరింపబడింది.

**కాకుమాను :**

గుంటూరు జిల్లాలోని గ్రామం. మ్రాను, మాను, చెట్టు అని అర్థం. కాకు అనేది ఒక రకమైన రేలచెట్టు. అనంతపురం జిల్లా కాకి అనే గ్రామం. ప్రకాశం జిల్లాలోని కాకిమాని మిట్ట అనే గ్రామాల్లో కూడా ఇదే అర్థం. ఇంకా కాకులపాడు, కాకితలువూరు అనే గ్రామాలున్నాయి.

**కాగితరామ చంద్రపురం :**

కృష్ణాజిల్లా గ్రామం. ఇంటిపేరుతోసహా వ్యక్తి పేరుమీదుగా ఏర్పడిన గ్రామం. కాగిత, కాగితాల ఇంటిపేర్లు గలవారున్నారు. ఇందలి 'కాగిత' శబ్దం మనం ఉపయోగిస్తున్న కాగితం 'కాగజ్' హిందీ శబ్ద సంబంధి. ఈ 'కాగిత' అన్నది ఒక ఊరు. ఆ గ్రామదేవత కాగితమ్మ. కాకతమ్మ అయి కాకతీరాజ వంశానికి నామమైనది. 'కాగిత' అనే పేరుతో విశాఖపట్నం జిల్లా సర్వసిద్ధి, వీరవల్లి తాలూకా లలో గ్రామాలున్నాయి. ఈ కాకిత, లేక కాగిద అనేది మొక్క కావచ్చును.

**కాజ :**

ఈ పేరుతో కృష్ణా, గుంటూరు, పశ్చిమగోదావరి జిల్లాలో గ్రామాలున్నాయి. కాజ, పూర్వరూపం శాసనాల్లో 'క్రాంజ' గా కనిపిస్తుంది.

శాసనం : కొండవీడు-గుంటూరు తాలూకా, గుంటూరు జిల్లా

పూర్వానను క్రాంజను బాచరుసయ్య కొనిపెట్టిన క్షేత్ర.... [1]
వూరికి వుత్తరాన దంతెలమిట్టను కాంజతెర్వు బెంట్టను.... [2]

కాజ-గుంటూరు తాలూకా, గుంటూరు జిల్లా

క్రాంజ కల్యాణ కేశవదేవర అర్చన అమదుపడులకు.... [3]
క్రాంజ కల్యాణ కేశవదేవరసాని మాన్య నిబంధములకు బెట్టిన క్షేత్రము.... [4]

[1] No. 699, S. I. I; Vol. iv
[2] No. 702, S. I. I; Vol. iv
[3] No. 704, S. I. I; Vol. iv
[4] No. 705, S. I. I; Vol. iv

పడుమటి సీమలోని జేవర గ్రామంలో తన ప్రభువు, బావయైన గొంకరాయ పేర గొంకేశ్వరాలయాన్ని, తన సోదరి కామిదేవి పేర ఒక చెరువును నిర్మించినట్లు తిమ్మాపురం శాసనం తెలుపుతోంది. శరణం ఇంటిపేరుగా గలవారికి మూలపురుషుడు ఈ శరణుడు కావడానికి అవకాశముంది. కామే శబ్దంలోని ఏకారం నిర్దిష్ట సూచకం. గ్రామనామాల్లో చాలా వాటిల్లో ఇది కన్పిస్తుంది. పోల్చిచూడు తాడేపల్లి, బబ్బేపల్లి మొదలైనవి.

**కావూరు :**

గుంటూరు జిల్లాలో ఈ పేరుతో రెండు గ్రామాలున్నాయి. ఒకటి రేపల్లె తాలూకాలోను, మరి రెండు నరసరావుపేట తాలూకాలోను కలవు. 'కా' శబ్దానికి రక్షకుడు, ప్రభువు అనే అర్థాలున్నాయి. లేక కాడు శబ్దంతో పోల్చినపుడు అటవీ సూచక మవుతుంది. మొదటి అర్థంలో ప్రధాన గ్రామమని, రెండవ అర్థంలో అటవీ ప్రాంతంలో వచ్చిన గ్రామమని చెప్పవలసి ఉంటుంది.

నరసరావుపేట తాలూకాలోని ఒక కావూరును కొండ కావూరని వ్యవహరించడం కద్దు. కారణం సమీపంలోని కొండ. ఈ కొండపైనే త్రికోటీశ్వర దేవాలయముంది. దీనినే కోటప్పకొండ అంటున్నాము. ఇది ఈ కావూరిలోని అంతర్భాగమే. మరొక కావూరుకు లింగంగుంట్ల కావూరని వ్యవహారం. ఇది లింగం గుంట్లకు సమీపంలో ఉండడం వలన, సమీపంలోనే రెండు కావూరులు రావడం వలన ఈ వివక్ష అవసరమైంది. రేపల్లె తాలూకాలోని కావూరుకు ముందు కూడా మరేదైనా పదం వుందేమో తెలియదు. ఇక ఈ కొండకావూరుకు కొండ పడుమట కావూరనే వ్యవహారమున్నట్లు నాదిండ్లలోని ఒక శాసనం చెపుతోం కొండ పడుమటి సీమ అంటే కొండవీడు కొండలకు పడమట గల భూభాగమని, ఈ వివక్ష రావటానికి కారణం లింగంగుంట్ల కావూరుకాదు. రేపల్లె తాలూకాలోని కావూరే. ఇది కొండవీడు కొండలకు తూర్పు భాగాన ఉంది. ఈ రెండు కావూరులను వివక్షించడానికి కొండ పడుమట కావూరు అనవలసి వచ్చింది. దీనినిబట్టి పై శాసన కాలం నాటికి లింగం గుంట్ల కావూరు ఏర్పడలేదని భావించాలి. కారణమేమంటే లింగంగుంట్ల కావూరు కూడా కొండ పడుమటి సీమలోనిదే. ఇక సందర్భాన్ని బట్టి కావూరులోని 'కా' దైవాన్ని కాక కాటూరుతో పోల్చి చూసినపుడు అడవిని సూచించే అవకాశం కూడా గలదు.

**కిదరబాదు :**

కృష్ణాజిల్లా గ్రామం. కొండపల్లి సమీపంలో ఉంది. క్రీ. శ. 1535 లో కులీ కుతుబ్‌షా ఇక్కడ ఒక సత్రం కట్టించి, దీని పేరును మాల్కాపురంగా మార్చాడు. కాని ఆ పేరు కాలంమీద నిలువలేదు. ఈ సత్రానికి పోషణ నిమిత్తం కవులూరు, కోమటిపేట గ్రామాలపై వచ్చే ఆదాయాన్ని వెచ్చించాల్సిందిగా నియోగించాడు. ఈ కోమటిపేట నేడు ఇబ్రహీంపట్నంగా వ్యవహరింపబడుతుంది. ఇబ్రహీం కులీ కుతుబ్‌షా పేరు మీదుగా మార్చబడింది. అతని పరిపాలనా కాలంలో (1530 - 1580) ఇది అతని అభిమాన నివాసస్థలంగా వుండేది. నేటి మన రాజధానీ నగరం హైదరాబాదు ఇతని కుమారుడైన హైదర్‌ఖాన్ పేరు మీదుగా ఏర్పడిందే. ఇతడు తండ్రి జీవించి యుండగానే కాలం చేసాడు. ఆబాద్ అంటే సాగుచేయబడిన భూమి, ఆవాసస్థలము అనే అర్థాలున్నాయి.

**కిలేరికడవసత్తం :**

ఇది చిత్తూరు జిల్లా గ్రామం. కిలేరు ఒక నది. కడవ శబ్దాన్ని గూర్చి ఇది ఒక చెట్టు అని, కడవకుదురు, కడవకొల్లు గ్రామాలను గూర్చి చెప్పినపుడు వివరించడం జరిగింది. నత్తం అంటే గ్రామాన్ని ఆనుకొని వున్న భూమి పన్ను మినహాయింపు గలిగిన గ్రామం.

**కుక్కలగుంట :**

తెనాలి తాలూకా గ్రామం. కుక్కల, కుక్క (జంతువు)కు బహువచనం కాదు. ఇది ఒకరకం మొక్క. కుక్క, అల, ల కలయిక కుక్కల. తెలుగులో ఈ పేరుతో మొక్క ఏదీ నిఘంటువుల్లో కన్పించదు. రైతులకు తెలిసి వుండవచ్చు. అయితే కుక్కతులసి, కుక్కపొగాకు అనే కలుపుమొక్కలు తెలిసినవే. కన్నడంలో కుక్క పేరుతో పొదగా పెరిగే ఒక మొక్క వుంది. గుంట వేరుగా వివరింపబడింది.

**కుంచవరం :**

తెనాలి తాలూకా గ్రామం. మంగళగిరికి సమీపంలో కుంచెనపల్లి అనే గ్రామముంది. శాసనాలలో కుంచులపల్లెగా ప్రస్తావించబడింది. కాగా ఈ గ్రామ ప్రస్తావన రెండు శాసనాలలో కన్పిస్తుంది.

శాసనం : ఈమని : తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా

స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర కాకతియ్యప్రతాపరుద్రదేవ మహారాజులకు
ధర్మ్మవుగాను కుంచ్చవరం అగస్తీశ్వరు.... [1]

దుగ్గిరాల : తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా
.. దుగ్గటేల పూండ్డి కుంచ్చవరానకూ... [2]

కుందుర్రు :

గుంటూరు జిల్లా సరసరావుపేట తాలూకా గ్రామం. శాసనస్థనామం కుణుదొర్తి. తుర్రుకు పొప విభక్తిక రూపం తుర్తి. తుర్రు పూర్వం వివరింపబడింది. కాగా కుందురు అనేది ఒక రకం గడ్డి కూడా Ischaemum bilosum, Hack శాసనాల్లో ఇది వినుకొండసీమ లోనిదిగా చెప్పబడింది. ఇక్కడి అధిష్ఠాన దైవం పురుషోత్తమ దేవుడు.

శాసనం · నర్సరావుపేట తాలూకా; గుంటూరుజిల్లా

క్రీ.శ. 1525 శ్రీకృష్ణదేవరాయల కాలం
"శ్రీకృష్ణ దేవమహారాయలు పృధివి రాజ్యం శేయుచుండ్డంగాను కొణుదోర్తె శ్రీ పురుషోత్తమ దేవుని..."
"వినుకొండ శీమలోను మా నాయంక్రానకు పాలించ్చి యిచ్చిన కుణుదొర్తను పడమట మలినేని చెర్వు..."

కుందేళ్ల గుంట :

చిత్తూరుజిల్లా గ్రామం. గుంట, అంత విశాలంగాని నీటిపల్లాన్ని సూచిస్తుంది. ఇక కుందేళ్ళు జంతు సూచిగా తెలుసు. కాని ఈ గ్రామనామంలోని కుందేలు జంతు సంబంధి కాదు. కుందు, కుందురు, కుందేటి గడ్డి. కుందేటి మెరుగు అనేది ఒకరక గడ్డిమొక్కలు. మెట్ట, మాగాణి భూముల్లో ఏటా మొలిచే ఒక విధమైన తీగగడ్డి. కృష్ణాజిల్లాలో కుందేరు అనే గ్రామం ఉంది. కడప జిల్లాలో కుందు అనే నది వుంది. కుందేరు గ్రామంలోని కుందుగడ్డి కావచ్చును. కాని కుందునదిలోని 'కుందు' గడ్డికాదు. కుందుట అంటే దుముకుట, గెంతుట అనే అర్థాలున్నాయి. కుందుకుట్టు అనే ఆట చిన్నపిల్లలు ఆడుతారు. ఒకకాలు వెనుకకు మడిచి, ఒంటికాలి మీద గెంతడాన్ని కుందుట అంటారు. అలాంటి ప్రవాహ గమనశీలం గల ఏరు

---

1 No. 538, S. I. I. Vol. x

2 No. 261, S. I. I. Vol. x

కుందేరు. అలా గెంతే జంతువు గనుక కుందేలు. ఏలు అంటే జంతువు అని సామాన్యార్థం. తాబేలు, తోడేలులలోని 'ఏలు' జంతువును సూచిస్తుంది. ఇక రోటిపైన పదార్థం బయటకు పోకుండా పెట్టే వస్తువును కూడ కుంది అంటారు. అంటే పదార్థం పైకి (బయటకు) పోకుండా (కుందకుండా) ఉండడానికి పెట్టేసే సాధనం కనుక అది కుంది అయింది. ఆ ఆకారంలో చేయబడింది కనుక దీపారాధన చేసే పాత్రను కూడా కుంది (దీపారాధన కుంది) అనడం జరిగింది.

ఇకపై గ్రామనామంలోని 'గుంట' అనే అనుబంధం వలన పై గ్రామంలోని 'కుందు'ను వృక్ష సూచిగానే భావించాలి తప్ప జంతు సూచిగా భావింపరాదు. ఏడు శబ్దం ఇంకా కొన్ని వృక్షనామాల్లో నేరేడు, మారేడు మొదలైన మాటలో కన్పిస్తుంది.

**కురగల్లు :**

గుంటూరు జిల్లా గ్రామం. మంగళగిరికి సమీపంలో వుంది. దీనిని శాసనాలు[3] కురంగల్లుగా పేర్కొన్నారు.

శాసనం : భూభూషణో యీవని కంద్రవాటీ కుఱుంగలు గ్రామ విభుర్బభూవ
తస్యే ష్టపృత్యే స్సన్నపాలకస్య ధీరస్సతాసూయయ్తు మనాయాకోయః.... [1]
నాదెండ్ల : గుంటూరు తాలూకా, గుంటూరు జిల్లా
భూ భూషణోయీవని కంద్రవాటి కుఱుంగ్గలు గ్రామవిభోస్సపుత్రః .. [2]
మంగళగిరి : గుంటూరు తాలూకా, గుంటూరు జిల్లా
కురుంగంటి క్షేత్రము కేసరపాటి .. [3]

కుర్రుశబ్దం ముందు వివరింపబడింది. ఇది కూడా ప్రవాహాల వెంటగల ఎత్తైన నేలను సూచిస్తుంది. కొంత శిలా సంబంధి కూడా. బల్లికురవలోని కురవ కూడా ఇదే. కురచ శబ్దం తెలుసుగదా! మరీ అంత ఎత్తైనది గాక ఒకపాటి ఎత్తును సూచిస్తుంది. ఈ గ్రామంలో నేల బారుగాగల కొండ వుంది. కనుక ఇది కురగల్లు, కాగా కురమ శబ్దం వృత్తి సంబంధిగా కూడా కన్పిస్తుంది. ఇక్కడ మాత్రం ప్రాంత స్వభావసూచి మాత్రమే. గల్లుకు పూర్వరూపం కల్లు, శిలా సంబంధి.

**కురువపల్లె :**

ప్రకాశంజిల్లా మార్కాపురం తాలూకా గ్రామం. కురువ లేక కురబ అనేది

---

1 No. 109 S. I. I; Vol. x

2 No. 681, S. I. I; Vol. IV

3 No. 709, S. I. I. Vol. IV

ఒక 'కులం' పేరు. ఈ గ్రామాన్ని శక సంవత్సరం 1455 (క్రీ.శ. 1533)లో అచ్యుత దేవరాయల పాలనాకాలంలో సకలరాజు పినతిరుమలయ్య కొండాపురమనే పేరుతో మార్కాపురం చెన్నకేశవస్వామికి దానం చేశాడు. అయితే ఆ పేరు కాలం మీద నిలువలేదు. దీనితోపాటు యాచవరం గ్రామాన్ని తన ప్రభువు పేరుతో అచ్యుతరాయపురంగా మార్చి దానం చేశాడు. ఈ రెండూ కొచ్చెర్లకోటసీమలోనివిగా శాసనాల్లో పేర్కొనబడ్డాయి.

ఇందలి కుంచ శబ్దం, పరిమాణార్థకంలో ఉపయోగించే కుంచం కాదు. ఇది ఒక జాతి జనులపేరు. కుంచుల కౌరవలు అనే కులం వుంది. నేతపనిలో ఉపయోగించే అచ్చు కుంచెలను తయారుచేయడం వీరి వృత్తిగా చెప్పబడింది. కుంచ శబ్దం ఇంటిపేరుగా కూడ కన్పిస్తోంది. వరం వేరుగా చెప్పబడింది.

కూర్మాయి :

చిత్తూరుజిల్లా పలమనేరి తాలూకా గ్రామం. అయితే దీని నిజనామం కురుమావి.

శాసనం : పలమనేరు తాలూకా, చిత్తూరుజిల్లా.

క్రీ.శ. 1559 సదాశివరాయల కాలం.

"పులినాటి సీమలో సొంపాతి రాజ్యానికి చెల్లె .. దేవస్తానాలలోను నడిచె కురుమావి వరదరాజుల దేఉనిగూడిస్తానంవారు. [1]

వ్యవహారంలో కుర్మాయి అయింది. కురు అంటే చిన్న, మావి, మామిడి సంబంధి కావచ్చు. మామిడి అన్నంత మాత్రంచేత, చూతము కానక్కరలేదు. మామిడి పేరుతో ఒక రకం గడ్డి కూడా ఉంది. నేల మామిడి అలాంటిదే. అయితే కొరమామిడి అనేది ఒక రకం మొక్క. ఈ పేరుతో ఒక గ్రామం పశ్చిమగోదావరి జిల్లా నిడదవోలు తాలూకాలో ఉంది. కొరమామిడి పాలెం అనే గ్రామం విశాఖపట్నం జిల్లాలో ఉంది. అయితే మేలుమాయి అనే గ్రామం ఈ తాలూకాలోనే ఉంది. మేల్ అంటే ఎత్తైన అని అర్థం.

కూశహ్యారు :

ఇది కూశహ్యారు లేక కూడ్లూరుగా వ్యవహృతము. అనంతపురం జిల్లా, రాయదుర్గం తాలూకా గ్రామం. కూడలి అంటే సంగమం. కూడ్లిగి అనే గ్రామం కూడా ఉంది. ఈ గ్రామానికి గల మరోపేరు రెడ్డిరాజుపురం. ఇది కాటేపల్లె, ముద్దలాపురాలకు సంగతమైన గ్రామంగా శాసనం చెపుతోంది.

[1] No. 288, S. I. I; Vol. xvi

**కేసినేనిపల్లె :**

కర్నూలుజిల్లా కోయికుంట్ల తాలూకా గ్రామం. శాసనాల్లో దీనిని కోటపాటి కేసినేనిపల్లెగా చెప్పబడింది.

శాసనం : బొల్లవరం (ప్రొద్దుటూరుశివారు) ప్రొద్దుటూరు తాలూకా, కడపజిల్లా.
క్రీ.శ. 1542 సదాశివరాయల కాలం.
"కోటిపాటి కేసినేనిపల్లె స్తితఆశేషవిద్వన్మహా జనాలకున్ను యిచ్చిన ధర్మశాసనము...." [1]

కేశవనాయనిపల్లె వ్యవహారంలో కేసినేనిపల్లె అయింది. 'నేని' శబ్దం వివరణ తరువాత ఇవ్వబడుతుంది. కేసానుపల్లె అనే గ్రామం నరసరావుపేట తాలూకాలో వుంది. కేసాని ఇంటిపేరు గలవారున్నారు. అయితే ఈ రెండూ కేశవసాహిణి శబ్ద భవాలు, సాహిణి అంటే సైన్యాధికారి. అశ్వసాహిణి, గజసాహిణి అనేవి వరుసగా గుర్రాల, ఏనుగుల దండుపై అధికారులను సూచిస్తాయి. జాయపసేనాపతి కాకతీయులవద్ద గజసాహిణి. ఈ సాహిణి శబ్దం సాని అయింది. దొరసానిలో సాని, స్వామిని శబ్దభవం.

కోటపాడు, కేసినేనిపల్లె ఈ రెండు గ్రామాలను అగ్రహారాలు గావించి శక సంవత్సరం 1466లో ఆరెవీటి బుక్కరాజుగారి ప్రపౌత్రుడు చినతమ్మయ, ఆ గ్రామాల విద్మన్మహాజనాలకు సర్వమాన్యంగా దానం గావించాడు. ఈ కోయిలకుంట్ల శాసనాల్లో కోవిలకుంట్లగా పేర్కొనబడింది. కోవిల, కోవెల శబ్ద సంబంధి.

**కైకరం :**

పశ్చిమగోదావరి జిల్లా గ్రామం. కృష్ణాజిల్లాలో కైకలూరు ఉంది. రెండూ కైక శబ్దం నుంచి వచ్చినవే. కైకాల ఇంటిపేరుగా కూడా ఉంది. కైక అనేది చేనేత వృత్తిగా గలవారిలో ఒక తెగ. అలాంటివారి కిచ్చినది కావటాన కైకరం (కైకవరం) అయింది. వారున్న నివాసం కైకలూరు అయింది. చేనేత వృత్తి అవలంబించినవారు అనేకులున్నారు. సాలీలు, పట్టుసాలీలు, పద్మశాలీయులు, జాండ్రలు, దేవాంగులు, సేనాపతులు, తొగటలు, కర్ణశాలీయులు, కురినిసెట్లు, పత్తిబలిజలు మొదలయినవి కొన్ని తెగలు. జాండ్ర తెగ వారున్నచోటు జాండ్రపేట. ఇది ప్రకాశం జిల్లాలో ఉంది. తమిళనాడులోని 'సేలం' అని పిలువబడుతున్నది నిజానికి 'సాలెం'. చేనేత వృత్తిగా గలవారున్నారు. అధికంగా ఉండడం వల్లనే ఆ పేరు వచ్చింది. చల్లపల్లి

---

[1] No. 132, S. I. I; Vol. xvi

సమీపంలోని సాలెం పాలెం కూడా ఇలాంటిదే. తమిళంలో కైక్కాక్ అంటే చేతితోపని చేసేవారు.¹ ఫలితార్థం చేతివృత్తులవారు. కై శబ్దానికి తెలుగులో కూడ చేయి (hand) అనే అర్థముంది— కై దండ, కై మోడ్పు, కైజారు శబ్దాలకు పోల్చిచూడండి.

**కొక్కిరేని :**

నందిగామ తాలూకా గ్రామం. దివి తాలూకాలో కొక్కిలిగడ్డ అనే గ్రామముంది. కొక్కరేణి అనేది ఒక రకం మొక్క. ఉత్తరేణితో పోల్చి చూడండి. రేణిగుంట, రేణిమాకులపల్లె, రేణింగవరం అనే గ్రామాలున్నాయి.

**కొక్కిలిగడ్డ :**

కృష్ణాజిల్లా దివితాలూకా గ్రామం. కొక్కిలి ఒక చెట్టు పేరు. కన్నడ, తుళు భాషల్లో కొక్కెగడ, కొక్కెకాయి అంటారు. తెలుగులో తగరపు మొక్క ఉంది. బహుశా ఇది ఆ జాతికి చెందిన మొక్క కావచ్చు కన్నడంలో కొక్కె శబ్దం సువాసనగల పూలుపూచే ఒక పొద మొక్క (Tabernaemonotana Coionaria Br.) తగరపు వలస అనే గ్రామం కూడా ఉంది. గడ్డ శబ్దం అవనిగడ్డ దగ్గర వివరించడం జరిగింది.

**కొడిగెనహళ్ళి :**

ఇది హిందూపురం తాలూకా గ్రామం. హళ్ళి కన్నడ పదం. తెలుగులో 'పల్లి'. 'కొడగె' శబ్దాని కర్థం- బహుమతి, దానం. 'న' కారం కన్నడ ప్రభావం వలన వచ్చింది. తెలుగున కొడిగెపల్లి. అయితే దీనిని దిన్నెమీది కొడిగేపల్లి అంటారు. కారణం మడకశిర తాలూకాలో మరొక కొడిగేపల్లి ఉంది. దిన్నెమీద ఉండడంవల్ల ఇలా వివక్ష చేయబడింది. పెనుగొండ దుర్గానికి చెందిన గుయ్యలూరు నాటికి చెందినదిగాను, దానికి మరోపేరు పాలవెంకటాపురమని శాసనంలో పేర్కొనబడింది. పాలవేంకటేశ్వరాలయమచ్చట వుంది. కస్తూరినాయని కుమారుడు, ఓబళరాయ కోనేటిరాయుడు, నాటి పాలకుడు పెదవెంకటపతిరాయల అనుమతితో ఈ దేవాలయాన్ని జీర్ణోద్ధరణ గావించినట్లు శాసనం చెపుతోంది.

**కొణకంచి :**

కృష్ణా జిల్లాలోని గ్రామం. దీని పూర్వనామం కొండ కంచి. కాలక్రమంలో కొణకంచి అయింది. ఈ మేరకు శాసనాధారముంది.

శాసనం : జత్తర్క ఖేందు గణితే శ్రీ కొండకంచి శ్రీ కణ్ణాయ (శ. 1068) [1]
ఇక్కడున్న శ్రీకంఠస్వామికి దానంగా ఇచ్చిన పొలానికి కొంగొండ వెలుగడుంగుంట సరిహద్దులుగా చెప్పబడ్డాయి.

చేను చుట్టూ కంచె వేయడం అంటే చేనుకు రక్షణగా వేసేదని మనకుతెలుసు. కాని ఈ కంచి ఆ కంచె కాదు. కంచి అనేది మెట్ట నేలల్లో మొలిచే ఒక రకం కలుపు మొక్క. (**Apuluda aristata, Linn**). నిజానికి ఏదో ఒక రకం మొక్కలను కంచెగా వేయడం కూడా కలదు. మొదట ఈ కంచి అనే మొక్కలను అలా చేని రక్షణకు పాతే అలవాటు వుండివుండవచ్చు. అనంతరం దేనిని అలా పాతినా దానిని కంచె అనడం జరిగి వుండవచ్చు. కంచిక చెర్లలోని కంచి, తమిళనాడులోని కాంచీ పురంలోని కంచి, అనంతపురం జిల్లాలోని కంచి సముద్రంలోని కంచి కూడా ఇలాంటిదే. ముష్టి చెట్టును (**Strychnos nux-vomica Linn**) తమిళంలో కంజిరై, కంజిరమ్ అండారు.

**కొండకర్ల ఆవ :**

విశాఖపట్నం జిల్లా గ్రామం. కొండ పర్వతార్థంలో తెలిసిందే. పర్వతార్థం అని ప్రత్యేకంగా చెప్పడానికి కారణం. కొండ అంటే ఒకరకం కలుపుమొక్క కూడా. మానికొండ, పోటకొండలలోని కొండ అలాంటిది. కొండలం అనే పేరుతో గల కలుపుమొక్క రైతులకు సుపరిచితం.

ఇక కర్ల, కర శబ్దానికి బహువచనం. కర అంటే ఒడ్డు, హద్దు. ఆవ అంటే సంవత్సరం పొడవునా నీరు నిల్వవుండే జలాశయం. గుంటూరు జిల్లా మంగళగిరికి సమీపాన గల నవులూరి ఆవ (ప్రస్తుత నవులూరు అని మాత్రమే) కృష్ణాజిల్లాలోని క్రంకటావ కూడ ఇలాంటివే.

**కొండపల్లి :**

కృష్ణాజిల్లాలోని ఈ గ్రామం బొమ్మలకు ప్రసిద్ధి చెందిన విషయం తెలిసిందే. ఇక్కడ లభించే 'పొణుకు' (**Gyrocufus asiaticey**) కర్రబొమ్మలు తయారు చేయడానికి అనువుగా ఉంటుంది. ఈ మొక్క పేరుతో వచ్చినవే కృష్ణా గుంటూరు జిల్లాల్లోని పొనుకుమాడు (పొనుకుపాడు) గ్రామాలు. ఇక ఈ కొండపల్లి కోటను కట్టించినవాడు అన వేమారెడ్డి. 1361 నాటి అమరావతి శాసనంలో, ఇతడు కొండవీడు పాలకుడుగా చెప్పబడింది. ఇది కూడా అనంతరం గజపతులు, రాయలు,

---

[1] No. 118 S. I. I. Vol. x

గోల్కొండ నవాబులు, ఇంగ్లీషువారి పాలనలోనికి ఒదిగింది. ఇబ్రహీం కుతుబ్‌షా ఈ కోటను బాగా వృద్ధిపరిచాడు. క్రింది కోటలను, చుట్టూ గోడను కట్టించాడు. ఖాజీమహమ్మద్ గవాన్ హత్య చేయబడిందిక్కడే. అదొక పెద్దగాథ. రెండవ మహమ్మద్ దీనికి కారకుడు. గవాన్ మరణ సమయంలో ఈ రాజ్యం అంతరించి పోతుందని శపించాడు. ఇది జరిగింది. 24 మార్చి 1482న. ఆ తరువాత కొద్ది కాలానికే ఈ రాజ్యం అంతరించింది.

అబ్దుల్ కుతుబ్‌షా (1654-1669) కొండపల్లి కోటలో 'బాలాహిస్సార్' అనే పేరుతో బర్మా టేకు నుపయోగించి గొప్ప హాల్ నిర్మించాడు. ఆ హాలులో సింహాసనాన్ని కూడా ప్రతిష్ఠించారు. కానీ దుశ్శకునాల కారణంగా ఎన్నడూ దానిపై ఆసీనుడు కాలేదు. ఈ కొండపల్లికి మరొక పేరు ముస్తఫానగర్. తన్మూలకంగా కృష్ణాజిల్లాకు ముస్తఫానగర్ సర్కార్ అని వ్యవహరింపబడింది. ఈ ముస్తఫాఖాన్ కూడా మహమ్మద్ కులీకుతుబ్‌షా వద్ద మరొక సైన్యాధికారి. ఇతని పేరుమీదుగా వచ్చిన మరో గ్రామం, విజయవాడకు సమీపంలోని ముస్తాబాదు. చరిత్ర కాలాల్లో, కొండపల్లి అత్యంత సంపద్వంతమైన నగరంగా చెప్పబడింది. 17:6లో ఓరందొర ఈ కోటను గూర్చి వ్రాస్తూ ప్రస్తుతం ఈ కోట అరణ్యంతో నిండిపోయింది. పులులకు ఆవాసమైంది. నాజూకైన కలప కొరకు కోట ధ్వంసం గావించబడిందని వ్రాశాడు. కొండపల్లి కోట గోడలపై ఎక్కిచూస్తే కొండవీడు కొండల శిఖరాలు కన్పిస్తాయి.

**కొండవీడు :**

రెడ్డి సామ్రాజ్యానికి రాజధాని. అయితే కొండవీడు పేరుతో నేడొక చిన్న గ్రామముంది. కాని రాజధాని నగరం పైన కొండలలో ఉంది. కొండ తెలిసిందే. వీడు శబ్దానికి నివాసము, శిబిరము, దండు విడిచినచోటు మొదలైన అర్థాలు కనిపిస్తాయి. రెడ్డి ప్రభువుల మొదటి రాజధాని అద్దంకి అని తెలుస్తోంది. దొంతి అళియరెడ్డి రాజ్యస్థాపకుడు. ప్రోలయవేముడు కొండవీడులో రాజ్యాన్ని స్థాపించాడు. ఇతని సోదరుడు అనవేమారెడ్డి, కొండపల్లి కోటను కట్టించాడు. ఈతని పాలనా కాలము 1340-1370 మధ్య. రెడ్డి ప్రభువుల తర్వాత విజయనగరం రాయ వంశస్థుల పాలనలోను, ఆ పిదప గజపతుల స్వాధీనంలోనికి వచ్చింది. ఆ తరువాత ఫ్రెంచి, ఇంగ్లీషు, నైజాం వారి పాలనలో ఉంది. రెడ్ల పాలనాకాలంలో దీనికే గోపీనాథపురమనే పేరు కూడా చెల్లివచ్చింది. గజపతుల కాలంలో దుర్గాప్రసాద కొండవీడుగా వ్యవహరింపబడినట్లు శాసనం చెపుతుంది. గోపీనాథ పట్నమనే మరో

పేరు కూడా ఉన్నట్లు పూర్వం చెప్పబడింది. గోల్కొండ సుల్తాను పాలనా కాలంలో కొండవీడు పేరును వారి సైన్యాధికారుల్లో ఒకరైన ముర్తజాఖాన్ పేరు మీదుగా ముర్తుజానగర్‌గా వ్యవహరింపబడింది.

ఇంగ్లీషువారు. గుంటూరుజిల్లాను ఏర్పరిచే పర్యంతం, గుంటూరు సీమను ముర్తుజానగర్ సర్కారుగానే వ్యవహరింపబడింది. ఈ ముర్తుజాఖాన్ మహమ్మద్ కులీకుతుబ్‌షా వద్ద సైన్యాధికారి, ఈశాన్యం నుండి నైరుతి మూలగా సుమారు 9½ మైళ్ళ పొడవు ఈ కొండల శ్రేణి వ్యాపించి ఉంది. సముద్ర మట్టానికి 170 అడుగుల ఎత్తు. ఈ కొండలను పెక్కు శాసనాలలో, హద్దుగా పేర్కొన్నారు. ఈ కొండల శ్రేణికి పడమట గల భూభాగాన్ని గిరి పశ్చిమ వెలనాడు, కొండ పడమట వెలనాడుగా వ్యవహరింపబడింది.

రెడ్డి రాజ్య స్థాపనకు పూర్వమే, ఇది మానవ నివాసంగా కన్పిస్తుంది. అచ్చటచ్చట జైన చిహ్నాలు కన్పిస్తాయి. ఒరిస్సాను పాలించిన విశ్వంభర గజపతి 12 వ శతాబ్దంలో, పూర్వార్థంతో ఇక్కడ కోటను కట్టించినట్లు తెలుస్తుంది. క్రీ.శ. 1144 అక్టోబర్‌లో, క్రీ.శ. 1064 భాద్రపద అమావాస్య సూర్యగ్రహణం నాడు విశ్వంభర దేవుని పెద్ద కుమారుడు గణపతిదేవుడు, నియోగి బ్రాహ్మణులకు 14 గ్రామాలు ఇచ్చట దానం చేసినట్లు తెలుస్తోంది. 1328 ప్రాంతాల్లో దొంతి ఆళియ రెడ్డి పాలన ప్రారంభమైంది. తరువాత అతని పెద్ద కుమారుడు ప్రోలయ వేమారెడ్డి కోటను కట్టించాడు. ఈతని సోదరుడు అనివేమారెడ్డికి. ఇచ్చట పెద్ద నిధి దొరికిందని ఐతిహ్యం.

**కొర్రపాడు :**

కడప జిల్లా ప్రొద్దుటూరు తాలూకా గ్రామం.

శాసనం . ప్రొద్దుటూరు తాలూకా, కడప జిల్లా.
క్రీ.శ. 1526 శ్రీకృష్ణ దేవరాయల కాలం.
"గండికోట సీమకు చెలే కొఱపాటి చెంనకేశవ దేవర్కు."

'పాడు' ఇంతకుముందు వివరింపబడింది. 'కొర్ర' ఒక రకం ధాన్యం. The Dtalian millet; panicum italicum. Linn. Setariaitalica, Beauv. కొర్రపాటి ఇంటిపేరుగా గలవారు కృష్ణాజిల్లా దివితాలూకా కప్తాను పాలెం గ్రామంలో ఉన్నారు. ఇతర చోట్ల కూడా వుండవచ్చును.

**కొసినేపల్లి :**

కడపజిల్లా జమ్మలమడుగు తాలూకాగ్రామం. చెన్నూరి సీమకు చెందిన ఈ కొసినేపల్లికి, హరిహర రాయపురమనే మరో పేరున్నట్లు శాసనం చెపుతోంది. శాసనంలో దీని పేరు కొసనెపల్లె.

శాసనం : జమ్మలమడుగు తాలూకా, కడపజిల్లా.

క్రీ.శ. 1554 సం॥ సదాశివరాయల కాలం.

"శ్రీ మద్రాజాధిరాజ రాజ పరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ సదాసివదేవ మహారాయులు విద్యా నగరముందు వజ్రసింహాసనా రూఢుండై పృథ్వీ సామాజ్య్రం సేయంగాను చెన్నూరి సీమకు చెల్లే కొసనపల్లెకు ప్రతినామమైన హరిహర రాయ పురం సర్వ మాన్య అగ్రహారం....కొసనేపల్లె మహాజనాలు...."

'కొసన' ఇంటి పేరుగా కన్పిస్తోంది. అలాగే కొసరాజు. ఇది కొసనాయని పల్లెగా వచ్చును. 'కొస' చివర అగ్రము అనే అర్థాల్లో కన్పిస్తుంది.

అయితే వ్యక్తి నామ పరంగా ఈ అర్థం చాలిరాదు. బహుశా ఇది సంస్కృత కోశ శబ్ద సంబంధి కావచ్చును. కోశము అంటే ధనాగారము. ఏదైనా నిలువ వుంచే చోటు. సంస్కృతంలోని కోశాధ్యక్షుండు అనే అర్థంలో కోశనాయక శబ్దముంది, వ్యవహారంలో ఇది కొసరాజుగా పరిణమించి యుండవచ్చు. అప్పుడు గ్రామనామం. శాసన సంబంధియైన కొసనపల్లితో సమసించి కొసనాయని పల్లె అవుతుంది. బొప్పనాయుడు బొప్పన అవుతుంది.

**కోడేరు :**

పశ్చిమగోదావరి జిల్లాలో భీమవరం తాలూకాలో పాలకోడేరు, విస్సాకోడేరు, నరసాపురం తాలూకాలో కోడేరు అనే గ్రామాలున్నాయి. ఇంకా ఈ పేరుతో గ్రామాలుండవచ్చు. కోడు, ఏరు- కోడేరు. కోడు అన్నా ఏరు అన్నా ప్రవాహమే. విస్సాకోడేరు, విస్సా అనే ఇంటిపేరు గలవారి వల్ల వచ్చింది. ఈ విస్సా, హిస్సా శబ్దంనుండి ఏర్పడి యుండవచ్చు. దేని అర్థం హిస్సా వాని నేటిపాడు వద్ద చూడ వచ్చును. పాలకోడేరు సమీపంలోని పాలకొల్లు గాని, లేక పాల చెట్లు ఉండడం గాని వచ్చి ఉంటుంది. అయితే పాలకొల్లు దేవాలయానికి నరసాపురం తాలూకా లోని కోడేరు గ్రామంలోని ఆగ్నేయ దిక్కున గల మిరుతమ్మరి భూమిని దానం చేసినట్లు శాసనం చెపుతోంది. ఆ శాసనంలో ఈ కోడేరును కుర్తికోడేరుగా పేర్కొనడం జరిగింది.

---

1 No : 195 S. I. I. Vol. xvi

కుఱ్రు అనేది పూర్వం వివరించబడింది. ఇది శాసనంలో మిరుత తల్లెపూడి సానుల వద్ద నుండి క్రయము పొంది దానమీయబడినదిగా పేర్కొనబడింది. తల్లెపూడి పేరుతో ప్రస్తుతం గ్రామం కనిపించదు. అయితే తిల్లపూడి గ్రామముంది. ఈ తిల్లపూడినే శాసనంలో తల్లెపూడిగా పేర్కొని ఉండవచ్చు. అనేది ఒక చెట్టుపేరు. Excoecaria agallocha తెలుగులో గుడ్డి కాయ అంటారు. తమిళనాడులోని చిదంబరానికి 'తిల్ల' అని మరొక పేరు. చిదం తాలూకాలోని తిల్లనాయకాపురం, తిల్లపడంగు అనే గ్రామాలున్నాయి కృష్ణాజిల్లాలో కృష్ణానది ప్రవాహ భాగంలో గుడ్డికాయలంక అనే గ్రామముంది.

**కోతుల గోకవరం :**

పశ్చిమ గోదావరిజిల్లా ఏలూరు తాలూకా గ్రామం. ఈ తాలూకాలో మ గోకవరం వుండడం కారణంగా దీనిని కోతుల గోకవరం అనవలసి వచ్చి ఆ గోకవరాన్ని అక్కుపల్లె గోకవరం అంటారు. తాళ్ళ గోకవరం అనే గ్రా కూడా ఈ తాలూకాలో ఉంది. చరిత్రలో గొంకరాజు పేరుతో చాలామంది లున్నారు. ఆ 'గొంక' శబ్దమే ఇప్పట గోక అయింది. ఈ శబ్దాని కర్థం బల శక్తి అని అర్థాలు. గోకినేపల్లి కూడా ఇలాంటిదే. గోకినాయనిపల్లె గోకినేని అయింది.

శాసనం : నాదెండ్ల · గుంటూరు తాలూకా, గుంటూరు జిల్లా

"నరనుత కీర్తి వరోవానరనామ గ్రామపతిరసౌ సవినయ ధీస్మితకీర్త్యా రుచినాశ్వేత ద్వీవదదీం జగత్సకురుతే"

"శ్రీ వేంగీ వసుధాంగనా తిలకమై శిష్టమాదేవ బృందావాసం వానరంబుపతి యుద్యత్కీర్తి.. ." [1]

శాసనాల్లో ఈ కోతుల గోకవరం సంస్కృతీకరింపబడి వానరన గోకవరంగా చెప్పబడింది. కోతులపాడు అనే నిర్జన గ్రామం ఎల్లవరం డివిజన్ వుంది. కోతిచెట్టు అనే పేరుతో ఒక ఊరు విశాఖపట్నం జిల్లాలో వుంది. దీనిని కోతి ఒక చెట్టు గావచ్చుననిపిస్తోంది. వరం పూర్వం వివరింపబడింది.

**కోనసముద్రం :**

కర్నూలు జిల్లా శిరువెళ్ళ తాలూకా గ్రామం. ఈ గ్రామానికి శ్రీమన్నారాయ సముద్రమనే పేరున్నట్లు శాసనంలో పేర్కొనబడింది. ఇది ఆలమూరు గ్రామా ఈశాన్యాన వున్నట్లుగా చెప్పబడింది.

[1] No. 675, S. I. I; Vol. iv

శాసనం : చిన్న అహోబిలం : సిరివెళ్ళ తాలూకా, కర్నూలు జిల్లా
"క్రీ. శ. 1554 సం॥ సదాశివరాయల కాలం
శ్రీ అహోబలేస్వరుల తిరువళియాడాసకు చెల్లే ఆలమూరి గ్రామం పొలం
లోను యీశాంన్య భాగాన్ను కోనసముద్రానకు ప్రతినామమైన
శ్రీమం నారాయణ సముద్రం చెరువు కట్టించినందుకు . " [1]

కోన, కోణ శబ్ద సంబంధి. మరికొన్ని వివరాలు క్రింది గ్రామనామంలో చూడవచ్చును. ఇక సముద్రం తెలిసిందే. అయితే, ఇక్కడ నిజమైన సముద్రార్థంలో కాదు. పెద్ద జలాశయమని మాత్రమే. రాయలసీమలో పెద్ద పెద్ద జలాశయాలను సముద్రాలనడం కద్దు.

**కోనేటినాయనిపాలెం :**

ఇది అనంతపురం జిల్లా ధర్మవరం తాలూకాలో వుంది. కోనేటినాయడు అనే వ్యక్తి పేరుమీదుగా ఏర్పడిన జనావాసం. ఇందలి 'పాలెం' దాని అసలు అర్థంలోగాక, ఆ వ్యక్తి ముందుగా ఆచోట ఆవాస మేర్పరచుకున్నాడు గనుక ఏర్పడింది. ఇక కోనేటినాయడు విషయం చూద్దాం. ఇది ఆ వ్యక్తి పేరు. అదలా వుండగా కోనేరు ఇంటిపేరుగా వస్తుంది. ప్రసిద్ధ క్షేత్రాలలో గల పుష్కరిణులను కోనేరులని వ్యవహరించడం కద్దు. కాని కోనేరు పుష్కరిణి కాదు. పుష్కరిణి ఏ జలాశయానికైనా, అంటే నదికి కూడా వర్తిస్తుంది. సముద్రాలకు వర్తించదు. నదులకు పుష్కరాలు వస్తాయనే సంగతి తెలిసిందే. కోన యందలి ఏరు మాత్రమే కోనేరు. కొండ, కోనలనే వ్యవహారం తెలుసుగదా ! రెండు కొండలమధ్య గల పల్లంలోయ. అంటే లోయలోగుండా ఈ వైపునుండి ఆ వైపుకు వెళ్ళవచ్చు. కాని కోన అలాకాక, ఒకవైపు కొండలమధ్య ఎడంవుంది, అవతలవైపు ఆ కొండలు రెండూ కలసి ఉంటే, ఈమధ్య గల పల్లం కోన. అచ్చటనుండి ప్రారంభమైన ఏరు అంటే ప్రవాహం కోనేరు. ఇంతకూ కోన, కోణ శబ్దంనుండి వచ్చింది. కొండ లేకపోయినా, భూభాగం అలాంటి ఆకృతిలో వుంది గనుక, అది కోనసీమ అం గోదావరి జిల్లాలోని కోనసీమ కథ ఇది. గుంటూరు జిల్లాలో పల్లెకోన అనే ముంది. తిరుపతి వెంకన్నకు కోనేటిరాయడనే వ్యవహారముంది.

ఇక నాయడు, నాయకుడు అనే శబ్దంనుండి వచ్చింది. నాయడు సరియైన పద్ధతి. నాయుడు అనడం పొరబాటు. తెలుగునాట అది ఒక కు

[1] No. 199, S. I. I; Vol. XVI

గావడం వింత. ఈ నాయకుడు నాయడై నాయనిగా మారి నేనిగా వ్యవహారంలో సిద్ధమైంది. వీరమాచనేని, సూరపనేని, పిన్నమనేని మొదలైనే ఇంటిపేర్లు ఇలా ఏర్పడ్డవే. ఆ ఇంటిపేర్లు, వారి వారి మూలపురుషులను తెలుపుతాయి. వీరమాచా నాయకుడు, సూరపనాయకుడు. పిన్నామనాయకుడు అనేవిధంగా కృష్ణాజిల్లాలో వీరమాచనేనివారి పాలెం ఉంది. ప్రస్తుతం దానిని వీరమాచారి పాలెంగా వ్యవహరిస్తున్నారు. అలాగే గుంటూరు జిల్లాలో కోమటినేనివారి పాలెముంది. మరొకమాట రాయుడు అనడం తప్పు. రాయడు అనడం ఒప్పు. రాజశబ్దం రాచ, 'రాయ'గా పరిణమించింది. తెలుగువారి పేర్లలోని 'రావు' అలా ఏర్పడిందే.

**కోలలపూడి :**

ఇది నరసరావుపేట తాలూకా గ్రామం. దీని పూర్వనామం కోనలపూండి. ఈ గ్రామంలో కుమార గోపీనాథుని ఆలయముంది. ఇదే తాలూకాలో కోనంకి అనే గ్రామం కూడా ఉంది. ఈ రెంటిలోను గల కోన ఇంతకు పూర్వం చెప్పిన 'కోన' వంటిది కాదు. ఇది ఒక విధమైన గడ్డి.

**కోలవెన్ను :**

ఇది కృష్ణాజిల్లా గ్రామం. ఇంకా ఇలాంటి గ్రామాలు కృతివెను (కర్తవెన్ను) చాలివెన్ను, తాడివెన్ను, వేలవెన్ను. పిప్పలి తీగను కోల అంటారు. ఎన్న వెన్న అయి వెన్నుగా స్థిరపడింది. ఆవులెన్న అనే గ్రామముంది. విన్న లేక వెన్న శబ్దాలకు తెలుగులో అర్థాలు కనిపించవు. అయితే తమిళంలో వెణ్ణిలకు అంటే బంజరు, ఇసుకనేల అని అర్థం.

**క్విలన్ :**

కేరళ రాష్ట్రంలో ఇదొక ఊరు. కేరళలో తప్ప, ఏ రాష్ట్రంలోని రైలు స్టేషనులోనైనా క్విలన్‌కు టికెట్టు ఇమ్మంటే ఇస్తారు. కాని కేరళ రాష్ట్రంలో మరో చోటినుండి క్విలన్‌కు టికెట్టు అడిగితే, ఇచ్చే అతనికి అదెక్కడుందో తెలియక, మిమ్మల్నే అదెక్కడుందని అడుగుతాడు. కేరళలోని వారికి క్విలన్ ఎక్కడుందో తెలియక పోవడమేమిటని ఆశ్చర్యపోవడం ఈసారి మీ వంతు అవుతుంది. క్విలన్‌కు ఇంకెలా చెప్పాలో మీకు తెలియదు. అంతా గందరగోళం. ఇంతకీ దాని పేరు 'కోయిలాన్' ఆంగ్లంలో అంటే రోమను లిపిలో 'Quilon' అని వ్రాయడం వలన ఈ స్థితి ఏర్పడింది. ఇంతకంటే విచిత్రమైనది ఉదకమండలం ముందు చెప్పడం జరిగింది.

గంగూరు :

విజయవాడ సమీపగ్రామం. ఇది వ్యక్తినామం మీదుగా వచ్చినపేరు. దీని అసలు పేరు లంజలంక. లంజ అంటే ప్రవాహము. అంతే తప్ప సాధారణార్థం లోని లంజకాదు. లంజ శబ్దానికి అర్థం వక్రగమనము గలది. అలాటి ప్రవర్తన గల స్త్రీని లంజగా సంభావించడం జరిగింది.

గంజాం :

ఆ పేరు గల జిల్లాకు కేంద్రస్థానం కాగా చిన్న గంజాం, పెద్ద గంజాం పేరుతో నేటి ప్రకాశం జిల్లాలో రెండు గ్రామాలున్నాయి. అదే పేర్లతో శక 1192 నాటికే ఆ రెండు గ్రామాలున్నట్లు శాసనస్థ సాక్ష్యముంది. గంజ్ అనే హిందీ పదం నుండి వచ్చినదిగా భావించబడుచుంది. దీనికి మూలం పర్షియన్. ఆ భాషలో దీనికి ధాన్యాగారం, కోశాగారం అని అర్థాలు. కాగా గంజి ఒక రకం పాకుడు మొక్క Indigofera linitotıa Retg. ఈ పేరుతో మరొక నారమొక్క కుడలిది. (Oannabis India) గంజి ఇంటిపేరుగా కూడా కనిపిస్తుంది. ఆహారపదార్థం మాత్రం కాదు. గంజికుంట అనే గ్రామం అనంతపురం జిల్లా, గుత్తి తాలూకాలో వుంది. పెద్ద గంజాంలోని అధిష్ఠాన దైవం పిన్నేశ్వరుడు. శక 1192 ప్రమోద శ్రావణశుద్ధ ఏకాదశి గురువారంనాడు పిన్నెశెట్టి అనే వ్యక్తి పేరు మీదుగా అం కొడుకు ప్రతిష్ఠ చేసాడు. చిన్న గంజాంకు గంధపురి అనే సంస్కృత నామముంది. ఇక్కడ బౌద్ధ శిల్పాలు, పాళీ భాషలో శాసనాలున్నాయి. పెద్ద గంజాంకు సమీపంలో ఫిరంగి దిబ్బ అనే జనావాసిముంది. ముందు ఫిరంగిపురం వివరింపబడు తుంది. ఇది కూడా అలాంటిదే. ఫిరంగులతో సంబంధం లేదు. ఫరంగుల దిబ్బ (ఆవాసస్థలం) యూరోపియన్లును ఫరంగులుగా సంభావించడం జరిగింది. 1240 నాటికి ఇక్కడ పోర్చుగీసు వారు తిష్ఠ వేశారు.

గట్టిరాజుపెంట :

కర్నూరుజిల్లా నందికొట్కూరు తాలూకా గ్రామం. శ్రీశైలానికి చెం శాసనాల్లో ఈ గ్రామం ప్రస్తావించబడింది. సిద్ధాపురం సీమలోనిదిగా, ఈ ఊ పేర్కొనబడింది. ఈ తాలూకాలోని సిద్దేపల్లి, సిద్దేశ్వరం అనే రెండు గ్రా: లున్నాయి. సిద్ధాపురం, ఈ రెండు గ్రామాల్లో ఏదో తెలియదు. శక సంవత్స

1450లో అవసరం చంద్రశేఖరయ్యవారు, బసవమఠం రాచూటి వీరణ ఒడయలకు ఈ గ్రామాన్ని అగ్రహారం చేసినట్లు శాసనంలో పేర్కొనబడింది. ఈ ఊరికి తూర్పున పాలకొల్లు, దక్షిణాన మాదినాయని పల్లె కనుమ, పడమర రుదమూరు, ఉత్తరాన తూంగాడు గ్రామాలు సరిహద్దులుగా చెప్పబడ్డాయి. 'పెంట' పశువులను మందవేసే స్థలం అని ముందు చెప్పబడింది. గట్టిరాజు అనే వ్యక్తి పేరుతో ఏర్పడిన గ్రామం ఇది. ఇంకా ఈ తాలూకాలో ఎన్నెద్దుల పెంట, గుడిసెల పెంట, మల్లిరాయని పెంట, సందరం పెంట, వేంపెంట అనేవి 'పెంట' అనుబంధంతో కన్పిస్తాయి.

## గడిగరేలు :

కర్నూలుజిల్లా గ్రామం. విజయనగరాన్ని పాలించిన మొదటి బుక్కరాయలు ఈ గ్రామాన్ని, గ్రామంలో గల భైరవస్వామి దేవాలయానికి దానంగా ఇచ్చాడు. అప్పట్లో దానిని గడిగరేలు అనే బుక్కరాయపురంగా వ్యవహరించారు. రేల ఒక మొక్క. గడిగరేలు, రేల యందలి జాతిభేదం కావచ్చును.

## గణపవరం :

ఇది పశ్చిమగోదావరి జిల్లా భీమవరం తాలూకాలోనిదీ గ్రామం. గణపతి పేరుతో చాళుక్య, కాకతీయ, కోట, మరి ఇతర వంశాల్లో రాజులున్నారు. కాలంలోని వ్యత్యాసాన్ని బట్టి, స్థానిక సాక్ష్యాన్ని బట్టి ఆ గ్రామం ఎవరి పేరుమీదుగా వచ్చిందో నిర్ణయించాలి. ఇది చాళుక్య వంశంలోని గణపతిని బట్టి వచ్చి యుందాలి. ఇక్కడ స్వర్ణేశ్వర దేవాలయముంది. శక సంవత్సరం 1073 ఉత్తరాయన పుణ్యకాలము నాడు, ఈ దేవునికి మండలేశ్వరుడు కొలని కాటమనాయకును అఖండదీపాన్ని, 50 ఇనుప ఎడ్లు (గేదెలను) దానం ఇచ్చినట్లు, అప్పటికి ఆ గ్రామం పద్మినీపురంగాను శాసనం చెపుతుంది. అంటే అప్పటికి ఇంకా గణపవరమనే పేరు ఈ గ్రామానికి రాలేదు. అనంతర కాలంలో ఈ ప్రాంతాన్ని పాలించిన తూర్పు చాళుక్య వంశస్థుడు గణపతి పేర ఈ గ్రామం ప్రసిద్ధిలోనికి వచ్చి యుండాలి.

## గణపవరం :

ఇది బాపట్ల తాలూకాలో వుంది. దీని పూర్వనామం తేమద్ధ. నాయనిపల్లిలో గల శాసనంలో చైత్రపురమనే గ్రామంలో కాకతి గణపతిదేవుడు, తన పేర కుమార గణపేశ్వర మహాదేవర ప్రతిష్ఠ చేసినట్లు గలదు. అనంతరం ఈ గణపవరాన్ని ఆత్రేయ గోత్రుడైన పులుకర్రి నారాయణ భట్టరాజ పేయాజులకు దానంగా

ఇవ్వబడింది. ఆ పిదప ఈ నారాయణభట్టు ఈ గ్రామాన్ని చెరకూరి అగస్త్యేశ్వర శ్రీమహాదేవరకు ధర్మంగా ఇచ్చాడు. అందు ఈ గ్రామం పేరు 'తేమద్త' నామ గణపాపురమని పేర్కొనబడింది. మరి పైన పేర్కొన్న చైత్రపురము, ఈ తేమద్త ఒకటవునో, కాదో తెలియకున్నది. అయితే తెమిడిపాడు అనే పేరుతో ఒక ఊరు కలదు. తెమిడెద ఒకరకం మొక్క.

## గణపేశ్వరం :

కృష్ణాజిల్లా దివి తాలూకా గ్రామం. గణప+ఈశ్వర శబ్దాల కలయిక గణపేశ్వరం. ఈశ్వర శబ్దం గ్రామనామపరంగా దేవాలయాలున్న చోట్ల ముఖ్యంగా ఈశ్వరాలయాలున్న చోట్ల వర్తిస్తుంది.

ఉదా : రామేశ్వరం, సంగమేశ్వరం, ఉమామహేశ్వరం

విఘ్నేశ్వరుడు గణనాయకుడు కనుక గణపతి తెలుగువారి వ్యక్తి నామాల్లో కనిపిస్తుంది. వ్యవహారంలో గణయ్యగా కూడా విన్పిస్తుంది. ఇక ఈ గ్రామనామం కాకతి గణపతిదేవుని పేరుమీదుగా ఏర్పడింది. గణపతిదేవుని గజసాహిణి, నృత్త రత్నావళి కర్త అయిన 'జాయపసేనాని' గణపతిదేవుని పేర ఆలయాన్ని వెలయించాడు. ఈతడు అయ్యవంశస్థుడు. ఈ గణపేశ్వరానికి పెదదీవిపురమనే పేరున్నట్లు శాసనాల్లో చెప్పబడింది.

శాసనం : గణపేశ్వరం : దివి తాలుకా, కృష్ణా జిల్లా

"శ్రీమద్గణపేశ్వర మహాదేవ లింగ్గంబ్బును...." [1]

"దివి గణంపతీశ్వర శ్రీమహాదేవరకు ..." [2]

"వెలనాంటి లోపలి వినుతింపంగారు పేరు గలిగి క్రిష్ణాబ్ధి సంగమము నందు పొలుపైన పెదదీవి పురమున గణపతీశ్వర దేవునకు...." [4]

వేణీ సాగర సంగ్గమో గణపత్యాఖ్యకం లింగం చోడరాజప్రతిష్టం. ." [3]

---

[1] No. 949, S. I. I. Vol. x

[2] No. 950, S. I. I. Vol. x

[4] No. 953, S. I. I. Vol. x

[3] No. 951, S. I. I. Vol. x

**గండికోట :**

దీనిని ఘండికోట అనడం కూడా వుంది. శాసనాల్లో దీని పేరు ఖండికోటగా చెప్పఁబడింది. ఖండి, ఖండశబ్దం కావచ్చు.

శాసనం : నందలూరు : రాజంపేట తాలూకా; కడప జిల్లా

క్రీ.శ. 1501 ఇమ్మడి నరసింహరాయల కాలం.

"తొండ్డమండ్డన స్తాపనాచార్య ఆది వంశావతార వాళపందిలి గోత్రోద్భ వుండై ఘండికోట రాజధానింగాను శిరివాళసిద్ధ వట్టం సకలిహొత్తపి నాంటి రాజ్యాలు ఎలుచుంన్న సర్వన్నపనాయని దేవినేనింగారి కుమారుడు పర్వతనాయనింగారు.. "[1]

గన్నవరం :

ఈ పేరుతో కృష్ణా, గుంటూరు, గోదావరి జిల్లాల్లో గ్రామాలు ఉన్నాయి. కృష్ణా జిల్లాలోని దానిని దొంగల గన్నవరం అని కూడా వ్యవహరించేవారు. పూర్వం అక్కడ దొంగలు దోచుకుంటుండేవారు. అందువల్ల దానికా వ్యవహార మేర్పడింది. గోదావరి జిల్లాలోని దానిని డెల్టా గన్నవరం అంటారు. కారణం అది డెల్టా ప్రాంతంలో వుండడమే. మరొకటి నగర గన్నవరం. వేరొకటి లంకల గన్నవరం.

'వరం' అంటే ఏమిటో ఇంతకుపూర్వం చెప్పడం జరిగింది. కాని గన్నవరం లోని 'వరం' అలాంటిది కూడా కాదు. నిజానికిది గన్నవరం కాదు. గనివారం. వారం అంటే భూమి. ఏదైనా చెరువునుంచి తీయబడిన కాలువను 'గనిమ' అంటారు. దాని క్రింద సాగుఅయ్యే భూమి గనుక అది గనివారం. మేల్వారం, అడివారం అనేవి భూమిశిస్తుకు సంబంధించిన లెక్కల్లో కనిపిస్తాయి. కృష్ణాజిల్లాలోని గనివారం దానికి పైనగల పురుషోత్తమపట్నం చెరువునిండిన తరువాత క్రింద నరసింహపురం చెరువుకు చేరి దానినుండి తీయబడిన కాలువతో సాగుచేయడం వలన ఏర్పడింది. ప్రస్తుతం ఈ నరసింహపురంలేదు. మరొక నరసింహపురం సమీపంలో ఉంది. బుద్ధవరంలోని 'వరం' మాత్రం వరమే. బౌద్ధుల ప్రమేయంలో ఏర్పడింది కావచ్చు. లేదా బుద్ధ అనే వ్యక్తి పేరుమీద ఏర్పడి వుండవచ్చు. సమీపంలోని అజ్జంపూడి బుడమేరు ప్రవాహ ప్రభావం వలన ఏర్పడింది. గన్నవరం కథ ఇది. గన్నవరాలు

[1] No. 40, S. I. I; Vol. xvi

ఎక్కడున్నా ఇదే స్థితి వుంటుంది. అడవివరం కూడా ఇలాంటిదేనని ముందు చెప్పడం జరిగింది.

**గంపలగూడెం :**

కృష్ణాజిల్లా తిరువూరు తాలూకా గ్రామం. పనిముట్టుగా గంప తెలుసు. వడ్ల గంప, కోళ్ళగంప అనే వాడుక తెలిసిందే. అయితే సాధనమైన గంపతో, ఈ గ్రామ నామానికి సంబంధంలేదు. గంపల అనేది గంపపై బహువచనంకాదు. శబ్దమే గంపల, విస్తళ, కంచల అనే గ్రామాలున్నాయి. వీటిలోని అల, చీరాల, పెండ్యాల లోని ఆల ఒకటే. ఇది ప్రాకే గడ్డికి సంకేతం. ఆల శబ్దమే అల్లమయింది. అల్లు (కొను) అనే క్రియకు ఇదే మూలం, దానిపై ఏర్పడిన పదం అల్లుడు.

ఇక గంపలలోని గంపశబ్దం ఒక రకం మొక్క కావచ్చును. గంప అనే పేరుతో, గొలుగొండ ఏజెన్సీలో ఒక గ్రామం ఉంది. గొంప అనే వూరు వీరవల్లి తాలూకాలో వుంది. ఈ గంప, గప్ప కావడానికి అవకాశముంది. అడిగొప్పుల పూర్వనామం అడిగప్పల. ఇందలి గప్ప ఇదే కావచ్చును. అడిగప్పల, గప్పంలోని భేదం కావచ్చును. తరిగొప్పుల అనే గ్రామం ఉంది.

గూడెం నిమ్నజాతుల వారుండే ఆవాసమని ప్రస్తుత ఉపయోగం. కాని నిజానికి అడవిలోని పల్లెను గూడెం అనాలి. గూడెం పేరుతో గల గ్రామాలన్నీ అటవీప్రాంతంలో వుండటం విశేషం.

**గొరాలమడుగు :**

ఇది కడపజిల్లా రాజంపేట తాలూకా గ్రామం. మడుగు అంటే నీటిపట్టు అని అర్థం. గౌరవ శబ్దం తెలుగులో గారాబముగా మారి బహువచనం చేరి గారాలగా పరిణమిస్తుంది. గారాలకూచి శబ్దం తెలుసు గదా! కాగా ఈ గ్రామనామం లోని గారాలశబ్దం గారాలు శబ్దానికి సంబంధించినదికాదు. ఇది గార శబ్దంపై బహు వచనం. గార ఒక చెట్టు. నల్లరేగడి నేలల్లో ఎత్తుగా పెరిగే మొక్క దీని పూలు వాసనగా వుంటాయి. గార్లదిన్నె, గార్లపెంట, గార్ల, గార్లపాడు అనే ఊళ్ళు ఆయా జిల్లాల్లో కన్పిస్తాయి.

**గాలిభీమవరం :**

విశాఖపట్నం జిల్లా అనకాపల్లి తాలూకా గ్రామం. దీనిని ఇలా పిలవడానికి కారణం ఈ తాలూకాలో మరో భీమవరం వుంది. దానిని గురుగు భీమవరం అంటారు. రెండూ మొక్కల పేర్లే. గురుగుబల్లి అనే గ్రామం కూడా ఉంది.

ఈదగాలి, గాలేరు, గాలికొండ,లలోని గాలి ఒక రకం చెట్టు. సేతు భీమవరం అనే గ్రామం చీపురుపల్లె తాలూకాలో వుంది.

**గుడిపాడు :**

ఈ పేరుతో చాలా గ్రామాలున్నాయి. వివిధ జిల్లాల్లో. గుడి అంటే దేవాలయమని తెలుగులో ప్రసిద్ధార్థం. గ్రామం చావడిని గుడి అనవచ్చును. తమిళంలో ఇల్లు, నివాసస్థలం. వంశం అనే అర్థాలున్నాయి. కొడుగు భాషలో, ఒకే గుడిలో నివసించే సేవక కుటుంబం అనే అర్థం వుంది. కనుక దేవాలయం అనే అర్థాల్లోకాక, ఇతర అర్థాల్లో దీన్ని భావించవచ్చు.

ఇక గుడి పేరుతో వున్న గ్రామాలు. గుంటూరు జిల్లాలో సంత గుడిపాడు, గుడిపాడు, శంకరలింగం గుడిపాడు, ఎర్ర గుడిపాడు, పిడతల గుడిపాడు, తొర్ర గుడిపాడు, చెర్ల గుడిపాడు, మిట్ట గుడిపాడు మొదలైనవి కలవు. ఇంకా ఇతర జిల్లాల్లో కూడా వుంటాయి. లచ్చన గుడిపూడి వ్యక్తినామం మీదుగా వచ్చింది. పిడతల శబ్దం వృక్ష సంబంధి. నెల్లూరు జిల్లాలో రెండు పోలూరులున్నాయి. అందొకటి పిడతాపోలూరు. వాడుకునే పాత్ర సంబంధమైన పిడతకేమీ సంబంధం లేదు. పిడత అనేది ఒక రకం మొక్క. శాసనాల్లో చేతన గుడిపూడి అనే గ్రామం కూడా కన్పిస్తోంది. ప్రస్తుతం ఈ గుడిపూడి ఏదో తెలియదు.

**గుణదల :**

ఇది కృష్ణాజిల్లాలోని గ్రామం. దీని పూర్వనామం గుణందల. ఇది వృక్ష నామం. ఉల్లిందల, ఇల్లిందలతో పోల్చి చూడండి.

**గుండ్లకమ్మ :**

ఇది ఒకనది పేరు. గుంటూరు-గిద్దలూరు రైల్వేమార్గంలో ఒక రైల్వేస్టేషను. సమీపంలోని గుండ్లకమ్మ నదివలన ఏర్పడింది. కమ్మ శబ్దం నదీపరంగా ఇంతకు పూర్వం వివరింపబడింది. గుండ్ల గుండ్లములనుండి ఉత్పన్నమైంది. ఇలాంటిదే కృష్ణాజిల్లాలోని గుండేరు. ఇక గుండ్లకమ్మ నల్లమలఅడవులలో గుండ్ల బ్రహ్మేశ్వరం అనేచోట పుట్టి జంపలేరు, ఎనుమలేరు, అనే రెండు వాగులను కలుపుకొని మైదాన ప్రాంతంలో ప్రవేశించి, కంబాన్ని చుట్టి, మార్కాపురం, ముమ్మడివరం మీదుగా ప్రవహించి ఒంగోలుకు 12 మైళ్ళ దూరంలో గల పెదదేవరంపాడు వద్ద సముద్రములో కలుస్తోంది. పూర్వం గుండయపాలెం, నక్కావారిపాలెం వద్ద సముద్రంలో కలిసేది. ఆ చోటును ఇప్పటికీ పాత గుండ్లకమ్మ అంటారు. 1505 ప్రాంతంలో

వచ్చిన ఉప్పెన, భూకంపాల వలన గుండ్లకమ్మ నది తన గతిని మార్చుకున్నట్లు, కైఫీయత్తుల వల్ల తెలుస్తోంది. సంవత్సరం పొడువునా ఈ నదిలో నీరు ప్రవాహి స్తుంది. దీని తిరాన వచ్చిన మరో గ్రామం గుండ్లపల్లె పేరుతో సంభావింపబడు తోంది.

గుంపిని :

ఇది తూర్పుగోదావరి జిల్లాలో వుండేది. ప్రస్తుతం ఈ పేరుతో లేదు. దీనికి అల్లాడరెడ్డి దొడ్డవరమనే పేరు కూడా వుండేది. రాజమండ్రి నేలిన వీరభద్రా రెడ్డి తండ్రి అల్లాడరెడ్డి కాటయవేముని పీర్యకుడు (వియ్యంకుడు). కాగా గుంపిని శబ్దానికి అర్థం సమంగా బోధపడటంలేదు. అయితే కన్నడంలో గొబ్బిళి, గొబ్బులి అంటే ఒక రకం ముండ్ల మొక్క. తెలుగున గొబ్బిమొక్క వుంది. Asteracantha longiforia Nees.

గురజాల :

పల్నాడులోని గ్రామం. దీనినే గురజాల అని కూడా అంటారు. ఈ గురజాలకు మాధవీ పట్టణమనే పేరున్నట్లు శాసనధారముంది.

శాసనం : ....తేన శ్రీ దారనామ్నాద్విజవరపతినా మాధవీ పట్టణే శ్రీ నాగస్తంభ ప్రతిష్ఠా కృతి విధివిహితా సన్నిధౌ తత్రయస్య.

....ప్రాదా దిద్దయశోధనః కృతచతుఃఖారి ప్రమాణం భవం చాతుర్వర్ణ శరిత్ర జన్మ నిలః శ్రీ మాధవీ పట్టణే. [1]

గురజ అంటే ఒక మొక్క. కన్నడంలో గొరిజె Digua arvensis Forsk (2). గొరిజెమర అనే దానిని (Flacourtia eatafracta Roxb.) సాగు చేస్తారు. గురుజ పేరుతో తెలుగున కూడ వుంది.

గుర్రప్పడియ :

కందుకూరు తాలూకా గ్రామం. శాసనంలో గుర్రపుం బిడియగా పేర్కొన బడింది. బిడియం, సిగ్గు, లజ్జ, సంకోచము అని అర్థాల్లో తెలుసు. ఇక్కడ వాటికి నిమిత్తము లేదు. బిడియ అంటే ఆధిక్యము అనే అర్థం కన్నడంలో కన్పిస్తుంది. అయినపుడు ఇందలి గుర్రం అశ్వార్థంలోగాక (గుర్రాల, పిడగుర్రాల, గుర్రంకొండ) మొక్క అనే అర్థంలో గ్రహించాలి. ఇదే తాలూకాలో గుర్రప్పడియ దుర్భాకుల వారి కండ్రిగ అనే ఈనాము గ్రామముంది.

[1] No. 27, S. I. I; Vol. x

గుఱ్రాలబయలు :

తూర్పుగోదావరి జిల్లా గ్రామం. పట్లబయలు అనే గ్రామం నెల్లూరుజిల్లాలో వుంది. బయలు అంటే విశాలమైన భూభాగం. గుఱ్ఱం జంతు సంబంధిగా అందరికీ తెలిసిందే. ఇంటిపేరుగా కూడా కన్పిస్తుంది. గుఱ్రము+లు అనే బహ్వర్థక శబ్దం వ్యవహారంలో గుఱ్రాలుగా మారుతుంది. కాని ఇది గుఱ్రము, ఆల ఒకరకం గడ్డి. కన్నడంలో గుర్వె పేరుతో ఒక మొక్క ఉంది. పిడుగురాళ్ళ (గుంటూరు జిల్లా) తెలిసిందే. దీనిని పిడగు, రాళ్ళగా సంభావించడం కద్దు. కాని నిజానికిది పిడగురాల ఈ మేరకు ఆధారాలున్నాయి. పిడపర్తిలోని పిడ, పై పిడగురాల లోనిది ఒకటే. ఇది కూడ గడ్డిజాతికి చెందినదే. పిడతాపోలూరు లోని పిడత కూడా ఇదే. మట్టిపిడత (పాత్ర సంబంధమైనవి) కు ఏమీ సంబంధంలేదు. నిజానికది పిడతలపోలూరు. పిడతల ఇంటిపేరు కూడ కన్పిస్తుందని ముందు చెప్పడం జరిగింది. ఇక పట్లబయలు లోని పట్ల, వడ్లపట్ల, ముదిపట్లలోని పట్ల ఒకటే. 'పట్టు' తమిళనాడుసందు కూడా కన్పిస్తుంది. చిత్తూరుజిల్లాలో ఆకనాంబట్టు అనే గ్రామముంది. 'పట్టు' శబ్దానికర్థం నివాసస్థలమని. స్పష్టమైన అర్థం కాని ఆయా, వృక్షజాతులచేత (స్థానికంగా) ఆవరింపబడిన భూభాగంగా గ్రహించాలి.

గూడూరు :

నెల్లూరుజిల్లాలో ఈ పేరుతో గల తాలూకాకు ఇదియే కేంద్రస్థానం. ఊరు పూర్వం వివరించడం జరిగింది. గూడు, ఊరు గూడూరు. పక్షిగూడుతో పోల్చి చూసినపుడు ఆవాసమునకు ఆకరమైనదిగా బోధపడుతుంది. అయితే గూడు లేక గూడె అనేది ఒక చెట్టు కూడా. గూడ ఒకరకం మొక్క. పోల్చి చూడు గూడవల్లి. జొన్న మొదలైన వాటికి గూడు వేయడం తెలిసిందే. అక్కడ వర్తులాకారం అనే అర్థాన్నిస్తుంది. ఈ పేరుతో ఆంధ్రదేశంలో చాలా గ్రామాలున్నాయి. అదీగాక చర్చ లోని గూడూరే తూర్పు పడమర అని రెండు భాగాలు. కందుకూరు తాలూకాలో దావగూడూరు అనే గ్రామముంది. కావలి తాలూకాలో ఒక్కేపల్లి గూడూరు, అదే తాలూకాలో బలపన గూడూరు, కడప, కృష్ణాజిల్లా బందరు తాలూకాలో చిట్టిగూడూరు, గూడూరు, పినగూడూరులంక అనే గ్రామాలున్నాయి. బెజవాడ తాలూకాలో గూడూరుపాడు అనే గ్రామముంది. కడపజిల్లా ప్రొద్దుటూరు తాలూకాలో కానగూడూరు, గాదెగూడూరు, జమ్మలమడుగు తాలూకాలో గూడూరు, అనంతపురం జిల్లాలో కండ్లగూడూరు, శనగల గూడూరు, అనంతపురం చీమలగూడూరు అనే గ్రామాలున్నాయి. ఇంకా వుండవచ్చును.

గొడవఱ్రు :

ఈ పేరుతో కృష్ణా గుంటూరు జిల్లాలలో కృష్ణానదికి అటు ఇటూ వున్నాయి. అల్లరి, మిక్కిలి ఎక్కువైన శబ్దార్థంలోని గొడవఱ్రుల కలయిక. ఉచ్చారణలో 'ప' స్థానంలో 'వ' చేరింది. గొడ అనేది ఒకరకం మొక్క. గొండెలలం అంటే తెలియ వచ్చు. కన్నడంలో గొడ్డ, గొడ్డహాణిసెమర అనే మొక్కలున్నాయి.

అసలు గ్రామం నదీపాతకంకాగా, కృష్ణకు అటూ, ఇటూ జనులు వలస వెళ్ళడం వలన ఈ రెండుగ్రామాలు ఏర్పడ్డాయి.

గొడుగురాయి :

తూర్పుగోదావరిజిల్లా డివిజన్ గ్రామం. ఇది ఛత్రశబ్దార్థంలో కాదు. దీని పూర్వరూపం గొడుగు. ఈ శబ్దాని కర్థం కన్నము, డొల్ల అలాంటి స్వభావం గల రాయి లేదా గొడుగుచింత అనే గ్రామంతో పోల్చి చూసినపుడు ఇది ఒకరకం మొక్కగా భావిస్తుంది. ఆ మొక్కలు గల కొండ అనే అర్థంతో వచ్చి యుండ వచ్చును.

గొబ్బిళ్ళమడుగు :

తూర్పు గోదావరి జిల్లా గ్రామం. సంక్రాంతి పండుగ దినాల్లో పాడుకునే గొబ్బిపాటలు తెలిసినవే. ఇందలి గొబ్బి, గొబ్బెమ్మ, పదసంబంధి. కాగా గ్రామ నామంలోని గొబ్బి, ఒక రకం ముళ్ళ మొక్క. పొలాలగట్లపై కనిపిస్తుంది. అయితే ముళ్ళ గోరింట వేరు. పుష్యమాసంలో పూలు పూస్తుంది. ఇంతకుపూర్వం గుంపిని గ్రామనామం వద్ద ఈ గొబ్బి ప్రస్తావన చేయబడింది.

గొరిజవోలు :

నరసరావుపేట తాలూకా గ్రామం. ముందు గురజాలను గూర్చి వ్రాసినపుడు దీనిని పేర్కొనడం జరిగింది. అక్కడే గొరిజ ఒక మొక్కగా చెప్పబడింది. కాగా ఈ గ్రామానికి శ్రీరంగపురమనే పేరున్నట్లు శాసనం చెపుతోంది.

శాసనం : గొరిజవోలు : నర్సరావుపేట తాలూకా; గుంటూరు జిల్లా

క్రీ.శ. 1546 సంవత్సరము

"శ్రీరామానుజా

యనమః స్వస్తిశ్రీ జయాభ్యు

దయశాలివాహన శకవర్షంబు

లు 1468 అగునేంటి పరాభవ సంవత్సర

శ్రావణ బ 12 గు శ్రీమద్రాజాధిరాజ రాజపర
మేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ వీర సదాశివదేవమహా
రాయలు విజయనగరమంద్దు రత్న సింహాసనా
సీనుండై పృద్వీ సామ్రాజ్యము సేయుచును భారద్వా
జగోత్ర ఆశ్వలాయన సూత్ర ఋక్ శాఖాధ్యాయులై
న శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనా చార్యులైన తాళ్ళపాక తి
రుమలయ్యంగారి కుమారుండు తిరువెంగళనాథ
య్యంగారికి దంద్డము సమర్పించ్చి యిచ్చిన ధర్మశా
సనక్రమ మెట్లన్నను కొంద్డవీటి సీమలోని గొరం
జవ్రోలి గ్రామము మీకు స్వామి పుష్కరిణీ
తీరమంద్దు తిరువెంగ్గళనాథుని సన్నిధిని స
హిరణ్యోదక దానధారా పూర్వకముగాను
సర్వమాన్య అగ్రహారముగాను ధారవోశి
త్రివాచకముగాను యిస్తిమిగాన ...
గలిగిన అష్టభోగతేజస్వామ్యాలున్ను దాన
...విక్రయ యోగ్యంగాను
ఆచంద్రార్క స్థాయిగాను అనుభవింపగ
లవారమని యిచ్చిన అగ్రహారము దానపా
లనయోర్మద్యే దానాచ్ఛ్రేయోనుపాలనం
దానాత్స్వర్గమవాప్నోతి పాలనాదచ్యుతం
పదం శ్రీ శ్రీ శ్రీ.... [1]

చిన్నఅహోబిలం : సిరివెళ్ళ తాలూకా: కర్నూలు జిల్లా
క్రీ.శ. 1552 సంవత్సరము సదాశివరాయల కాలం.
"దూపాటి సీమలోని గొరిజెపల్లె గ్రామం.... [2]

కొండవీడు : నర్సరావుపేట తాలూకా; గుంటూరు జిల్లా
క్రీ.శ. 1577 సంవత్సరము శ్రీరంగరాయలకాలం
"కొండవీటి రాజ్యములోని గొరిజవోలి గ్రామ ప్రతినామధేయమైన
శ్రీ రంగ్గరాయపురమునకూ సర్వమాన్యపు అగ్రహారముగానూ పాలించ్చి
ఇయ్యనవదరింస్తిమి . ." [3]

[1] No. 154, S. I. I; Vol. xvi

[2] No. 181, S. I. I; Vol. xvi

[3] No. 290, S. I I; Vol. xvi

శక 1499లో విజయనగరాన్ని పాలించిన శ్రీ వీర శ్రీరంగరాయ దేవః మహారాయల పేరుమీదుగా ఈ గ్రామాన్ని ఇలా పిలిచారు. కొండవీటి సీమలోని ఈ గ్రామానికి 8 దిక్కులా సంక్రాంతిపాడు, సొలస, జంగాలపల్లె, చందవరం, పొలుకుంబాడు, మోదుగ పూండి, నుదురుబాడు గ్రామాలున్నట్లు చెప్పబడింది. ప్రోలు, ప్రోలుశబ్ద సంబంధి.

## గొలుగొండ :

పూర్వపు విశాఖపట్నం జిల్లాలో ఈ పేరుగల తాలూకాకు కేంద్రస్థానం. కొండ పర్వత సూచి. గొలుసు అనేది ఒక రకం మొక్క careya arborea, Roxb; Glycosmis penla phylla. గొంజి మొక్క అంటే తెలియవచ్చును. అయితే కంజీవరం (కంచి) లోని కంజి మొక్క వేరు. సంస్కృతంలో దీనికి అశ్వశాఖాట అని సంభావిస్తారు. కొండ గొలుగు, నాగగొలుగు అనేది ఇందలి భేదాలు. దీని పండ్లు తింటారు. పాముకాటుకు దీని చెక్క వైద్యంగా ఉపయోగిస్తారు. హైదరాబాదులోని గోల్కొండను గొల్లకొండగా చెపుతారు. కాని మొక్క సంబంధియే.

## గోగులమూడి :

ఇది గుంటూరు జిల్లా గ్రామం. గోగులపూడి గోగులమూడి అయింది. ఇందలి గోగు మనం శాకంగా ఉపయోగిస్తున్న గోంగూరకాదు. ఇందలి గోగు ఎర్రని నేలల్లో మొలిచే కలుపుమొక్క. (Chrysopogon montanus Trin) ఇందులో చాలా రకాలున్నాయి. పూడి పూర్వం వివరించబడింది.

## గోళ్ళమూడి :

గుంటూరు జిల్లా గ్రామం గోళ్ళ, పూడి, గోళ్ళమూడి. మనగోరు (నఖము)కు దీనికి సంబంధములేదు. ఇది గోళ్ళ గొండి అనే కలుపుమొక్క Cyanotis axillanis. Ros, Tradiseatia axillanis, Rıxb. తీగగా పాకుతుంది. నీలిరంగు పూలు పూస్తుంది. దీని గింజలను ఆహారంగా అవసరాన్ని బట్టి వాడతారు.

## గోవిందపురం :

ఇది నరసరావు పేట తాలూకా గ్రామం. దీని పూర్వనామం క్రోవి. క్రోవి అనేది ప్రాకే మొక్క. లింగ దొండ Bryonia laciniosa, Linn. అంటే తెలియ

వచ్చును. అనంతరకాలంలో ఎప్పుడో ఇది గోవిందపురంగా మారింది. వ్యక్తి నామ సూచి.

### గ్రియంపేట :

చిత్తూరు జిల్లాలో చిత్తూరుకు దక్షిణంగా ఒక మైలు దూరంలోగల జనావాసం. ఇంగ్లీషువారి పాలనాకాలంలో, కలెక్టరుగా పనిచేసిన గ్రియం (Graeme) అనే దొర పేరు మీదుగా ఏర్పడింది. వ్యవహారంలో గిరింపేట. దీనికే నావిపేట అనే మరో పేరుకూడా వుంది. నవీ అంటే ఉర్దూలో వ్రాయస కాడు, గుమాస్తా, లెక్కలు వ్రాసే వాడు అని అర్థం.

### ఘంటశాల :

కృష్ణాజిల్లా దివితాలూకా గ్రామం. వెనుకటి నాళ్ళలో ప్రసిద్ధ బౌద్ధ క్షేత్రం. దీని పూర్వ నామం టంకశాల (నాణములు ముద్రించే చోటు) యని, కాలక్రమంలో ఘంటశాలగా మారిందని ఒక కథనం. అయితే భాషాశాస్త్ర మర్యాద దీని నంగీక రింపదు. అయితే దీనికే కొంట కొశ్శిల అనే వ్యవహారం కూడా వుంది. ఇది కంటకు శైలకు మారు రూపం. ఇది ఘంటశాలకు మూలరూపం కావచ్చును. ఈ గ్రామన్ని చేరి వున్న కొంత ప్రదేశానికి ఘోటకమైన పేరు ఇప్పటికి వ్యవహారంలో వుంది. శాసనాల్లో చోడ పాండ్యపురంగా కూడా ప్రస్తావింపబడింది.

శాసనం : "భూవిదిత శక మహీ శబ్దావలి ముని వారి నిధి వియచ్చంద్రమిత శ్రీ విభ్రాజిల్లంగ విస్వావసు సంవత్సరమున జన వినుతముగాను, కర మొప్పు ఘంటశాలపుర కామిని గామినీ విభూషణము...." [1]

"ఘంటశాల కామక తమయయ్య పోతినాయకునకు...." [2]

" . . అతి భక్తిం బార్వతీ హితునకు ఘంటశాల జలధీశ్వర దేవర కాది మూర్తి.. " [3]

" ... తనకు ధర్మువుగా ఘంటశాలయయ్న చోడపాండ్యపురమున...." [4]

[1] No. 84, S. I. I; Vol. xvi

[2] No. 84, S. I. I; Vol. x

[3] No. 114, S. I. I; Vol. iv

[4] No. 115, S. I. I. Vol. iv

"స్వస్తి సక వర్షంబులు 1079 నేంటి కార్తిక బహుల పంచాదశియు గురువారమున ఘంటశాలయైన చోడపాండ్యపురమున శ్రీ మదువిశ్వేశ్వర..." [5]

"స్వస్తి శ్రీ రాజరాజ సంవత్సరములు 14 గ్రాహి శక వర్షములు 1081 నేట్టి దక్షిణాయన సంక్రాన్తి నిమిత్తమున ఘంటశాలయైయ్న చోడ పాండు పురమున శ్రీ జలధీశ్వర మహాదేవరకు..." [6]

ఇక్కడ ప్రసిద్ధమైన జలదీశ్వరాలయముంది. జలధి అంటే సముద్రం. పూర్వం సముద్రం ఇక్కడవరకూ వుండేదని తెలుస్తోపది. కనుకనే జలధీశ్వ రాలయం నిర్మింపబడింది. గుండేరు అనే పేరుతో ఒక ప్రవాహం దీనినంటి ప్రవహిస్తుంది. మరొకటి భీమనది లేక భీమేరు పేరుతో సమీపంలోనే ప్రవహిస్తోంది. ఈ రెండు కూడా ఒకప్పటి కృష్ణానది ప్రవాహ భాగాలు. కృష్ణానది ఒకప్పుడు నేటి బందరు దగ్గర సముద్రంలో కలిసేది. పిదప దక్షిణానికి మళ్ళింది.

సమీపంలోని దేవరకోట అనే గ్రామం ఉంది. చల్లపల్లి జమీందాలకు దేవర కోట జమీందారులనే వ్యవహారం. సమీపంలో నాయుడుపేట, ఈ జమీందారుల ప్రధమావాసంగా తెలుస్తోంది.

**చనుబండ :**

కృష్ణాజిల్లా గ్రామం. బండపర్వత సంబంధి. చను లో 'చ' దంత్యోచ్చారణ గలది. వృక్షసంబంధి. చనుపాల విత్తుల చెట్టు అంటే తెలియవచ్చు. కొడిశపాల తెలిసిందే. రెంటికీ ఆయుర్వేద వైద్యంలో మంచి ప్రసక్తి వుంది. దీని విత్తులు నల్లగా, ఉలవలను పోలివుంటాయి. పూర్వం జమీందారీ గ్రామం. జుపల్లి జమీందారు లచే సుమారు రెండు వందల సంవత్సరాలప్పుడు నిర్మింపబడింది.

**చల్లపల్లి :**

కృష్ణాజిల్లా గ్రామం. ఇంకా చల్ల గరిగలు, చల్ల చింతలపూడి అనే గ్రామాలు కూడా ఉన్నాయి. చల్ల అనేది ఒక చెట్టు. గరిగ కూడా ఒక మొక్క. చల్లగరిగలు మరొకరకం మొక్క. చల్ల చింతలపూడి, సమీపంలో మరొక చింతలపూడి వుండడం వలన, వివక్షకొరకు ఇది చల్ల చెట్లున్న లేక చల్లా ఇంటిపేరు గలవారున్న అనే

5 No. 140, S. I. I; Vol. iv

6 No. 145, S. I. I; Vol. iv

అర్థంలో ఇది చల్ల చింతపూడి అయింది. మరొక చింతలపూడి వన్నె చింతలపూ రెండూ పశ్చిమ గోదావరి జిల్లా గ్రామాలు.

**చికాకులవలస :**

శ్రీకాకుళం జిల్లా గ్రామం. చిక్కాలవారి వలస కావచ్చు. అంటే చిక్కాల వారు ప్రథమంగా వలసవచ్చి నివాసమేర్పరచుకున్న ఆవాసం. చిక్కాల అనే గ్రామ లున్నాయి. పశ్చిమ గోదావరి జిల్లాలోని శివదేవుని చిక్కాల అలాంటిదే. ఇక్కడ శివదేవుడు అనే వ్యక్తి పేరుమీద ఏర్పడింది. చిక్క భీమదేవుడు అనే చారిత్రక వ్యక్తి వున్నాడు. అందలి చిక్క శబ్దం వేరు. ఇక్కడి చిక్క శబ్దం వేరు. చిక్కుడు కూరగాయగా తెలిసిందే. చిక్కుముడిలోని చిక్కు, వాడు చిక్కుల్లో పడ్డాడు. ఇలాంటి వాటిలోని చిక్కు తెలుసు గదా. దానిమీద 'డు' చేరి చిక్కుడు అయింది. అంటే చిక్కగా పాకుతుంది గనుక, అల్లుడు కూడా అలాంటిదే. అల్లువాడు అంటే బంధుత్వాన్ని అల్లువాడు అంటే బంధుత్వం వ్యాప్తంగా కావడానికి కారణమవు తున్నాడు గనుక అల్లుడు. వెనుక అ౦ అంటే ప్రాకే మొక్క అని చెప్పుకున్నాం. అల అల్ల అయింది. అల్లిము కూడా అలాంటిదే. అంటే అల్లుకునేదనే అర్థం.

ఇంతకూ చిక్కాలలోని, చిక్కు లేక చిక్క శబ్దం, చిక్కుడు సంబంధి కూడా కాదు. అలాంటి స్వభావం అంటే చిక్కగా ప్రాకే ఒక మొక్క. గ్రామ నామాల్లో పదాంతంలో 'అల' కనపిస్తే, చాలవరకు వాటిని మొక్కలుగా భావించ వచ్చు. అయితే, ఈ చిక్కుడు (Dolichos 1blab,Linn) కేవలం ఆకెరువుగా మాత్రమే పనికొస్తుంది. చిక్కుళ్ళ అగ్రహారం తూర్పుగోదావరి జిలాలో వుంది.

**చిగురులంక :**

పశ్చిమ గోదావరి జిల్లా నిడదవోలు తాలూకా గ్రామం. చిగురు, లేతఆకు. అప్పుడే పుట్టిన ఆకుగా తెలుసు. పంటి చిగురు అనడం కూడా తెలిసిందే. గ్రామ నామపరంగా గల చిగురుకు. పై చిగురుకు ఏమీ సంబంధం లేదు. ఇది ఒక రకం గడ్డి మొక్క. చిగిరింత అంటే తెలుస్తుంది. చికిలింత (Setaria Verticillata Beauv.) అని కూడా అంటారు. చికిలింత చిగురు. చిన్నదాని సొగసు అనే పాట వినే వుంటారు. 'అచట పుట్టిన చిగురు కొమ్మైన చేవ' అని మనుచరిత్ర పెద్దన. ఇక్కడి అర్థం చిగురు చెట్టుకొమ్మ అనే భావించాలి తప్ప, లేతకొమ్మ అని కాదు. కాగా చిగురు ఒక మొక్క కూడా. ఈ పేరుతో చిగురుకోట, చిగురుపాడు అనే గ్రామాలున్నాయి. ఒక విధమైన మట్టిని చిగురు మట్టి అని కూడా అంటారు. ఇల్లు అలకడానికి చిగురు మట్టిని ఉపయోగిస్తారు. చిగరమాకుల పల్లె, చిగురు

వాడ దక్షిణపు ఖండ్రిక, చిగురువాడ ఉత్తరపు ఖండ్రిక అనే గ్రామాలు చంద్రగిరి తాలూకాలో వున్నాయి. చింతపల్లె చిత్తూరు తాలూకాలో గలదు. వెంకటగిరి తాలూకాలో మరో చిగురుపాడు కలదు.

లంక నదీమధ్యంలో, సముద్రమధ్యంలో ఉండే భూభాగం. నదీతీరాన వెంట వున్న భూమిని, కాలువ అంచును కూడ లంకతో సంభావిస్తారు.

**చింతకొమ్మదిన్నె :**

ఈ పేరుతో కర్నూలుజిల్లా శిరువెళ్ళ తాలూకాలో ఒకటి, కడపజిల్లా బద్వేలు తాలూకాలో మరొకటి వున్నాయి. దిన్నె అంటే ఎత్తైన భూమి. చింతకొమ్మ అంటే చింతచెట్టు కొమ్మ అసి కాదు. చింత అనేది, సామాన్యంగా తెలిసిన చింత (తింత్రిణి) మాత్రమేకాదు. ఆ పేరుతో చాలా మొక్కలున్నాయి. అలాంటి వాటిలో ఇదొకటి. ఇలాంటివే గొడుగుచింత, పులిచింత, మూగచింత. ఇది పొదలాంటి మొక్క. నిజానికి కొమ్మ అంటే కూడా ఒకరకం మొక్క. మర్రికొమ్మదిన్నె అనే గ్రామం కదిరి తాలూకాలో వుంది.

**చిత్రచేడు :**

ఇది గుత్తి తాలూకా గ్రామం. ఇందలి 'చిత్ర' సంస్కృత సంబంధి కాదు. చిత్రక అనేది కన్నడంలో (Plumbaga Zeylancia Linn.) ఒకరకం మొక్క. 'చేడు' అంటే నల్లనేల, ఉప్పుబయలు సందర్భాన్నిబట్టి అర్థం చేసుకోవాలి. ఇలాంటిదే కారంచేడు. ఇక చిత్రశబ్దంతో పిఠాపురం తాలూకాలో చిత్రాడ, ఎల్లవరం డివిజన్‌లో చిత్రకాయలంక (నిర్జన గ్రామం), గుడివాడ తాలూకాలో చిత్రం అనే గ్రామాలు కలవు.

శాసనం : గుత్తి తాలూకా; అనంతపురం జిల్లా
క్రీ.శ. 1554 సదాశివరాయల కాలం
" ...కొమార కొండ్రాజయవారి నాయంక్రానను పాలించి ఇచిన చిత్రచేడి గ్రామానను. . " [1]

**చినవాల్తేరు :**

పేరును బట్టి వాల్తేరు పేరులో గల గ్రామాలలో ఇది చిన్నదని బోధపడు తోంది. నిజమే పెదవాల్తేరు పేరుతో దీనికి సమీపంలో మరో గ్రామముంది. ఈ

[1] No. 197, S. I. I; Vol. xvi

రెండూ విశాఖపట్నం సమీపాన గల సముద్రతీర గ్రామాలు. నిజానికి పెదవాల్తేరుతో వ్యవహరింపబడుతున్నదే అసలైన వాల్తేరు అది; చర్చలోని దానికంటే పరిమాణంలో పెద్దది కావడాన చినవాల్తేరు అయింది. వాల్తేరును గూర్చిన చర్చ, ఆ ఆరోపం కింద చేయబడింది. ఇక చినవాల్తేరుగా వ్యవహరింపబడుతున్న జనావాసం అసలు పేరు గుంటు బోయిన పాలెం. గ్రామ రికార్డులు అలాగే చెపుతున్నాయి. అయితే రెవిన్యూ గ్రామం కాదు. నేడు పెదవాల్తేరుగా వ్యవహరింపబడుతున్న అసలు వాల్తేరుకు శివారు గ్రామం. అందువల్లనే అసలు పేరు వెనుకబడి, పెదవాల్తేరు పోలికతో ఇది చినవాల్తేరు అయింది. 'పాలెం' అనే దాని అసలు అర్థం వేరుఅయినా, కాలక్రమంలో శివారు గ్రామాలకు సంకేతంగా నిలిచిందని చెప్పబడింది. ఇక గుంటుబోయనపాలెం అంటే అర్థమేమిటో చూద్దాం.

గుంటు బోయడు అనేవాడు ప్రథమంగా ఆవాసమేర్పరచుకొన్న చోట గుంటుబోయిన అనే ఇంటిపేరు గలవారు మొదట నివాస మేర్పరచుకొన్న ప్రాంతం. ఈ ఇంటిపేరుకు కూడా 'గుంటు బోయడు' అనే వ్యక్తి పేరే మూలం. 'గుండు' వ్యవహారంలో 'గుంటు' అయింది. గుండయ్య, గుండమ్మలాంటి పేర్లు తెలిసినవే. బొద్దుగా, పొట్టిగా వుండే వారిని 'గుండయ్య' అనడం తెలిసిందే. బోయడు అంటే బోయివాడని చెప్పవచ్చు, నిజానికి తెలుగునాట 'బోయ' అనేది ఒకజాతి జనులను సూచిస్తుంది. కడపజిల్లాలో వీరి సంఖ్య అధికం. ఇదికాక, పక్షులను వేటాడి జీవించే వారిని కూడా బోయలంటారు. వెనుకటి తరాల్లో, మనకు పల్లకీలుండేవి. వాటిని మోసేవారిని కూడా బోయలనడం కద్దు. అయితే చర్చలోని 'బోయ' శబ్దంపై వాటిలో దేనికీ సంబంధించినదికాదు. ఇదొక ఉద్యోగం పేరు. దేవాలయపాలనకు సంబంధించినది. భోగ లేక భోజి శబ్ద సంబంధి. వెనుకటి తరాల్లో దేవాలయాలకు మహిషజాతి పశువులను, మేకలను, గొఱ్ఱెలను దానంగా ఇవ్వడం జరిగేది. అలా దానంగా ఇవ్వబడినవి ఎవరి ఆధీనంలో ఉంచబడేవో. ఆ వ్యక్తి బోయడు. దానకర్త అభీష్టం మేరకు, ఆ పశువులను తన ఆధీనంలో వుంచుకొని, దేవాలయానికి నేయిని సరఫరా చేయడం, బోయుని ఉద్యోగధర్మం. ఆ పశుసంతతి వృద్ధి క్షయాలతో నిమిత్తం లేకుండా, ఒప్పందం మేరకు నేయి సరఫరా చేయాలి. ఆ గ్రామంపై వచ్చే ప్రభుత్వ రాబడి (భూమిశిస్తు వగైరాలు)లో కొంతవంతు ఈ బోయనికి ప్రతిఫలంగా ఇవ్వబడేది. ఈ మేరకు శాసనసాక్ష్యాధారాలు చాలా కన్పిస్తాయి. మాదిరి కొకటి.

శాసనము : స్వస్తి శ్రీ మన్మహా మండలేశ్వర పరిచ్ఛేద అల్లాద నాధ దేవరాజులు తమ తండ్రి గొంక్కరాజునకూం, దమ తల్లి కామలదేవంమం గారికి దర్మువుగా శక వర్షంబులు 1205 అగునేంటి స్వభాను సంవత్సర చైత్రశుద్ధ 15 ఆదివారము నాండు శ్రీ కాకొలని శ్రీ వల్లభున్కి అఖండ దీపానకుం బెట్టిన మోదాలు 25 దీని జేకొని ఉప్పల బ్రమ్మన బోయుండు తన పుత్ర పౌవుత్రికము నిత్య మానెండు ఆ చంద్రార్క్కము గాను నడపంగ గలవాండు. [1]

అలా, బోయ ఉద్యోగము నిర్వహించిన వారిలో, ఈ గుంట బోయుడు ఒకరు. అతని తరువాత, అతని సంతతికి, ఆయన పేరు ఇంటిపేరుగా స్థిరపడింది. ఇలా బోయ శబ్దంతో ఇంటిపేర్లు చాలా కన్పిస్తాయి. ఉదా : ఎర్రబోయిన, కోడెబోయిన, తాడిబోయిన, నాగబోయిన మొదలైనవి. ఈ ఇంటిపేర్లు గలవారు, యాదవులలో, కాపులలో, కమ్మవారిలో కన్పిస్తారు. ఇంత ఇతర కులాలలో కూడ వుండే అవకాశం లేకపోలేదు.

ఈ గుండు బోయిన పాలెం అనే పేరు కాలక్రమంలో దాని వునికిని కోల్పోయి, పెదవాల్తేరుకు శివారు కావడం, పరిమాణంలో చిన్నది కావడం కారణంగా, చినవాల్తేరుగా స్థిరపడింది.

## చిన్నపుత్త :

కడప జిల్లా కడప తాలూకా గ్రామం. ఇదే తాలూకాలో పెదపుత్త అనే మరో గ్రామముంది. వివక్ష కొరకు చిన్న, పెద్ద అనే పదాలు చేరాయి. పుత్త శబ్దాని కర్థం పుట్ట. పుట్టగుంట అనే గ్రామం కృష్ణాజిల్లా గుడివాడ తాలూకాలో వుంది. ఇంకా ఇతర చోట్ల కూడా వుండవచ్చు. పుత్త చిన్నాయి పల్లె అనే గ్రామం కూడా కడప తాలూకాలో ఉంది. ఇది ఇంటి పేరుతో గూడిన వ్యక్తి నామం లేక 'పుత్త' గ్రామానికి సమీపంలోని చిన్నాయపల్లె గ్రామముంది. బద్వేలు తాలూకాలో మరో చిన్నాయపల్లె ఉంది. చిన్నాయ, చిన్నయ శబ్ద సంబంధి. కాగా పుట్ట గుంటలోని పుట్ట, చిన్న అనే అర్థం కావచ్చు. కన్నడంలో పుట్ట శబ్దానికి చిన్న అనే అర్థముంది. పుట్టన్న వ్యక్తి నామం కూడా.

[1] No. 985 S. I. I. Vol, iv

చిన్నపడుగూరు :

అనంతపురం జిల్లా గుత్తి తాలూకా గ్రామం. ఇదే తాలూకాలో గల మరో వడుగూరును పెద్ద వడుగూరుగా వ్యవహరిస్తారు. నిజానికిది వడుకూరు. కృష్ణా జిల్లాలో వణుకూరు అనే గ్రామముంది. అన్నింట్లోనూ వున్నది 'వడుకు' శబ్దమే దారం (నూలు) ఒడకడం తెలిసిందే. అయితే దానికీ దీనికీ ఏమి సంబంధంలేదు. ఒడుకు శబ్దం ఒడుపు (నేర్పరి తనం) కు సంబంధించింది. కాగా ఇది 'వడకు' హలాది. మధ్యన 'డ' కారం మీది ఉత్వం చివరి 'కు' వర్ణ ప్రభావం. ఇంతకూ దీని అర్థం. ఉత్తర దిశ అని శ్రీనాథుడు హర విలాసంలో పార్వతీ దేవిని 'వడఁకు గుబ్బలి కుమారి' గా సంభావించాడు. దీనికి వణికించే పర్వతం (హిమ పర్వతం) కూతురు అని అర్థం చెపుతారు. ఇది సరికాదు. ఉత్తర దిశన గల పర్వతం కుమార్తె అని చెప్పాలి. మధ్యలో వచ్చిన అరసున్న శబ్ద రూపం తెలియని వారు చేర్చింది. అర్థం రీత్యా కూడా 'వడకు' శబ్దానికి వణికించు కుదరదు. వణుకుతున్న అవుతుంది. అప్పుడు పై అర్థం సరిపోదు 'వడై' అంటే ఉత్తరము. 'కు' దిశను బోధించే ప్రత్యయం. కన్నడంలో ఇదే అర్థంలో వుంది. తెలుగున కూడా నీకు, నాకు, మీకు, మాకు శబ్దాలలోని 'కు' దిక్సూచక ప్రత్యయంగా స్ఫురిస్తుంది. కృష్ణా జిల్లాలోని వణుకూరు కృష్ణానదికి ఉత్తరాన వుంది. కాగా వడుగ, ఒక రకం మొక్క కూడా. వాయు విడంగ తెలిసిందే.

అయినా ఇది వడుకూరు కూడా కాదు. వడుకుర్రు మాత్రమే. కుర్రు లోగడ వివరింపబడింది. ఫలితార్థం ఉత్తరపు వైపున గల కుర్రు స్వభావం గల భూమి. ఇక శాసనాల్లో దీనిని పినవడుకూరుగా వ్యవహరించారు. కాలక్రమంలో చిన వడుగూరుగా స్థిరపడింది. సదాశివ మహారాయల కాలం నాటి ఒక శాసనంలో దీనికి తిమ్మ సముద్ర అగ్రహారమనే పేరున్నట్లు చెప్పబడింది. ఆపస్తంభ సూత్ర, యజుశ్శాఖాధ్యాయులైన విప్రవినోది పెదకేశవయ్య గారి కుమారుడు హనుమంతయ్య, శక సంవత్సరం 1474 పరీధావి నామ సంవత్సరం కార్తీక శుద్ధ ఉత్థాన ద్వాదశి నాడు ఆ గ్రామంలోని హనుమంత, కామేశ్వర దేవళాలకు కొంత రొక్కం దానం చేసినట్లు శాసనం చెపుతోంది.

చిన్న హోతూరు :

అనంతపురం జిల్లా గుత్తి తాలూకా గ్రామం. ఇదే తాలూకాలో మరో హోతూరు వుండడం కారణంగా వివక్షకొరకు ఇలా వ్యవహరింపబడుతోంది. దానిని

గడే హోతూరు అంటారు. గడే, ఘడ (రాయఘడ) శబ్ద సంబంధి. హోతు కన్నడపదం. తెలుగులో పోతు. తెలుగులోని 'ప' హాస కన్నడం (ఆదునిక లేక కొత్త కన్నడం)లో 'హ' కారంగా ఉచ్చరించబడుతుంది. ఫలితార్థం పోతూరు. పోతరాజు తెలుసు. శాసనాల్లో దీనిని పిన హోతూరుగా వ్యవహరించారు.

శాసనం : గుత్తి తాలూకా, అనంతపురం జిల్లా.
క్రీ.శ. 1566 సం॥ సదాశివరాయల కాలం.
రాయదుర్గ రాజ్యంలోని వురొకొంద వేంర్యానకు చెల్లెటిపినహోతూరికి....
మైన దేవరాయ పురమనేటి సర్వమాన్య అగ్రహారమందు .
యీ హోతూరి అగ్రాహారమందు వేంచేశి ఉంన్న [1]

ఇలా 'పిన'తో కూడిన గ్రామాలు అనంతరకాలంలో 'చిన్న'గా మారినాయి. దీనికి గల మరో పేరు దేవరాయ పురంగా ఇది రాయదుర్గ రాజ్యంలోని వురొకొంద వేంర్యానికి చెందినదిగా చెప్పబడింది. ఈవురొకొంద నేడు ఉరవకొండగా వ్యవహృత మవుతోంది. వేంర్య అనగా వృత్తము. అంటే ఈ సీమలోనిదిగా అర్థం చేసికోవాలి. అప్పట్లో ఈ హోతూరు అగ్రహార గ్రామం. ఈ వెంత్యనే మనం 'వెంట్లు' అంటున్నాము. వరిగడ్డిని వెంటులుగా పురి పెట్టడం మాగాణి రైతులకు తెలిసిందే. ఈ వెంటులను ధాన్యపుపురులో కట్టడానికి ఉపయోగిస్తారు. మొత్తంమీద గుండ్రవ కైవారము, వృత్తము అనే అర్థాల్లో సరిపోతుంది.

### చిలకలూరిపేట :

ఇది గుంటూరు జిల్లా గ్రామం. నిజానికిది ప్రక్కనగల పురుషోత్తమ పట్నానికి శివారు గ్రామం. దీని అసలు పేరు చిలకలూరిపాడు. కాలక్రమంలో వ్యాపార కూడలి కావడంలో పాడు, పేట అయింది. చిలకలూరులోని చిలక ఒక రకం గడ్డి. బందరులోని చిలకలపూడి కూడా అంతే. పక్షి సంబంధి కాదు.

### చిలువూరు :

ఇది తెనాలి తాలూకా గ్రామం. దీని పూర్వనామం చిరువులి. మరొక పేరు శివపురం. ఈ చిరువులి చిలువూరు అయింది. చిలుమూరు పేరులో మరొక వూరుంది. దాని పేరు శాసనాల్లో చనుమూరు.

1 No. 209, S. I. I; Vol. xvi

శాసనం : చిలుమూరు: గుంటూరుజిల్లాతెనాలి తాలూకా,

"చిరువులి ఖండిక కేసరిపాటినిన... " [1]

జానుమూరి శ్రీ రామీశ్వర శ్రీ మహాదేవరకు నవులూరి పొలము ఏవు

సానులకు మానికింబెట్టి చునుమూర నిద్దఱు సానుకుం.... [2]

చీకటి :

ఇది శ్రీకాకుళం జిల్లాలోని గ్రామం. గుంటూరు జిల్లాలో చీకటి ఈగలపాలెం ఉంది. చీకటి అనేది ఒక చెట్టు పేరు. దీన్ని సంస్కృతంలో తమాలవృక్షంగా సంభావిస్తారు. ఈ మేరకు శ్రీనాథాది కవుల ప్రయోగాలున్నాయి. ఆ గ్రామానికి చెందిన కొన్ని కుటుంబాల వారికి అది ఇంటిపేరుగా కూడా కన్పిస్తోంది.

చీపురుపల్లి :

ఇది శ్రీకాకుళం జిల్లా గ్రామం. ఇందలి చీపురు కసవూడ్చుకునే చీపురు కాదు. ఇది రాతినేలల్లో మొలిచే పొడుగైన గడ్డిమొక్క. వీటితో చీపుళ్ళు కడతారు. మనం ఊడ్చుకునే సాధనం వల్లనే అంటే ఆ గడ్డి ఉపయోగపడే తీరువల్లనే, ఆ గడ్డి చీపురుగడ్డి అయింది. దీనిలో గుంట చీపురు అనే మరోరకం కూడ ఉంది.

చుండూరు :

ఇది గుంటూరు జిల్లా గ్రామం. ఇందలి 'చ' కారాన్ని తాలవ్యంగా కాక దంత్యంగా ఉచ్చరించాలి. అందుకే స్పష్టత కొరకు 'Tsunduru' అని వ్రాశారు. ఇది తెలియక దీనిని టి. సుండూరు అని వ్యవహరిస్తున్నారు. చుండి, ఊరు-చుండూరు. చుండి అనే గ్రామం కూడా నెల్లూరు జిల్లాలో ఉంది. ఇంతకూ ఇది ఒక చెట్టు. పొత్తపి కామ చోదరాజు తన తమ్ముని పేర చోడ బల్లీశ్వర దేవాలయం ఈ చుండూరులో కట్టించాడు.

చూడి :

ఆదోని తాలూకా గ్రామం. చూడబుత్తి అనేది ఒక రకం కలుపు మొక్క. చూడ సందిరం అనే గ్రామం కూడా ఉంది.

చెరుకూరు :

ఈ పేరులో అనంతపురం, తూర్పుగోదావరి, గుంటూరు, నెల్లూరు జిల్లాల్లో

1 No. 3—709, S. I. I. Vol. iv

2 No. 130, S. I. I. Vol. x

గ్రామాలున్నాయి. ఇక చెరుకుగనిమ, చెరుకుపల్లి, చెరుకువాడ, చెరుకుచెర్ల మొదలైన గ్రామాలు కూడా ఉన్నాయి. ఇది చెరుకు+ఊరుల కలయిక కావచ్చు. లేదా చెరుకు+కుర్రు కూడా కావడానికి అవకాశముంది.

చెరుకు, పంచదార, బెల్లము ఉత్పత్తి చేయడాని కుపయోగపడే వృక్షసూచిగా తెలిసిందే. సంస్కృతంలో దీనిని ఇక్షు శబ్దంతో సంభావిస్తారు. గ్రామనామాలలోని చెరుకు ఇదే కానక్కరలేదు. చెరుకుగడ్డి అనేది ఒకరకం గడ్డి. కాగా, వంట కుపయోగించే ఇంధనాన్ని (వృక్ష సంబంధమైనది) వంటచెరుకనడం తెలిసిందే.

గుంటూరు జిల్లాలో రెండు చెరుకూరులున్నాయి. వివక్ష కొరకు ఒకదానిని, లంజచెరుకూరని అంటారు. ఇందలి 'లంజ' శబ్దం వేశ్యార్థ సంబంధికాదు. లంజ అంటే ప్రవాహమని పూర్వం వివరింపబడింది. వక్రమైన గమనం కలది అని లంజ సంస్కృత శబ్దానికి అర్థం. అలాంటి ప్రవర్తన కలది అనే అర్థంలో వేశ్య అనే అర్థంలో కుదురుకొని యుండవచ్చు. చంచల స్వభావం కలది కావడం వలన లక్ష్మికి కూడా ఇది సంకేతం కావడానికి కారణం కావచ్చు. లంజ శబ్దంతో లంజ పొదరు, లంజి అనే గ్రామాలు, బిస్సంకటాకు ఏజన్సీలోను లంజ పేరుతో పార్వతీపురం ఏజన్సీలోను గ్రామాలున్నాయి. కృష్ణాజిల్లాలో లంజకాల్వ అనే పేరుతో ఒక ప్రవాహం ఉంది.

ఇక వట్టి చెరుకూరులోని 'వట్టి'కి కానిది. (అంటే లంజ కానిది) అ అర్థం కావచ్చు. లేదా కన్నడంలో ఒట్టిల్ అంటే ఎత్తైన, దిబ్బ అనే అర్థాలున్నాం అలాంటిదైనా కావచ్చు.

## చెర్లోపల్లి వ్యవసాయ కంద్రిగ :

చిత్తూరు జిల్లా కాళహస్తి తాలూకా గ్రామం. చెరువులో పల్లె గనుక చెర్లోపల్లి. ప్రస్తుత చర్చలోని గ్రామం, పై గ్రామానికి సమీపాన వచ్చిన గ్రామం. వ్యవసాయానికి అనువైనది గనుక పై విధమైన వ్యవహార మేర్పడింది. కంద్రిగ ముందు వివరింపబడింది.

## చేజెర్ల :

గుంటూరు జిల్లా నరసరావుపేట తాలూకా గ్రామం. ఇచ్చటి కపోతేశ్వరాలయం ప్రసిద్ధం. కపోత పురమనే పేరు కూడా ఈ ఊరికి చెల్లివస్తుంది. అయితే ఇది పిట్టల పురమనే దానికి సంస్కృతీకరణం. చేజెర్లకు శాసననామాలు చేరుంజెర్ల, చేంజెర్ల.

శాసనం : నర్సరావుపేట తాలూకా : గుంటూరు జిల్లా
క్రీ.శ. 1517లో శ్రీకృష్ణదేవరాయలిచ్చిన శాసనం
"శుభమస్తు సేతస్సిత సుమేరు రక్షిత మహిం శ్రీకృష్ణరాయద త్తశ్రీ చేరుజెర్ల గ్రామ చేంజెర్ల... శ్రీ కపోతేశ్వర దేవరనైవేద్య కల్పిత ఓయ్యం .." [1]

"చేజెర్ల : నర్సరావుపేట : గుంటూరుజిల్లా
క్రీ.శ. 1517 శ్రీకృష్ణదేవరాయకాలం
"మోదటి కైలాసమైన కపోతేశ్వర మందును... "
శ్రీ చేరుంజెర్ల అనాది సిద్ధమై సాగివచ్చే చేంజెర్లను బిట్టిలా పురమనే కపోత పురమందుసుంకతలారికాలు... " [2]

## చేబ్రోలు :

ఇది గుంటూరు జిల్లా గ్రామం. శాసనాలలో చేంబ్రోలుగా వ్యవహృతము.

"ఫాల్గుణీ శుక్లైకాదశీ శుక్రవార సహితేతాంమ్రా పురాధీశ్వరు ..." [1]

"దయా (ప] రోందఖండ దీపకముదాంబ్ర (పు)రం...." [2]

"గ్రాహి జేంబ్రోలి కుమారస్వామి ..." [3]

సంస్కృతీకరింపబడి తామ్రపురిగా కూడా వ్యవహరించబడింది. ఈ పేరుతో మరొక గ్రామం పశ్చిమ గోదావరి జిల్లాలో కూడా వుంది. శాసనాల్లో చేబ్రోలు (ద్రాక్షారామ శాసనం)గా నమోదైంది.

చెన్నుబ్రోలు, చేబ్రోలు అయి చేబ్రోలుగా స్థిరపడింది. ఇందలి చెన్ను అందమైన అనే భావం కావచ్చు. లేదా అచ్చటి భూమి రంగు, ఒకపాటి ఎరుపురంగు కూడా కావచ్చు. ప్రోలు అంటే కోశాధికారి నివసించే చోటు అని ముందు చెప్పబడింది.

---

1 No. 63, S. I. I; Vol. xvi
2 No. 63, S. I. I; Vol. xvi

No. 215, S. I. I; Vol. xiv
No. 105, S. I. I; Vol. vi
3 No. 106, S. I. I; Vol. vi

**చేకూరు :**

హిందూపురం తాలూకా గ్రామం. దీని పూర్వనామం చవుడూరు. కృష్ణా జిల్లాలో చవుటపల్లె అనే గ్రామముంది, చవిటినేల తెలిసిందే. దీనికి తిమ్మాపురమనే మరో పేరున్నట్లు శాసనం చెపుతోంది.

శాసనం : చేకూరు : హిందూపురం తాలూకా, అనంతపురం జిల్లా

క్రీ.శ. 1556 సం॥ సదాశివరాయల కాలం

"పెనుగొండ రాజ్య . స్థళము సుళగములోని చఉడూరికి ప్రతినామ

మైన తింమ సముద్రమందు స్తితా . " [1]

చవులూరు అనే పేరుతో మరో గ్రామం భద్రాచలం తాలూకాలో వుంది.

**జక్కంపూడి :**

ఇది విజయవాడ సమీపంలో ఉంది. దీని పూర్వనామం జక్కరెడ్డి పల్లి. జక్క శబ్దం యక్ష శబ్దం నుండి వ్యత్పన్నమయింది. రెడ్డి శబ్దం ముందు వివరింప బడింది.

**జక్కసముద్రం :**

అనంతపురం జిల్లా గ్రామం. జక్కయ అనే వాని పేరుమీదుగా ఏర్పడి వుండవచ్చు. రాయలసీమలో పెద్ద పెద్ద చెరువులను, సముద్రాలుగా వ్యవహరిస్తారని ముందు చెప్పడం జరిగింది.

**జగ్గయ్యపేట :**

కృష్ణాజిల్లా గ్రామం. దీని పూర్వనామం బేతవోలు. వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు, తన తండ్రి జగ్గన్న పేరు మీదుగా ఈ గ్రామాన్ని, తల్లి అచ్చమ్మ పేరు మీదుగా గుంటూరు జిల్లాలో అచ్చంపేట నిర్మించాడు. చరిత్రలో చివరిసారిగా నమోదైన సతీసహగమనం ఈ అచ్చమ్మగారిదే. ఆ సంఘట జ్ఞాపకంగా వాసిరెడ్డి కుటుంబాలకు చెందిన గృహిణులు నల్లపూసలు ధరించరు. ఇది ఒకప్పటి మాట.

**జాలకల్లు :**

పల్నాడు తాలూకా గ్రామం. కల్లు శిలా సంబంధి. జాల, జువ్వులకు సంక్షిప్త రూపం. శాసనాల్లో జువులకల్లు అనే సంభావితము. జువ్విచెట్టు (Fius infeetoia willd) తెలిసిందే. ఇక్కడి అధిష్టాన దైవం భీమలింగేశ్వరుడు. కల్లు శిలా సంబంధి. పర్వతార్థంలో సంభావితము.

[1] No : 101 S. I. I. Vol. v

**జొన్నలగడ్డ :**

ఇది గుంటూరు జిల్లా గ్రామం. జగ్గయ్యపేట తాలూకాలో మరొక జొన్నలగడ్డ వుంది. ఇంకా ఇతర చోట్ల కూడా వుండవచ్చు. జొన్న (Sorghum vulgare Pus; Holcus soghum, Linn.) తెలియని వారుండరు. జొన్న శబ్దానికి వ్యుత్పత్తి స్వర్ణ < చొన్న > చొన్నగా ఊహిస్తున్నాను. గడ్డ అంటే ఏదైనా ప్రవాహం ప్రక్కన గల ఎత్తైన భూభాగమని ముందు చెప్పడం జరిగింది.

గుంటూరు జిల్లాలోని జొన్నలగడ్డ గ్రామానికి అమృతపురమనే పేరు శాసనాల్లో కన్పిస్తుంది. ఇక్కడ అమరేశ్వరాలయం కూడా వుంది. ఆ దేవుని పేరు మీదుగా, ఆ వూరుని అమృతపురంగా సంభావించడం జరిగింది.

**జోడిధర్మాపురం :**

ఇది అనంతపురం జిల్లా గ్రామం. ధర్మ అనే వ్యక్తి పేరుమీదుగా గానీ ధర్మం చేయడం వలన గానీ ఏర్పడి యుండవచ్చు. జోడి శబ్దం జోడుకు (రెండు) సంబంధించినది కాదు. ఇది వ్యవసాయానికి సంబంధించినది. ఈనాము భూములపై పన్నుకు కౌలుకు సంబంధించి ఇచ్చే రాయితీని జోడి అంటారు. సమీపంలో ఇంకా ధర్మాపురాలుండడంవలన పై చెప్పిన ప్రత్యేకమైన ఏర్పాటు కలిగిన ధర్మాపురం కావడం వలన ఇది జోడి ధర్మాపురం అయింది. గ్రామనామాలపై 'జోడి' ఎక్కడున్నా ఇలాగే అర్థం చేసికోవాలి.

**జోరాపురం :**

హంద్రీనది దక్షిణాన, కర్నూలును చేరియున్న గ్రామం. ఇది వ్యక్తినామ పరంగా వచ్చిన పేరు. జోరా (Zorah) అనే ఆమె, బీజాపూర్ గవర్నరు అబ్దుల్ వాహబ్ సోదరి. పర్షియన్ జోరేహర్ అంటే రత్నము అని అర్థం.

**ట్రింకోమలి :**

తమిళ పులుల గూర్చి వార్తల్లో ఈ ఊరు ప్రముఖంగా విన్పడుతుంది. నిజానికిది త్రికోణమలై. అంటే మూడు కోణములు లేక శిఖరములు గల మలై అంటే కొండ. కోటప్పకొండను (నరసరావుపేట తాలూకా) త్రికూటగిరి అనడం తెలిసిందే.

**ఢిల్లీ :**

ఇది మనదేశ రాజధాని. దీనిని భారతకాలంనాటి హస్తినాపురంగా వ్యవహరించడం కద్దు. ఇదిలా వుండగా, ఆముదాన నగరమనే మరొక పేరున్నట్టు,

ఔరంగజేబు పాలనా కాలంనాటి చిత్తూరుజిల్లా శాసనాలలో పేర్కొనబడింది. ఢిల్లీ దేహలి పద సంబంధి యని చెపుతారు. ఢిల్లీ పేరుతో ఢిల్లేశ్వరరావు అనే వ్యక్తి నామం కూడా వుంది. అరకులోయ ప్రాంతంలో వనకఢిల్లీ అనే వూరుంది. శ్రీకాకుళం జిల్లాలో ఢిల్లీ పేరుతో గ్రామాలున్నాయి.

**తంబళ్ళపల్లి :**

చిత్తూరు జిల్లా మదనపల్లె తాలూకా గ్రామం. శైవదేవాలయ పరిచారికా కోటి లోనివారు తంబళ్ళు. ఈ గ్రామాన్ని ప్రస్తుతమిదే పేరుతో వ్యవహరిస్తున్నా శాసనా లలో దీనిపేరు తమ్మడియరహళ్ళి అంబాపురంగా కనిపిస్తుంది. 'అర్' అనేది బహు వచన ప్రత్యయం. గౌరవసూచకం. అంబాపురం కాలంమీదట లుప్తమైపోయింది. తంబళ్ళపల్లెగా స్థిరపడింది. బహువచనం మాత్రం నిలిచింది.

**తడకలపూడి :**

పశ్చిమ గోదావరి జిల్లా గ్రామం. గుంటూరు జిల్లాలో కూడా ఈ పేరుతో గ్రామముంది. ఇదిగాక కలువపూడి పేరుతో చాలా గ్రామాలు కన్పిస్తున్నాయి. మంచికలపూడి, శేరికలపూడి మొదలైనవి. ఇందలి 'కలువ'కు చెరువుల్లో పెరిగే కలువపూల మొక్కకు సంబంధంలేదు. ఈ కలువ లేక కల అనే శబ్దం 'కలి' (Carrisa carandas, Linn.) అనే పొదగా పెరిగే ముళ్ళమొక్కకు సంబంధిం. నది. పూడి ఇంతకుపూర్వం వివరింపబడింది. ఇక 'తడ' అంటే హద్దు, మేర. పాముకు తడకట్టుట అంటే దానిని హద్దులో వుంచడం, ఈమేరకు మన్నారు దేవుని హేమాబ్జానాయకా స్వయంవరంలో ప్రయోగముంది. 'తడ' అనే పేరుతో గ్రామముంది. ఇక్కడ హద్దు అనే అర్థం. అంటే పాకనాటికి తొండమనాటికి హద్దు, ఇక తడకలపూడిలోని తడ కూడ అలాంటిదే. కామవరపుకోట తాలూకాకు చెందిన ఈ గ్రామం వేంగి వేయింటికి రాజధానిగా శాసనాల్లో చెప్పబడుతుంది. దీనికే అండుంబల్లి అనే పేరున్నట్టు తెలుస్తోంది. అండు అనేది ఒక విధమైన చెట్టు.

**తణుకు :**

పశ్చిమ గోదావరి జిల్లా గ్రామం. ఇది వాస్తవానికి 'తడుకు' డకారం ణుకారంగా పరిణమించింది. చిత్తూరు జిల్లాలో 'తడుకు' అనే వూరుంది. తడకల పూడిలో గల 'తడక కూడా ఇలాంటిదే. తణుకు సమీపంలోని వేమవరం, తణుకు వేమవరం అనే వ్యవహారాన్ని పొందింది. పార్వతీపురం ఏజన్సీలో 'తణుకు'

పేరుతో మరో గ్రామముంది. తడసు (Grewia tıliaetolia vahi) పేరుతో కన్నడంలో ఒక పండ్లమొక్క వుంది. తమిళంలో తడై ఒక రకం మొక్క.

**తలతంపర :**

ఇది విశాఖజిల్లా గ్రామం. తల అంటే ముఖ్యమైన ఎత్తైన అని అర్థాలు. ఇక తంపర అంటే నది లేక వాగుకు సమీపంలోని భూమి. ముఖ్యంగా నీరు నిలబడి పోయే చోటగల భూమిని తంపర అంటారు.

**తాడికొండ :**

ఇది గుంటూరు జిల్లా గ్రామం. శాసనాల్లో తాండికొండ, తాన్రికొన్రగా ప్రస్తావితము. మల్కాపురం శాసనంలో కేవలం 'తాడి' అని చెప్పబడింది. తాడి, సాధారణంగా తెలిసిన తాడిచెట్టే కానక్కరలేదు. త్రిఫలాల్లో తాడి ఒకటి. అలాగే నేలతాడి, అరదాడి, కోదాడి, రాస్తాడి అనేవి తాడి పేరుతో గల ఇతర వృక్షజాతులు. ఇచ్చట కామేశ్వరుడు శక 1158 వైశాఖశుద్ధ త్రయోదశినాడు మన్మపోతడు ఆయన భార్య పండాందిక ప్రతిష్ఠించినట్లు శాసనం చెపుతోంది.

**తాడిపత్రి :**

ఇది అనంతపురం జిల్లా గ్రామం. శాసనాల్లో దీనిపేరు తాటపరతి. తాటి-తాటినుండి ఉత్పన్నం పరతి, పఱ్రు శబ్దానికి ఔప విభక్త రూపం. వీటిని గూర్చి ముందు వివరించడం జరిగింది. పర్తి, పత్రి కావడం విశేషం.

**తిమ్మసముద్రం :**

ప్రకాశం జిల్లా గ్రామం. ఇది వ్యక్తి పేరుమీదుగా వచ్చిన గ్రామం. తిమ్మ తిరుమల శబ్దసంబంధి. తిమ్మశబ్దం వానరానికి కూడ సంకేతం. తిమ్మప్ప అంటే తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వరస్వామి. తిరుమలలో ఒకప్పుడు అధిక సంఖ్యలో కోతు లుండేవి.

దీని పూర్వనామం గుండ్లమడుగు. గుండము అంటే లోతైనది, అగాధము అనే అర్థాలున్నాయి. గుండు శబ్దానికి వర్తులము, వర్తులాకృతి అనే అర్థాలున్నాయి. గుండ్లకమ్మ అన్నప్పుడు పై అర్థము, ఈ గ్రామ విషయంలో దిగువ అర్థాలు వర్తిస్తాయి. ఈ అర్థాలు కన్నడ, తుళు, తమిళ భాషల్లో కూడా వున్నాయి. ఇక సముద్రం అంటే పెద్ద జలాశయమని అర్థంలో సంభావితము. ఈ వాడుక రాయల సీమ జిల్లాల్లో వున్నట్లు ఇంతకుపూర్వం చెప్పటం జరిగింది. ఈ గ్రామానికి పేరు విజయనగర పాలనాకాలంలో తిమ్మసముద్రంగా పునర్నామకరణం గావింపబడింది.

ఈ గ్రామంలోని గోరంట్ల గృహనామంగా గల కుటుంబాలు పూర్వం, అనంతపురం జిల్లా గోరంట్ల గ్రామంనుండి దానశాసన కాలంలో వచ్చినవారు కావచ్చును. మడుగు అంటే జలాశయం.

తిమ్మ సముద్రం పేరుతో ఇతర జిల్లాల్లో కూడా గ్రామాలున్నాయి. పై వివరణ ప్రకాశంజిల్లాకు మాత్రమే వర్తిస్తుంది. అర్థంమాత్రం అన్నింట్లో సమానమే.

**తాతపూడి :**

గుంటూరు, తూర్పుగోదావరి జిల్లాల్లో వున్నాయి. బంధుత్వ సూచకమైన 'తాత'కు దీనికి సంబంధంలేదు. ఇది కూడ నేలను సూచించేపదం. మెత్తటి దువ్వతో కూడిన నేల. తెలుగులో ప్రస్తుతం ఈ శబ్దం కనిపించదు. తమిళంలో వాడుకలో వుంది. దూళిపూడి అంటేకూడా అదే అర్థం. అయితే నేల స్వభావంలో కొంతభేదం వుండవచ్చు. ధూళిపూడి రేపల్లె తాలూకాలో ఉంగి. కాగా తాత్తి అంటే తమిళంలో ఒక చెట్టు. తెలుగులో తుమికి చెట్టు లాంటిది గావచ్చు.

**తిరుపతి :**

తెలుగువారి ఇలవేలుపైన శ్రీ వేంకటేశ్వరస్వామి నెలకున్న దివ్యక్షేత్రంగా చిత్తూరు జిల్లాలోని తిరుపతి ప్రసిద్ధం. ఎగువ సన్నిధిని తిరుమల అని, దిగువ సన్నిధిని తిరుపతి అనడం కద్దు. ఇక ప్రసిద్ధ వైష్ణవ క్షేత్రాలను తిరుపతులని వ్యవహరిస్తారు. కృష్ణాజిల్లాలోని శ్రీకాకుళం, గుంటూరు జిల్లాలోని మంగళగిరి, విశాఖజిల్లాలోని సింహాచలం వీటన్నింటికి తిరుపతులనే వ్యవహారముంది. శ్రీమద్రామానుజులు అవతరించిన పిదప, అర్చామూర్తి స్వయంవ్యక్తమై, సన్నిద్ధ రాళ్వారుల ప్రతిష్ఠ గలిగిన నెలవులను దివ్యతిరుపతులుగా సంభావించటం జరిగింది. అలాంటివి 108. ఈ సంఖ్యకు పరిమితం చేయడంలో ఉద్దేశ్యం బహుశా, విష్ణు నామావళిలో అష్టోత్తర శతానికి గల ప్రాధాన్యం కావచ్చును.

ఇక తిరుపతి వివరణ. ఇది తమిళ పలుకుబడి. 'తిరు' 'పతి'ల కలయిక తిరుపతి అని సులభంగానే తెలుస్తోంది. తమిళంలో 'శ్రీ' అనే శబ్దం (సంస్కృతం) తిరుగా వ్యవహృతం. మలయాళ, కన్నడ భాషల్లో కూడా ఈ వ్యవహార ముంది. కనుక శ్రీపతి అంటే విష్ణువు (లక్ష్మీపతి) నెలకొన్నచోటు గనుక 'తిరుపతి' అని భావిస్తారు. కాని గ్రామనామపరంగా ఇది నిజంకాదు.

భాషా శాస్త్రరీత్యా 'శ్రీ' తిరుగా మారడానికి అవకాశంలేదు. శ్రీ అ సంస్కృత శబ్దానికి, సంపద, అభ్యున్నతి, ఆధిక్యం, అందము, లక్ష్మీదేవి, మేధ, మానవాతీతశక్తి, పురుషార్థత్రయి (ధర్మ, అర్థ, కామములు) అనే అర్థాలున్నాయి.

ఇంపటి లక్ష్మీదేవి అన్న అర్థమే, పై భావనకు (విష్ణువు నెలకొన్నచోటు) మూలం. భాషప్రదేశాని, పదవ్యుత్పత్తి మాత్రం అలాకాదు.

లక్ష్మీదేవి ప్రథమ మహిళ (స్త్రీ)గా సంభావితము. ఈ 'స్త్రీ' తమిళంలో పదాది యందలి సకారాన్ని కోల్పోయి 'తిరి'గా రూపుదిద్దుకుంది. స్త్రీ లింగాన్ని తమిళంలో తిరీలింగ మంటారు. అలా శ్రీ, ప్రథమ స్త్రీ గనుక, స్త్రీ తమిళంలో 'తిరి' గనుక శ్రీ, తిరు అయిందని భావిస్తున్నాను.

ఇక 'పతి' శబ్ద పరామర్శ; సంస్కృత శబ్దం 'పతి'కి వల్లభుడు, ధవుడు, భర్త అనే అర్థాలున్నాయి. విష్ణువు (లక్ష్మీపతి) అని తిరుపతిని భావించడానికి ఇది కూడా కారణం. కాని తిరుపతిలోని 'పతి' తెలుగువారి ఉచ్చారణ మాత్రమే. తమిళుల ఉచ్చారణలో అది 'పది'. తమిళలిపిలో సరళాలకు (గజడదబ) వేరుగా సంకేతాలు లేవు. ఉచ్చారణలో ఉన్నాయి. అంటే వ్రాతలో 'పతి' అని వ్రాసి, ఉచ్చారణలో 'పది' అని పలుకుతారు. ఏతావాతా 'తిరుపతి' తమిళోచ్చారణలో 'తిరుప్పది'. 'ప'కారంలోని ద్విరుక్తత ఊనిక కొరకు వచ్చింది. ఈ 'పది' సంఖ్యా వాచకమైన తెలుగువారి 'పది'కాదు. అది తమిళంలో 'పత్తు'. తమిళంలో 'పది' ఆవాసము, ఇల్లు, దేవాలయం, నగరం, గ్రామం, దివ్యవాణి వెలువడుచోటు (మందిరము) అనే అర్థాలలో రూఢం. కనుకనే తమిళులు అన్ని దేవాలయాలను, ఆలయాలున్న ప్రదేశాలను 'తిరుప్పది' అంటారు. చర్చలోని 'తిరుపతి' తమిళుల భాషలో సామాన్య నామమే. నిజానికి ఈ తిరుపతిని వేంగడం, తిరువేంగడం, వడవేంగడం, వెంగడాచలం అని ప్రత్యేకంగా వ్యవహరిస్తారు. పై శబ్దాల్లోని 'గ' కారం తమిళోచ్చారణ. తెలుగులో 'క' కనుక మనకు వెంకటాచలం.

వేంగడానికి పూర్వ రూపం వెలిగొండ. తిరుపతి కొండలను వెలిగొండలు, వెలిమలలు అంటారు. ఈ వివక్ష 'నల్లమల' వలన ఏర్పడింది. వడవేంగడం అనడంలో ఉద్దేశ్యం ఉత్తరాన గల వేంగడమని. మదురై సమీపంలోని అళగర్ కొండలను తమిళులు తెన్ వేంగడంగా సంభావిస్తారు. వడై అంటే ఉత్తరం. తెన్ అంటే దక్షిణం. ఈ రెండు శబ్దాల వివరణ వణుకూరు, తెన్నేరుల వద్ద చూడ వచ్చును.

దిగువ తిరుపతికి గోవిందరాజస్వామి పేరుమీదుగా గోవిందరాజ పట్టణమనే మరోపేరు కూడా ఉంది.

ఇక తిరుపతి పేరుతో పశ్చిమగోదావరి జిల్లాలో ద్వారకా తిరుమల (దీనినే

చిన్న తిరుపతి అంటారు) పెద్దాపురం దగ్గర మరో గ్రామం వున్నాయి. పెద్దాపురం దగ్గరి తిరుపతికి కొమరగిరి పురమని శాసనాస్థ నామముంది.

### త్రిపురాంతకం :

ప్రకాశం జిల్లాలోని ప్రసిద్ధ శైవక్షేత్రం. త్రిపురాంతకుని (ఇచ్చటి దైవం) పేరుమీదుగా త్రిపురాంతకమని ఏర్పడింది. అమ్మవారి పేరుమీదుగా త్రిపురసుందరీ పురమని పిలవడం కద్దు. ఇచ్చటి కొండకు కుమారాద్రిఅని, కుమారగిరి అని పేర్లు. కొండవీటి రెడ్ల ప్రభువులలో ప్రసిద్ధుడైన కుమారగిరిరెడ్డి కా పేరు, ఈ కుమారగిరి ప్రభావంవలననే వచ్చింది· అతని పేరుమీదుగా చాలా గ్రామాలు వచ్చాయి. కృష్ణా జిల్లాలోని కొమరవోలు అలాంటి వాటిలో ఒకటి.

### తీడ :

అనకాపల్లి తాలూకా గ్రామం. త్యాడ అనే ఈ పేరుతో అరకు మార్గంలో రైల్వేస్టేషనుంది. ఇవి రెండూ ఒకటే అర్థాలనిస్తాయి. ఒక రకం మొక్క. త్యాళ్ళూరు అనే వూరు కూడా ఉంది. ఈ త్యాడపై బహువచనం చేరి త్యాళ్ళ, తేళ్ళ అయింది. తేళ్ళ ఇంటిపేరుగా కూడా కన్పిస్తుంది.

### తుపాకులవారి గుంట :

ఇది ఇంటిపేరు మీదుగా వచ్చిన చిత్తూరుజిల్లా గ్రామం. దీనికి ఆయుధమైన తుపాకికి ఏమీ సంబంధం లేదు. నిజానికి 'తుపాకుల' ఒక చెట్టుపేరు. తుప్ప ఆకుల కలయిక తుపాకుల మోరపాకుల కూడ ఇలాంటిదే. తూర్పుగోదావరి జిల్లాలో తుపాకులగూడెం అనే వూరుంది. తుపాకి వలస సాలూరు తాలూకాలో గలదు. గుంట, భూమి ఉపరితల మట్టానికి కొంత లోతైనది.

### తువ్వ చేనుపల్లె :

చిత్తూరుజిల్లా చంద్రగిరి తాలూకా గ్రామం. మెత్తని ఇసుకనేలను తువ్వనేల అంటారు. కాని చేను అనుబంధంగా ఉండడం వలన ఇచ్చట ఈ అర్థం పొసగదు. అంతేగాక పుత్తూరు తాలూకాలో అగ్గి చేనుపల్లె అనే మరో గ్రామముంది. కనుక ఈ రెంటినీ పోల్చి చూడటం అవసరం. తమిళంలో తూవరై అంటే ఒక రకం కంది. తెలుగుతో పప్పుధాన్యంగా కందులు తెలుసు. కాని ఇందులో చాల రకాలున్నాయి. అలాంటి వాటిల్లో ఇది ఒకటి. ఇక అగ్గి చేనుపల్లెలోని అగ్గి, నిప్పు అనే అర్థాన్నిచ్చే అగ్నికి ఇచ్చట సంబంధం లేదు. అగ్గంటిపాకు అనేది ఒక రకం మొక్క. అగ్గిమల్లె, అగ్గివేంద్ర అనే మొక్కలు కూడా వున్నాయి,

**తర్లుబాడు :**

మార్కాపురం తాలూకా గ్రామం. శాసనాల్లో దీని పేరు తర్నుపాడు. దీనికి గల మరొక పేరు రఘుపతి రాజపురం. ఇది కొచ్చెరకోట సీమలోనిది. తర్ను శబ్దానికి అర్థం తెలియకున్నది. బహుశ శాసనకారుని లేఖన దోషం కావచ్చు. కన్నడంలో తడె అంటే ఒక రకం చెట్టు. ఈ గ్రామాన్ని శక సంవత్సరం 1466లో, సదాశివ దేవ మహారాయల పాలనా కాలంలో నంద్యాల సింగరయ్య దేవమహారాజుల కుమారుడు అవుబళయ్య, రఘుపతి రాజుగారికి పుణ్యంగా, మారకాపురం (మార్కాపురం) చెన్న కేశవ స్వామికి, అందలి శ్రీ వైష్ణవులకు, భీష్మ ఏకాదశినాడు దానం చేసినట్లు శాసనం చెపుతోంది. ఈ గ్రామానికి నాలుగు దిక్కుల గల గ్రామాలు, జమ్మల . గంగిరెడ్డి పల్లె, కారవానిపల్లె, మేడిసెట్టి పల్లె, నారేపల్లె, వాసాలపురం కోమటిగుంట, తెల్లంబాడుగా పేర్కొనబడ్డాయి.

శాసనం : మార్కాపురం. మార్కాపురం తాలూకా,

క్రీ.శ. 1544 సదాశివరాయల కాలం.

"కొచ్చెర్లకోట శీమకుం చెల్లిన తర్నుబాడున్ను అందుపల్లెలు జమ్మలదిన్న, గంగిరెడ్డిపల్లె, కారవాని పల్లె; మేడిసెట్టి పల్లె, నారెపల్లె వాసాలపురం కోమటికుంట తెల్లంబాడు సహితమైన గ్రామాలకు చతుః శీమకుంన్నులో నైన తంర్నుబాడు గ్రామానకు ప్రతి నామమైన రఘుపతిరాజపురం" [1]

"కొచ్చెర్లకోట సీమలోని తర్నుబాడు .. " [2]

**తుళ్ళూరు :**

గుంటూరుజిల్లాలోని గ్రామం. దీని పూర్వనామం త్రుల్లూరు. నిజానికిది తుర్లు ఊరు. త్రురుసేలను గూర్చి ముందు చెప్పడం జరిగింది. కృష్ణా తటమున తుఱుకేశ్వర దేవాలయమున్నట్లు శాసన సాక్ష్యముంది.

**తూబాడు :**

గుంటూరు జిల్లాలోని గ్రామం. తూముపాడు అనిపిస్తుంది. తూమాటి, ఇంటి పేరుగల వారున్నారు. కాని శాసనాల్లో ఇది తూంబరితిగా వ్యవహరింపబడింది. తూము, పరితి, తూంపరితి అయింది. పరితిలేక పర్తి అనేది పర్రుకు బౌపవిభక్తిక రూపం. దొండపర్తి కూడా ఇలాంటిదే. తూము అనేది కూడా ఇంటిపేరుగా ఉంది.

[1] No. 140, S. I. I; Vol. xvi

[2] No. 134, S. I. I. Vol. xvi

అయితే ఈ తూము నీరు పోవడానికి ఉపయోగించే సాధనం కాదు. తూము ఒక రకం మొక్క. తుమ్మి (Leucas aspera, spremp) అంటే తెలుస్తుంది. కృష్ణా జిల్లాలో తుమ్మడి అనే గ్రామముంది.

**తెన్నేరు :**

కృష్ణాజిల్లా గ్రామం. తెన్ను, ఏరుల కలయిక తెన్నేరు. 'తెన' శబ్దానికర్థం దక్షిణము (South). ఫలితార్థం దక్షిణపు ఏరు. ప్రస్తుతం ఆ పేరుతో ప్రవాహమేదీ లేదు. గ్రామం మాత్రమే వుంది. కృష్ణానదిపై ఆనకట్ట కట్టిన తర్వాత, కృష్ణాజిల్లా తూర్పు భూభాగపు భౌతిక స్వరూపం మారిపోయింది. సహజ ప్రవాహాలు చాలా మురుగు కాలువలుగా రూపొందాయి. ఈడ్పుగల్లు గ్రామం నుండి బయలుదేరిన ఒక వాగు, ఉప్పులూరు మీదుగా ప్రవహించి రెండు భాగాలై బుడమేరులో కలిసి పోయింది. ఇది దక్షిణపు ఏరు అయినపుడు. ఉత్తరపు ఏరు మరొకటి వుండాలి. అది వన్నేరు. ఇప్పటికీ ఆ పేరుతోనే దానిని వ్యవహరిస్తున్నారు. వడై అంటే ఉత్తరపు దిక్కు. తమిళులు, తెలుగువారిని వడిగర్లు అనడానికి కారణం, వారికి వీరు ఉత్తర దిశన వుండడమే. తెన్నేరునంటి వచ్చిన జనపదం తెన్నేరు అయింది. పూర్వం ఆ ప్రవాహం గండిగుంట మీదుగా ప్రవహించి పుల్లేరులో కలిసేది. ఆ కలసిన చోట ఏర్పడిన రేవు ఓగిరాల. నిజానికి దానిపేరు ఓగిరేవుల కాలక్రమంలో ఓగిరాలగా స్థిరపడింది. 'ఓగి' శబ్దంలో చిలకలూరిపేట దగ్గర ఓగేరు అనే ఏరుంది. బహుశా ఈ ఓగి,బాగు ఓగులలోని ఓగు కావచ్చు. అంటే చెడ్డది అని అర్థం. ఏరుపరంగా మురుగు ప్రవాహమని అర్థం కావచ్చు.

**తెనుగు ఖూడి :**

విశాఖపట్నం జిల్లావీరవల్లి తాలూకా గ్రామం. జాతి, భాషా సంబంధమైన తెలుగు, తెనుగుతో దీనికి సంబంధంలేదు. ఇది ఒది రకం మొక్క. తృణ ధాన్య సంబంధి. కొర్ర జాతికి చెందినది. అయితే జాతి సంబంధమైన 'తెలుగు' శబ్దంతో ఊళ్లు లేకపోలేదు. దివితాలూకాలో శ్రీకాకుళానికి సమీపంగా తెలుగురావు పాలెం అనే గ్రామముంది. నెల్లూరు జిల్లా ఆత్మకూరు తాలూకాలో తెలుగురాయపురం, మార్కాపురం తాలూకాలో తెలుగురాయని చెరువు అనే గ్రామాలున్నాయి. "రంభ గూడె తెనుంగు రాయ రాహుత్తుండు" అనే శ్రీనాథుని చాటువులోని చరణం తెలిసిందే గదా ! ఇక పూడి అనుబంధంగా ఉండడం వలన, తెనుగు పేరుతో ఒక గడ్డి మొక్క ఏదైనా వుందేమో తెలియదు.

దప్పలం పాడు :

నెల్లూరు జిల్లా కందుకూరు తాలూకా గ్రామం. దప్పళం, భోజనంలోనికి ఆధరువుగా తెలిసిందే. వెనుకటి తరాల్లో జమీందారులు, ప్రభువులు అలా మాన్యాలు ఇచ్చిన వైనమూ లేక పోలేదు. అయితే దీనిని దొప్పల పూడితో పోల్చి చూసినప్పుడు, ఒక రకం మొక్కగా భావించాల్సి వస్తోంది. చివర 'అలం' వుండడం కూడా దానినే సమర్థిస్తోంది. కాగా రేగడి నేలలను దొంప నేలలనడం కద్దు. దొప్పలపూడి తెనాలి తాలూకాలో వుంది. కాగా దుప్పలపూడి అనే గ్రామం రాజమండ్రి తాలూకాలో వుంది.

దర్శి :

ప్రకాశం జిల్లా గ్రామం. ఇది చెట్టు పేరు. దిరిసెన (Albizzia lebbek, beuth) తెలిసే వుంటుంది. ఇంకా ఈ పేరుతో ఇసుకదర్శి, దరిశమల, దరిశిపర్రు అనే గ్రామాలు వరుసగా ప్రకాశం, అనంతపురం, పశ్చిమగోదావరి జిల్లాల్లో వున్నాయి.

దళవాయిపల్లె :

చిత్తూరు జిల్లా గ్రామం. ఇంకా మిగతా జిల్లాల్లో కూడ వుండవచ్చు. దళవాయి అంటే సైన్యాధికారి. ఇంతకు పూర్వం దండనాయని గూర్చి చెప్పడం జరిగి. ఇలాంటిదే తలారి. ఇది తలవర శబ్ద సంబంధి. ముఖ్యాధికారి. నేడు గ్రామసౌక తలారి అంటున్నాం. ఈ పేరుతో కూడా తలార్ల పల్లె అనే గ్రామం వుం. దళవాయి ఇంటిపేరు గలవారున్నారు.

ద్రాక్షారామం :

తూర్పుగోదావరి జిల్లాలోని ఈ ప్రసిద్ధ శైవక్షేత్రం పేరు వినని వారు ఉండరు. ఇక్కడి స్వామి భీమేశ్వరుడు. మాణిక్యాంబ ఇచ్చట దేవేరి. శ్రీనాథుని భీమేశ్వర పురాణం ఈ క్షేత్ర మాహాత్మ్యాన్ని వర్ణించేదే. దీనినే ద్రాక్షారామం అంటారు. దక్షుడు యజ్ఞం చేసింది ఇచ్చటేనని, శివుని పనుపున వీరభద్రుడు దానిని భంగపరచాడని చెపుతారు. ఇది పురాణగాథ. కాగా దాని వాస్తవనామం డాకిరేమి ఈ మేరకు శాసనాధారాలున్నాయి.

శాసనం : భీమాపురము డాకరేనికియు నమూదాలు .[1]

[1] No. 123, S. I. I. Vol. x

దీనికి సమీపంలోనే కోటిపల్లి గోదావరి ఒడ్డున ఉంది. డాకిరేమి శబ్దానికి ఇంకా అర్థం వెతుకవలసి వుంది. అది డాకిరేమి గాక దాకరేమి అనిపిస్తోంది. కృష్ణా జిల్లాలోని దాకరం ఇలాంటిదే. ఏమైనా సమంగా వివరించలేని స్థితి. ఈ క్షేత్రాన్ని అంటివున్న తటాకానికి 'సప్తగోదావర' మని పేరు. అంతేకాని సప్తగోదావరమంటే ఏడుపాయలైన గోదావరి అని అర్థంకాదు. 'గోదావరి' నదికి సంబంధించిన కథ అందరకూ తెలిసిందే. గోహత్యా పాతకాన్ని నివారించుకొనుట కొరకు ముని ప్రార్థించి గంగను ప్రవహింపచేసాడనే కథనం. కాని గోద, శబరి అనే రెండు నదుల కలయిక గోదావరి అయిందని గిడుగురామమూర్తి పంతులుగారి వివరణ.

**దార్వేముల :**

గుంటూరు జిల్లా పల్నాడు తాలూకా గ్రామం. దారవేముల దార్వేముల అయింది. ఇదే తాలూకాలో పశువేముల అనే గ్రామముంది. అందువలన వివక్ష అవసరమైంది. శక సంవత్సరం 1051 ప్రాంతంలో కొమ్మనూరు నేలిన కొమ్మన తండ్రి 'దార' యను నతని పేరు మీదుగా పిలువబడి యుండవచ్చు. లేదా 'దారక' అనేది ఒక కలుపుమొక్క కూడా. లేదా సమీపంలోని వాగుపేరు కూడా కావచ్చు. పశువేములలోని 'పశు' (జంతు) సంబంధి కాదు. ఇది కూడా ఒకరకం మొక్క. పసుపుల అనే వూరుంది. పసుపులేరు అనే ఏరుంది. ఇక 'వేముల' వేపచెట్టు కాదు. ఒక మొక్క. నేల వేము తెలిసిందే. అలాంటి వాటిలో వేములలో ఒకరకం మొక్కలు గావచ్చును. వేము శబ్దంతో చాలా గ్రామాలున్నాయి. అరకటి వేముల, మల్లవేముల మొదలైనని. వేములతో వేములపల్లి, వేములమడ గ్రామాలు కృష్ణాజిల్లా దివి తాలూకాలో వున్నాయి. మడ అంటే ప్రవాహం.

**దుగరాజపట్నం :**

దీనికిగల మరొక పేరు సువర్ణముఖి దుగరాజపట్నం. సంస్కృతనామం ధ్రువరాజపట్నం. యువరాజు పట్నమనే పేరుకూడా చెల్లివచ్చింది. ఇంగ్లీషువారు దీనిని ఆర్మగం అని పిలిచారు. వెంకటగిరి జమిందారుల నుండి ఇంగ్లీషు వారికి సంక్రమింప చేయడంలో పట్నస్వాముల ఆర్మగం మొదలి అనే కరణం చాలా కృషి చేసాడు, 1625 ఫిబ్రవరిలో ఈస్టిండియా కంపెనీ ఫ్యాక్టరీ స్థాపించింది. ఇక్కడ తయారయ్యే ఉప్పు ప్రశస్తమైనదిగా పేరు పొందింది.

**దుగ్గిరాల :**

దీని పూర్వనామాలు దుగ్గరేల పూండి, దుగ్గమపూండి.

శాసనం : శ్రీమత్శకాబ్దె రసబాణ భేందు శంఖ్య ప్రవిత్త ద్విజపుంగవేః పంస్థాత్మః
శ్రీమతుగ్గదాల పూండిం దుదోహత్యుస రాగతిఖ్యాం.... [1]

ఇది ప్రస్తుతం కృష్ణ కాలువ ప్రక్కన వుంది. ఇక్కడ నుండి కొమ్మమూరుకు కాలువ తీయబడింది. నిజానికి ఈ కాలువలన్నీ ఒకప్పటి తుంగభద్ర ప్రవాహ భాగాలు. ఇందులో ఒక భాగం నూతక్కి మీదుగా వెళ్ళింది. దానిని గోదావరి అంటారు. సంగం జాగర్లమూడి దగ్గర మరొక వాగుతో కలవడం వలన అక్కడ సంగమేర్పడి, అది సంగంజాగర్లమూడి అయింది. ఈ తుంగభద్ర వెంట గల గ్రామాలు మెల్లెంపూడి, పెదవడ్లపూడి, తుమ్మపూడి, మోరంపూడి, దుగ్గిరాల, అంగలకుదురు, వలివేరు, పొన్నూరు మొదలైనవి. ఇక చర్చలోని గ్రామం దుగ్గిరేలపూండి. ఇందలి పూండి కాలక్రమంలో పోయి దుగ్గిరేల దుగ్గిరాలగా పరిణమించింది. కృష్ణాజిల్లాలోని ఓగిరాల గుంటూరు జిల్లాలోని మద్దిరాల కూడా ఇలాంటివే. పైన చెప్పినట్లుగా నిజానికిది రేలపూండి కాదు. రేవులపూండి. సమీపంలోని రేవేంద్రపాడు కూడా. రేవు ఇంద్ర పాడు. మరొక ఇంద్రపాడు కాలగర్భంలో కలిసిపోయింది. మెరమపూండి మోరం పూడి అయింది. దుర్గిగ్రామం పల్నాడులోనిది. శాసనాల్లో అది దుగ్గగా ప్రస్తావింప బడింది. బహుశా ఇది దొగ్గలికి (Amarantus polygamus) మారురూపం కావచ్చు.

**దేవగుడి :**

కడపజిల్లా జమ్మలమడుగు తాలూకా గ్రామం. నిజానికిది దేవిగుడి. ఇక్కడ అధిష్ఠాన దేవత 'తళకంటిదేవి'. గ్రామం నిజానికి తళకంటి దేవిగుడి. వ్యవహారంలో కేవలం దేవగుడిగా సంక్షిప్తీకరింపబడి, చివరకు దేవగుడిగా స్థిరపడింది. ఈ దేవతకు ఆయా కాలాల్లో సమీపంలోని దానవులపాడు, సుకమంచిపల్లి, తురంగరాయ పల్లె గ్రామాలు దానమిచ్చినట్లు శాసనాలు తెలుపుతున్నాయి. సుగుమంచిపల్లె అనే గ్రామం ఈ తాలూకాలోనిదే. తురంగరాయపాలెం సమాచారం తెలియరాలేదు.

**దొమ్మర నంద్యాల :**

కడపజిల్లా జమ్మలమడుగు తాలూకా గ్రామం. దొమ్మర తెలుగునాట ఒక కులం. కర్నూలుజిల్లాలోని నంద్యాలనుండి వివక్ష చేయడానికి చేరిన పదం. ఇది అనంతరకాలంలో ఎప్పుడో చేరింది. దాని పూర్వనామం నందెల. అయితే కర్నూలు

[1] No. 709, S. I. I. Vol. iv

జిల్లా నంద్యాలనుండి వివక్ష చేస్తూ దానిని రేనాటి నందేల అని వ్యవహరిస్తున్న శాసనాలు చెప్తున్నాయి.

శాసనం : జమ్మలమడుగు తాలూకా, కడపజిల్లా.

క్రీ.శ. 1521 శ్రీకృష్ణదేవరాయల కాలం.

"రేనాటి నందేల చెన్నకేశవ దేవరకు ఇచ్చిన దర్మశాసన పత్రక్ర మెట్లంనను[1]

కడపజిల్లా ప్రాంతాన్ని రేనాడని పూర్వకాలాల్లో వ్యవహరించేవారు. ఽ 'నంది' శివుని వాహనమైన నందికాక పోవచ్చు. దీనికి కారణం ఆంతో కల ఉండడం. నంది పేరుతో ఒక చెట్టు (Lagustomia microcarpa) ఉం నంద్యాల ప్రాంతం నంది మండలంగా వ్యవహరింపబడింది.

## ధవళేశ్వరం :

1348లో, గోదావరిపై ఆనకట్ట నిర్మించినదిక్కడే. ఆనకట్ట పొడవు 140 గజాలు. దీనికి ధవళగిరి అనికూడా వ్యవహారముంది. అంటే తెల్లని కొండ. రాజమం శలపటులకు, ఏలూరు మహమ్మదీయులకు 15, 16 శతాబ్దిలో జరిగిన యుద్ధాలక ఇది మూగ సాక్ష్యంగా నిలిచింది. ధవళగిరిపై, చాళుక్య విజయాదిత్యుడు నిర్మించి జనార్ధనస్వామి ఆలయముంది. ఈశ్వరం, గ్రామనామాల్లో దేవస్థానాలున్న చోటుక సంకేతంగా నిలిచింది.

## నండలపాడు :

ఇది అనంతపురం జిల్లాగ్రామం. ఈ నంద శబ్దం, నెలంద శబ్దంనుండి వచ్చింది. ఈ నెల్లిందల ఒక మొక్క పేరు. ఇల్లిందల, ఉల్లిందలతో పోల్చి చూడండి. శాసనంలో ఈ గ్రామం నెలదలపాడుగా పేర్కొనబడింది. అంతేగాక ఆ గ్రామానికి వీరనరసింహపురమనే మరొక పేరుండేది. దీనికి పేరు పెట్టినవారు మహాప్రధాని సాళువ తిమ్మయ. తన ప్రభువు వీరనరసింహరాయల పేరుంచి ఆ గ్రామాన్ని తాడిపత్రిలోని రామేశ్వర దేవునికి దానం చేశాడు. ఇది క్రీ.శ. 1501, శుక్లనామ సంవత్సర వైశాఖశుద్ధ పూర్ణిమ శుక్రవారంన జరిగినట్టు శాసనం చెప్తోంది. ఇంకా ఈ గ్రామం గుత్తిరాజ్యంలోని పెన్నాంబడి సీమకు చెందినదిగా శాసన వివరముంది.

[1] No. 70, S. I. I; Vol. xvi

**నందలూరు :**

ఇది కడపజిల్లాలోని రాజంపేట తాలూకాలో వుంది. దీని పూర్వనామం నెలందలూరు. నెల్లిందల ఒక మొక్క పేరు. ఉల్లిందల అనేది మరోరకం మొక్క. పులివెందుల కూడా ఇలాంటిదే.

**నందివెలుగు :**

ఇది గుంటూరుజిల్లా గ్రామం. ఇందలి వెలుగు శబ్దం కాంతికి సంబంధించింది కాదు. ఇది ఒక రకం మొక్క పేరు. వెనుకటి కాలంలో గ్రామాలలో గ్రామ సరిహద్దులలో నంది కంబాలను (స్తంభాలను) పాతించే ఆచారముంది. అలా స్థాపించడంలోని ఆంతర్యం తెలియరాకున్నది. నందిగామ, నందిగం మొదలైన గ్రామాలు కూడా ఇలా వచ్చినవే. ఈ నందివెలుగుకు మరోపేరు తిరుమలరాజపురం సదాశివరాయలు విజయనగరాన్ని పాలిస్తున్న కాలంలో, మండలేశ్వరుడైన రామరాజు తిరుమలరాజు ఈ గ్రామాన్ని కృష్ణపండితులనే వానికి దానం చేశారు. ఇది క్రీ.శ. 1564 రక్తాక్షి నామసంవత్సరం ఆషాఢ శుద్ధ ఏకాదశినాడు జరిగినట్లు కొండవీటిలోని ఒక శాసనం తెలుపుతోంది.

శాసనం : కొండవీడు : గుంటూరు తాలూకా; గుంటూరు జిల్లా.
కొండవీటి శీమలోను కొండవీటి తూర్పున నంద్ది వెలుంగుకు ప్రతినామమైన తిరుమల రాజపురపు అగ్రహార ముంద్దా కటడు చేశిన
వివరం... [1]

**నదివంపు :**

ఇది తూర్పు గోదావరి జిల్లాలో వుంది. నది వంపు తిరిగేచోట ఉండడం వల్ల ఆ పేరు వచ్చింది. ఇలాంటివి మరికొన్ని. పిన్నదరి, పెన్నానది ఒడ్డున వుంది. వైరదరి. వైరానది ఒడ్డున ఉంది. గుడి చెంపగిరి. ఇది ఉత్తర ఆర్కాడు జిల్లాలో వుంది. గుడికి ప్రక్కన గల కొండ అని అర్థం. పర్రచివర, ఇది కృష్ణా జిల్లాలో ఉంది. పర్ర అంటే విశాలమైన బయలు, ఇసుక పర్ర అనడం తెలుసుకదా ! అలా పర్రకు చివరన వుంది గనుక పర్ర చివర, నదీ తీరాన ఉంది గనుక నదీతీరందా సాళ్ళపల్లి. ఇది చిత్తూరు జిల్లాలో వుంది. దాసుళ్ళు అంటే వైష్ణవ భక్తులు, ఏటి ఆవల తాండ్రు పాడు అనే గ్రామం కర్నూలు జిల్లాలో ఉంది.

[1] No. 698 S. I. I. Vol iv

**నరవ :**

గిద్దలూరుకు సమీపంలో ఉంది. కొండ నడుమ భాగాన్ని నరవ అంటారు. అక్కడ వచ్చిన జనావాసానికా పేరు వచ్చింది.

**నరసరావుపేట :**

గుంటూరు జిల్లా నరసరావు పేట తెలియని వారుండరు. మల్రాజు నరసరావు జమీందారు, అప్పటికి గల వూరికి దూరంగా తమ ఆవాసాన్ని నిర్మించుకున్నారు. అసలు ఊరు అట్లూరు. నరసరావు నిర్మించిన కోట ప్రాంతం నరసరావు పేటగా మారి, కాలక్రమంలో ప్రాధాన్యత హెచ్చి, అదే పేరు స్థిరపడింది. అట్లూరు కాల గర్భంలో కలిసిపోయింది.

**నరసాపురం :**

ఈ పేరుతో చాలా గ్రామాలు కన్పిస్తాయి. అయితే ఇది అనంతపురం జిల్లా గుత్తి తాలూకాకు చెందినది. వ్యక్తి నామ పరంగా వచ్చింది. విజయనగరాన్ని పాలించిన వారిలోని పేరు మీదుగా వచ్చి యుంటుంది. దీనికి కృష్ణరాయపురమనే మరో పేరున్నట్లు శాసనంలో చెప్పబడింది. ఇందలి కృష్ణరాయడు, కృష్ణదేవరాయలై యుండవచ్చు. నరస శబ్దం నృసింహ శబ్ద భవం. ఇదే జిల్లాలో నరసాంబుధి అనే గ్రామముంది. సాధారణంగా రాయలసీమ జిల్లాల్లో ముఖ్యంగా అనంతపురం జిల్లాలో, చెరువులను సముద్రాలని వ్యవహరించడం కద్దు. ఇక్కడ అంబుధి కావడం విశేషం. నరసాపురం, జగలాపి గుత్తి సీమలోనిదిగా శాసనం పేర్కొంటుంది.

**నల్లపాడు :**

గుంటూరు సమీప గ్రామం. 'నడలపాడు' అనేది దీని శాసనస్థనామం. నడ, నల, రెండూ, కన్నడంలో వృక్ష సూచకాలే. (Arundotibialis or amphidonax kerka R). నల్లగోల అనేది ఒక రకం గడ్డి.

**నవాబ్ పేట :**

కృష్ణాజిల్లా నందిగామ తాలూకా గ్రామం. ఈ గ్రామానికి పేరు నైజాముల కాలంలో వచ్చింది. దీని పూర్వ నామం కురుకూరు. కుఱు కుఱ్ఱు వ్యవహారంలో కపటాడు అయింది. కుఱ్ఱు శబ్దం వివరింపబడింది. కుఱు అంటే చిన్న, కురుమద్దాల లోని కురు కూడా ఇలాంటిదే. కుఱ్ఱవాడు, కుఱ్ఱది శబ్దాలు తెలిసినవే. ఇక్కడ దైవం స్వయం భూనాథ మహా దేవుడు. ఈ దేవునికి గుడిమెట్ల, పెనుగంచి ప్రోలు నేలిన చాగ వంశస్థులు చాలా దానాలు చేసారు.

**నాగలాపురం :**

ప్రస్తుత గ్రామం గుత్తి తాలూకాలోనిది. ఇది కృష్ణరాయని తల్లి పేరు మీదుగా వచ్చిన గ్రామం. ఇదిగాక చిత్తూరు జిల్లా సత్యవేడు తాలూకాలో ఒకటి. అనంతపురం జిల్లా గుత్తి తాలూకాలోను, రాయదుర్గం తాలూకాలోను మరి రెండు గ్రామాలు ఈ పేరుతో ఉన్నాయి. ఇవన్నీ కృష్ణదేవరాయల తల్లి పేరు మీదుగా వెలసినవే. ఇక ఈ గ్రామానికి అసలు పేరు ఏటిపీడు, ఏరుకు ఔపవిభక్తిక రూపం ఏటి. పూర్వం ఏటి అవల తాంగ్రడపారును గూర్చి చెప్పబడింది. వీడు పూర్వం వివరింపబడింది. అయితే ఇక్కడొక విశేషముంది. చాలా సందర్భాల్లో పూర్వపు గ్రామాల పేర్లను గూర్చి దానకర్తలు తమ పేర్ల మీదుగా, తమకు ఇష్టమైన వారి పేర్లమీదుగా వ్యవహరించినా, కాలాంతరంలో అవి నిలువలేదు. పూర్వనామాలే నిలిచాయి. ఇక్కడ అలా కాక పూర్వనామం పోయి, క్రొత్త పేరు నిలిచింది.

**నారాయణపురం :**

ఈ పేరుతో చాలా గ్రామాలుండవచ్చు. ప్రస్తుత చర్చ బొబ్బిలి తాలూకాలోనిది. ఈ గ్రామంలోని నీలకంఠేశ్వరాలయంలో చాల శాసనాలున్నాయి. ఆ శాసనాలన్నిటిలోను నీలేశ్వర దేవర ప్రశస్తి కనుపిస్తుంది. అయితే ఆ దేవాలయం కొన్ని శాసనాలల్లో నావపల్లి ఉన్నట్లు, మరికొన్ని శాసనాల్లో నిడచెర్వులో వున్నట్ల పేర్కొనబడింది. ఈ నారాయణపురానికే పూర్వం పైరెండు పేర్లున్నట్లు భావించాలి.

**నారాయణవనం :**

పుత్తూరు తాలూకా గ్రామం. ఇక్కడి దైవం కళ్యాణ వెంకటేశ్వరుడు. ప్రస్తుతమిది నారాయణవనమనే వ్యవహరింపబడుతోంది గాని, పూర్వపు నాళ్ళలో దీని పేరు నారాయణపురంగా వ్యవహరింపబడినట్లు శాసనంలో చెప్పబడింది. వనం అంటే తోట.

**నిజాంపట్నం :**

రేపల్లె తాలూకాలోని రేవుపట్నం. దీనికి స్థానికంగా ఆర్జంపట్నం అనే వ్యవహారం ఉండేది. దానికి సమీప గ్రామమైన పెద్దపల్లి ఆధారంగా ఇంగ్లీషు వారు 'పెట్టి పోలి'గా వ్యవహరించినట్లు వారి రికార్డులలో వ్రాసుకున్నారు. ఇంగ్లీషువారు మొట్ట మొదటిగా 1611లో ఇక్కడకు వచ్చి 1621లో ఫ్యాక్టరీ స్థాపించి, 1653లో మూసివేసి తిరిగి 1697లో పునః స్థాపించారు. 1676లో మొదటిసారిగా దీనిని నిజాంపట్నంగా వ్యవహరించేవారు. అయితే స్ట్రెయిన్‌షామ్ మాష్టారు అనే దొర,

దీని అసలు పేరు న్యాసంపట్నం అని 1679లో నమోదు చేసాడు. 1753లో నైజాం నవాబ్ చేత ఫ్రెంచివారికి దఖలు చేయబడింది. అయితే 1759లో సలాబత్ జంగ్, నిజాంపట్నంలో కొంతభాగాన్ని ఇంగ్లీషు వారికివ్వడం, 1765లో మొగలాయిలు ఫర్మానా వారికి ఇవ్వడం జరిగింది. కాగా 1784లో రెండవ మైసూర్ యుద్ధకాలంలో హైదాలీచే దోపిడీకి గురి అయింది. ఇది చరిత్ర.

పట్టణమంటే సముద్రతీర ప్రాంతంలో వుండే ఆవాసమని, అనంతరకాలంలో ఏ జలాధారం ప్రక్కగల ఆవాసానికైనా పట్టణమనే వ్యవహార మొచ్చినట్లు లోగడ వివరించబడింది. ఇక నైజాం అనేది హైదరాబాద్ నేలిన మహమ్మదీయ ఏలికలకు చెల్లివచ్చిన బిరుదునామం. వ్యస్తంగా నైజాం అంటే కూర్పరి, మతాన్ని క్రమబద్దీకరించువాడు, సంరక్షకుడు. నజూమాశబ్ద సంబంధి. ఇక అర్జ అంటే ఒకరకం మొక్క. సంస్కృత నామం అర్తకు తెల్లగగ్గెర అంటే తెలుస్తుంది. బరంపురం తాలూకాలో అర్జపాలెం అనే గ్రామముంది, అర్తా ఇంటిపేరు గలవారున్నారు. న్యాస శబ్దానికి ఉంచు, పెట్టు అనే అర్థాలున్నాయి. వీటితోపాటు డెలివరింగ్, కన్‌సైనింగ్ అనే ఇంగ్లీషు పదాల భావనలో కూడా ఈ న్యాస శబ్దం చెల్లివస్తుంది. వీటిని బట్టి ఎగుమతి దిగుమతుల గల రేవుపట్నమని చెప్పవచ్చు. అయితే రేవుపట్నమంటేనే ఈ అర్థముంది. కనుక ప్రత్యేకంగా న్యాసపట్నమని చెప్పవలసిన అవసరం లేదు. కనుక ఈ అర్థం పొసగదు. న్యాస శబ్దానికి వదిలివేయబడిన అనే అర్థం కూడా ఉంది. దీనినిబట్టి అంతకుముందు రేవుగా, వ్యాపార కేంద్రంగా, ఎగుమతులు, దిగుమతులు జరిగిన పట్నంగా వుండి, తరువాత కారణాంతరాలవల్ల, రేవుగా పనికిరాకపోయి వుండాలి. బహుశా దీనికి క్రీ. శ. 1503లో జయనామ సంవత్సర జ్యేష్ఠ అమావాస్య నాడు వచ్చిన భూకంపం, ఉప్పెనలు కారణం కావచ్చు. ఈ రెండు ఉత్పాతాలవల్ల పొదిలి నుండి కృష్ణానది పర్యంతం అశేష జననష్టంతోపాటు భూభౌతిక స్థితిలో మార్పు వచ్చినట్లు భావించాలి. గుండ్లకమ్మ తన గతిని మార్చుకున్నట్లు నమోదైన సాక్ష్యముంది.

కృష్ణానది కూడ తూర్పునుండి దక్షిణాభిముఖియై (తోట్లవల్లూరుకు దిగువ) మరలింది కూడా, ఈ సమయంలోనే కావచ్చు. కృష్ణ నుండి ఒక ప్రవాహం తుంగభద్ర పేరుతో, సీతానగరం నుండి నిజాంపట్నం వరకు ప్రవహించే దనటానికి చారిత్రకంగా దాఖలాలున్నాయి. అనంతర కాలంలో ఈ ప్రవాహంలో కొంతభాగం మేటపడింది. మొత్తంమీద దీని మొదటపేరు అర్జపట్నమై, అనంతరం వ్యాపారానికి అనువుగానందున న్యాసపట్నమై వుండాలి. నిజానికి మొదట మొదట నైజాంతో

సంబంధముండి వుండకపోవచ్చు. 'న్యాస' శబ్దం నిజంగా మారి ఉండాలి. నైజాం నవాబుల తర్వాత స్థిరపడి ఉండవచ్చు. కారణమేమంటే అనంతర కాలంలో నిజాం పట్నం సర్కారు అనేపేరు ఈ ప్రాంతానికి చెల్లివచ్చింది.

**నిడమర్రు :**

గుంటూరు, పశ్చిమ గోదావరి జిల్లాల్లో ఈ పేరుతో గ్రామాలున్నాయి. నిడుపైన (పొడవైన) పర్రు (నేల) కావడం వలన నిడమర్రు. శాసనాల్లో నిడుంబర్రు అని ప్రస్తావించబడింది.

శాసనం : మంగళగిరి : గుంటూరు తాలూకా; గుంటూరు జిల్లా

"నిడుంబర్తను క్షేత్రం కేసరిపా 1 ఖ 14.. " [1]

గుంటూరు జిల్లాలోని నిడమర్రును కొట్టియశర్మ అనే వానికి విద్యాబోధన నిమిత్తం చాళుక్యుల కాలంలో దానంగా ఇవ్వబడింది.

**నిడిముసిలి :**

నెల్లూరు జిల్లా గ్రామం. ఇచ్చట ముసిలి, వృద్ధ సంబంధార్థి కాదు. ముసిలి అనేది ఒకరకం చెట్టు. ముసిణి, ముసిడి పేరుతో మొక్కలున్నాయి. దీనినే ముష్టి అంటారు. అయితే ముసిలి ఇదికాక పోవచ్చు. కన్నడంలో ముసుటి (Argynia specira sweet) పేరుతో ఒక ప్రాకే తీగ మొక్క కూడా వుంది. అయితే ని ముసిలి అంటే పొడవైన ముసిలి అనికాక ముసిలిలోని భేదంగా గుర్తించాలి. తెలుగులో ముసిణి తెలిసిందే కదా! అలాగే నిడమానూరులోని నిడమాను అంటే పొడవైన చెట్టు అనిగాక, దానిపేరే అది అని గ్రహించాలి. అయితే నిడిమాను అనేది సరియైన రూపం.

**నిధానంపాడు :**

పల్నాడు తాలూకా గ్రామం, శాసనాల్లో దీనిని నిధనంపాడుగా పేర్కొన్నారు. నివాసము, నీరు నిలువ బెట్టిన చోటు లాంటి అర్థాలు ఈ శబ్దానికున్నాయి. అంతేగాక మార్గ మధ్యంలో విశ్రాంతి కొరకు ఆగేచోటుగా కూడా చెప్పవచ్చును. వ్యవహారంలో నిదానంపాడుగా స్థిరపడింది. నిధనవాడ అనే గ్రామం అనంతపురం జిల్లాలో ఉంది.

**నీళ్ళులేని తిమ్మాపురం :**

ఇది అనంతపురం జిల్లా గ్రామం. తిమ్మాపురం తిమ్మయ్య అనే వ్యక్తి నామం

[1] No. 709 S. I. I. Vol. iv

మీదుగా ఏర్పడింది. సమీపంలో మరొక తిమ్మాపురం ఉంది. ఈ తిమ్మాపురంలో నీళ్ళకు ఇబ్బంది గనుక ఇది నీళ్ళులేని తిమ్మాపురం అయింది. తిరుమల శబ్దం 'తిమ్మ' అయింది.

**నున్న :**

విజయవాడ సమీప గ్రామం. నున్న శబ్దానికి అర్థం సమంగా బోధపడడం లేదు. అయితే దేవాలయానికిచ్చిన భూమిగా అర్థమవుతోంది. శ్రీ కూర్మదేవాలయం శాసనాల్లో ఒకదానిలో, ఇరవై అయిదు పుట్లనేల, భండారానికి (దేవాలయ ప్రాంగణం) కలిపి, గ్రామానికి 'నున్య' విడిచిన అనడంవల్ల స్వంత భూమిని, దేవాలయ ప్రాంగణానికి చేరి వున్నదానిని, ఉమ్మడిభూమిగా అందరి ఉపయోగార్థము వదిలినట్లుగా భావింపబడుతోంది. బహుశా ఈ నున్న గ్రామం కూడా, సమీపంలోని ఏదైనా దేవాలయానికిచ్చింది కావచ్చుననిపిస్తోంది.

**నెమలి :**

నెమలి, నెమలికల్లు అనే పేర్లు వినే వుంటారు. ఇవి నెమలి పక్షుల పేర్లతో ఏర్పడినవి కావు. నెమలి అనేది ఒక మొక్క పేరు. నెమలి అడుగు చెట్టు (Vitex pubescens vahl.) అనేది మెట్ట ప్రాంతాల రైతులకు బాగా పరిచయమైనదే. ఈ పేరుతో చాలా గ్రామాలు ఆంధ్రదేశంలోను, తమిళ దేశంలోను వున్నాయి.

**నెల్లూరు :**

ఇది ప్రసిద్ధమైనదే. ఆ పేరుగల జిల్లాకు ముఖ్య కార్యస్థానము. దీనికే విక్రమసింహపురమనే పేరు కూడా వుంది. నెల్లి ఊరు నెల్లూరు. నెల్లి అనేది ఒక రకం గడ్డి. (Phyllanthur emblica Linn) ఒకరకం తృణధాన్యం కూడా (lorza sativa Linn). అవి పండేచోట నెల్లి శబ్దం గ్రామనామాల్లో వర్తించింది. విశాఖ జిల్లాలోని నెల్లిమర్ల ఇలాంటిదే. నెల్లికుదురు అనే ఊరు కూడ వుంది. ప్రసిద్ధమైనది ఈ నెల్లూరే అయినా, ఇంకా చాలా నెల్లూరులున్నాయి. ఎళయనెల్లూరు, ఎలవానెల్లూరు, గంగాధర నెల్లూరు, పెరుమా నెల్లూరు, కుందా నెల్లూరు, ఉత్తమ నెల్లూరు, విజయ నెల్లూరు, భుజభుజ నెల్లూరు, దామర నెల్లూరు, వీరగ నెల్లూరు మొదలైనవి. తూర్పుగోదావరి జిల్లాలో ఒక నెల్లూరు గలదు. ఇవిగాక 'నెల్లు' సంబంధి గ్రామాలు. నెల్లుకుదిరి, నెలుబల్లి, నెల్లిమంది, నెల్లికోట, నెల్లిపట్ల, నెల్లిపూడి, నెలుబల్లె మొదలైనవి. 'లొంగరానీ దొంగలచ్చీ వొల్లు నెల్లూదోయగా' అని వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు రచించిన ఒక గేయ చరణం.

**నెకరికల్లు :**

నరసరావుపేట తాలూకా గ్రామం. నక్రేకల్లు పేరుతో మరో గ్రామం నల్గొండ జిల్లాలో వుంది.

నల్లంగొండయు నాగరి
కల్లును ధరణీస్థలిం బ్రగల్భస్థలముల్
పల్లేరునాగులేరును
బల్లెకాంతయెల్లక్ష్మా ప్రారంభంబుల్

అని క్రీడాభిరామంలో ప్రస్తావింపబడింట. శాసనాలలో కూడా ఇది నగరిగల్లుగా చెప్పబడింది. నగర్+కల్లుల కలయిక నగరికల్లు. వ్యవహారంలో నగరికల్లు, నకరికల్లు, నెకరికల్లు. అయితే ఇది సంస్కృత శబ్దం నగరం సంబంధ మున్నదికాదు. అలాగే నకరపూడి, నకరాసపీడు మొదలైన శబ్దాలలోని నకరం కూడ నగర సంబంధమున్నది కాదు. ఇది కేవలం ఒక మొక్క. (The fragrant root of pertennis Roxb) నాగరమట్ట అంటే తెలియవచ్చు. దీనిని సాధారణ వ్యవహారంలో కలబంద అని కూడా అంటారు.

ఇక నకరపువాదలోని నకరము అంటే పన్నులేని ప్రాంతాన్ని సూచిస్తుంది. న+కరము అంటే వైశ్యులుండే చోటు. ఇది ఇంటిదగ్గరే వ్యాపారం చేసికోవడాన్ని సూచిస్తుంది. అలాకాక, పేట స్థలాల్లో, సంతలలో వ్యాపారం చేస్తే పన్ను చెల్లించాలి. వైశ్యుల శివాలయాలన్నీ నగరీశ్వర శబ్ద సంభావితములగుట గమనార్హం.

**నేలకొండపల్లె :**

ఇది ఖమ్మం జిల్లా గ్రామం. కృష్ణాజిల్లాలో కూడా మరొక నేలకొండపల్లి ఉంది. ఇది నేల, కొండపల్లి కాదు. నేలకొండ, పల్లి. నేలకొండ అనేది ఒక మొక్క పేరు. నేలకొండి అనికూడా అంటారు. దూలగొండి, దూలగొండ తెలిసి ఉంటాయి. వ్యస్తంగా కొండలం అనేది కూటా ఒక రకం కలుపు మొక్క. ఇక నేలఉసిరి, నేలమామిడి మొదలైనవి కూడా తెలిసినవే. మానికొండ, పోలుకొంప, కొండపాటూరు లలోని కొండ కూడ పర్వత సూచికాదు. వృక్ష సూచి మాత్రమే. పరిసరాల్లో కొండలు లేని చోట, కొండ అనే పేరుతో గ్రామాలుంటే వాటిని వృక్ష సంబంధులు గానే పరిగణించాలి. విజయవాడ సమీపంలోని కొండపల్లి పర్వత సంబంధి. కొండపి లేక కొండేపిలోని కొండ వృక్ష సంబంధి.

**నేలమామిడి చెలక :**

తూర్పు గోదావరి జిల్లా గ్రామం. మామిడి పేరుతో చాల రకాల మొక్కలున్నాయి. మనం పండుగా తింటున్న మామిడి వేరు. మిగిలినవి చాల చిన్న మొక్కలు. చెలక అంటే వృక్షాధారంతో సాగుచేసే భూమి. చెలక పేరుతో ఇంకా గ్రామాలున్నాయి. ఖమ్మం జిల్లాలోని బంగారు చెలక ఇలాంటిది.

**నైనవరం :**

ఇది విజయవాడకు సమీపంలో ఉంది. దాని అసలు పేరు కొండనాయనివరం కొండనాయడు అనే వాని పేరు మీదుగా వచ్చింది. కొండలోపించింది. నాయని వరం, వ్యవహారంలో నైనవరంగా స్థిరపడింది.

**నైనారు ఖండ్రిక :**

చిత్తూరు జిల్లా పుత్తూరు తాలూకా గ్రామం. నయనారు అనే తమిళపదం. ప్రభువు, యజమాని అనే అర్థాలతో పాటు, శైవసన్యాసులకు బిరుదు కూడా వర్తిస్తుంది. అంతేగాక తమిళనాడులో చయనార్, కైకోళారు ఉడైయార్, వేళలార్ కులాల వారికి పట్టపు నామంగా వ్యవహారంలో ఉంది. ఒకే ఒక నయనారుకు ఇచ్చిన ఖండ్రిక (భూమి) గనుక ఇది నైనారు ఖండ్రిక.

**పటమట :**

ప్రస్తుతం ఇది విజయవాడకు శాఖా నగరంగా రూపొందింది. కాని వాస్తవానికిది స్వతంత్ర గ్రామం. వ్యవహారంలో పడమటగా వ్యవహరించడం కద్దు. వ్యవహార బలిమిచే దీనిని దిశా సంబంధిగా భావించే అవకాశముంది. కాని దీని అసలు పేరు పట్టమెట్ట.. పట్ట శబ్దానికర్థం ఉన్నతము. పట్టపురాణి, పట్టపుటేనుగు మొదలైన శబ్దాలతో పోల్చి చూడండి. ఇక మెట్ట అంటే ఎత్తైనది అని అర్థం. ఫలితార్థం బాగా ఎత్తైన భూభాగం. నది ఒడ్డున గల భూమి అని కూడ చెప్పవచ్చు. సమతలంగా వున్న భూమి అని మరొక అర్థం. దీనికి అనుబంధంగా లంకలో ఏర్పడిన జనావాసం పటమట లంక. ఇది కూడ వ్యవహారంలో పడమట లంక అని రూఢిని పొందింది. పట్టమెట్ట అనే వ్యవహారానికి శాసనస్థ ఆధారముంది.

శాసనం : "అంబుజ గర్భ వంశ మణియై దయం బట్టపు మెట్ట యగ్రహారంబుగ నిచ్చి..." [1]

[1] No. 1061, S. I. I. Vol. iv

**పడకండ్ల :**

కర్నూలు జిల్లా శిరువెళ్ళ తాలూకా గ్రామం. దీని శాసనరూపం పెడకల్లు. పెడ అంటే దూరము, వెనుక అని అర్థాలు' పెడసరం అనే మాట తెలిసిందే. కన్నడంలో పెడసు అంటే గట్టితన మనే అర్థముంది. కల్లు అంటే రాయి. పర్వత సూచి. కండ్ల, కల్లుకు బహువచన రూపంగా నిలిచింది. అయితే కండ అంటే ఎత్తైన అనే అర్థముంది.

ఇక్కడొక విశేషం. ఈ గ్రామనామం, రెడ్లలో ఒక తెగకు పేరుగా నిలిచింది. వారిని పెడకంటి రెడ్లు అంటారు. పంట రెడ్లు నెల్లూరి సీమవారు. మోటాటి రెడ్లు మొట్ట వాడి నాటి రెడ్లు. మార్కాపురం ప్రాంతాన్ని మొట్టవాడినాడుగా పూర్వం వ్యవహరించేవారు.

**పదిపుట్ల బయలు :**

చిత్తూరు జిల్లా చంద్రగిరి తాలూకా గ్రామం. బయలు అంటే విశాలమైన అని అర్థం. గుర్రాలబయలు, సంతబయలు అనే గ్రామాలు కూడ వున్నాయి. ఈ పదానికి వెలుపలి అని కూడా అర్థం చెప్పవచ్చును. కాని ఇక్కడ విశాలమైన అనే అర్థమే పొసగుతుంది.

పుట్టి అంటే ప్రాచీన కాలంలోని భూపరిమాణాన్ని సూచించే పదం. కుంటలు సెంట్లు, ఎకరాలువలె. పుట్టినేల, రెండు పుట్ల నేల అనే విధంగా శాసనస్థ ప్రయో గాలున్నాయి. ఇక్కడ ఇది పది పుట్లనేల. పుట్టి అనేది ధాన్య పరిమాణ సూచకం కూడా. కృష్ణామండలంలో పది బస్తాల ధాన్యం ఒక పుట్టి. గుంటూరు జిల్లాల్లో 13 బస్తాలు ఒక పుట్టి. ఇక్కడ పుట్టి నేల అంటే ఒక పుట్టి ధాన్యం పండే నేల అని కాదు. పుట్టి ధాన్యం విత్తడానికి వీలయినంత వైశాల్యం గల భూమి అని అర్థం చేసికోవాలి.

ఇక పుట్టి అనేది, నీటిపై ప్రయాణించడానికుపయోగించే సాధనం కూడా. పుట్టి మునిగింది అనే వ్యవహారం తెలిసిందే. అయితే ఈ అర్థానికి గ్రామనామ సంబంధ అయిన పుట్టి శబ్దానికి సంబంధం లేదు.

**పద్మనాభం :**

విశాఖజిల్లా, భీమునిపట్నం తాలూకా గ్రామం. ఇది వ్యక్తి నామపరంగా లేక స్థానిక అధిష్ఠాన దైవం పేరుమీదుగా వచ్చింది. సమీపంలోని కొండపై

త్రి మహా విష్ణువు శంఖచక్రాలు చెక్కివున్నాయి. నాభియందు పద్మము గలవాడు పద్మనాభుడు. స్థానిక తీర్థయాత్రా స్థలం.

రెండవ విజయ రామరాజుకు ఇంగ్లీషు వారికి 10-¯-1794 నాడు యుద్ధం జరిగిన చోటుగా చరిత్రలో దీనికి ప్రాధాన్యముంది.

**షమిడిపాడు :**

గుంటూరుజిల్లా నరసరావుపేట తాలూకా గ్రామం. పూర్వం ఇది అగ్రహార గ్రామం. ప్రభుత్వ రికార్డుల్లో కూడా ఈనాము గ్రామంగా నమోదైనది. శాసనాల్లో దీనిపేరు పహిండిపాడు.

శాసనం : స్వస్తి శకవర్షములు 1077 అగునేంటి జ్యేష్ఠ శుద్ధ 5 నాండు బోస్య కొడుకు గండిరాజ పహిండిపాటి శ్రీ చెన్నకేశవ దేవరల. [1]

ఈ పహిండి లేదా పమిడిని పైడిగా బంగారమనే అర్థంలో భావించి, ఈ గ్రామాన్ని స్వర్ణపురంగా సంస్కృతీకరించి శాసనంలో ప్రయోగించడం జరిగింది. అంతేగాక అగ్రహారశబ్దాన్ని కూడా మరింత సంస్కృతీకరించి ద్విజపురంగా పేర్కొనబడింది. మొత్తంమీద పమిడిపాడు స్వర్ణపురాహ్వయ ద్విజపురమయింది.

సోయం స్వర్ష పురాహ్వయే ద్విజవరగ్రామే రమావల్లభం సంస్థాప్య. [2]

నిజానికి ఇక్కడ బంగారంతో ప్రమేయం లేదు. పమిడి అనేది ఒక రకం మొక్క. పమిడి పత్తి తెలిసిందే. ప్రత్తిలో అదొక రకం. పమిడిముక్కల, పైడిపాల, పైడిపాక గ్రామాలు ఇలాంటివే. పదాదిన గల 'ప' కారం 'బ' కారమై, మహా ప్రాణమై, భమిడిపాడుగా రూపొంది ఇంటిపేరుగా నిలిచింది.

ఇది అగ్రహార గ్రామమని చెప్పడం జరిగింది. ప్రభువులు ఆయా విద్యలలో విశేష ప్రతిభ కనబరిచిన వారికి, విశిష్టమైన సేవలందించిన వారికి గ్రామాలను దానంగా ఇస్తుండేవారు. ఇలా ఇచ్చినవి బ్రాహ్మణులకయితే అగ్రహారాలని, ఇతరుల కయితే 'వరా'లని పిలిచారు. అందువలన అగ్రహారమంటే అగ్రవర్ణస్థులైన బ్రాహ్మణులకివ్వబడింది అని వ్యుత్పత్తి చెపుతారు. ఫలితార్థమిదే అయినా వ్యుత్పత్తి మాత్రం ఇదికాదు. అగ్రము అంటే మొదటిదే గాక చివర అనే అర్థం కూడా ఉంది. హారము అంటే భూఖండము. కుడుహారహార, గుద్రవార హార అని శాసన ప్రయోగాలు. ఫలితార్థం చివరి లేక మొదటి భూభాగము. అంటే గ్రామానికి ఒక చివర

1-2 No. 135, S. I. I. Vol. x

బ్రాహ్మణులకు వారి విధివిధానములకు వత్తిడి లేక, నెమ్మది కల్పించే నిమిత్తం, వారి ఆవాసవసతికి ప్రత్యేకించిన భూభాగం. అగ్రహారాలు మొదట బ్రాహ్మణులకే ఇవ్వబడ్డా అనంతర కాలంలో ఇతరుల కివ్వబడిన వాటిని కూడా అగ్రహారాలనే సంభావించారు. శాసనాల్లో ఒక వైశ్యాగ్రహార ప్రసక్తి వుంది.

తమిళులు ఈ అగ్రహారాలను చతుర్వేద మంగళాలుగా వ్యవహరించారు. అంటే చతుర్వేదాలు పఠన పాఠనములు జరిగేచోటు. బ్రాహ్మణావాసము అని అర్థం. ఇవిగాక కేవలం మంగళాలున్నాయి. తెలుగునాట నేడు చతుర్వేది మంగళాల వ్యవహారం లేదు. అగ్రహార వ్యవస్థా లేదు. కాని చరిత్రలో సామర్లకోటకు సమీపంలో వీరరాజ చోడ చతుర్వేది మంగళముండేదని శాసనాలవల్ల తెలుస్తోంది.

పమ్మి :

ఖమ్మం జిల్లా గ్రామం. పమ్మి చెడి పది ఊళ్లు అయిందని సామెత. ఏదో ప్రకృతి వైపరీత్యాలవలన పమ్మి నుండి జనం వలస వెళ్ళిపోయారు. అలా వెళ్ళిన జనం పది ఊళ్ళకు సరిపోయినంత మంది. దీనినిబట్టి పమ్మి ఎంత పెద్ద వూరో తెలుస్తుంది.

పమ్మి అనేది ఒక రకం మొక్క. జమ్మి తెలిసిందే. పమ్మి శబ్దానికి అలముకొను అనే అర్థం సాహిత్యంలో ఉంది. పమ్మిన శ్రీ వేంకటేశుడు అని అన్నమయ్య. భావాన్ని అర్థం చేసికొనుటకు అలముకొను అని చెప్పడం జరిగిం తప్ప నిజానికి అలముకొనుట వేరు. పమ్మికొనుట వేరు. కమ్ముకొనుట వేరు. దే అర్థాలు దానికుంటాయి. నిజానికి పదాలకు సమానమైన పదాలుండవు. పదానికి భావముంటుంది. భావానికి వాగ్రూపంపదం. మనం సాధారణంగా అర్థాలనుకునేవన్నీ, బోధపడని పదానికి, బోధపరచుకోడానికి ఆసరాగా తెచ్చుకున్న అంతకుముందే తెలిసిన శబ్దాలు-కాకపోతే పర్యాయ శబ్దాలుంటాయి. అంతేతప్ప సమానపదాలుండవు.

ఇక పమ్మికి మూలరూపం పాము. పాముట అంటే తెలుస్తుంది. రుద్దుట, రాయుట, పాముట. ఇప్పుడు అర్థమయి వుంటుంది. మృదువుగా స్పృశిస్తూ వ్యాపనం చేయడం పాముట. అయితే పులమడం వేరు. అన్నమయ్య అంటోంది పాముటను గూర్చి. అచ్చతెలుగు శబ్దాలను సమమైన భావనలో ప్రవర్తింపజేయడంలో అన్నమయ్యకు సాటి మరొకరులేరు. దీనినే శబ్దాధికారమంటారు. అది అలా వుంచుదాం. సర్పాన్ని పాము అనడం తెలిసిందే. అది అలా చలిస్తుంది గనుక

దానికా పేరు. అంటే పాకుకుంటూ, భూమిని మృదువుగా తాకుతూ వెళుతుంది గనుక అది పాము. ఏమైనా ఈ శబ్దంలో వ్యాపనమనే భావన వుంది. అలాంటి వ్యాపన స్వభావంగల మొక్క పమ్మి. అవి అధికంగా వున్నచోట వచ్చిన జనావాసం గనుక దానికా పేరు వచ్చింది.

పరిమెళ్ళ :

పశ్చిమ గోదావరిజిల్లా గ్రామం. పరిమి ఎళ్ళల కలయిక పరిమెళ్ళ. పరిమి అనేది ఒక చెట్టు. (Carissa species) దీనిలో రెండు రకాలున్నాయి. ఒకటి ఉష్ణప్రాంతాల్లో పెరిగే చిన్న ముళ్ళచెట్టు. రెండవది తుప్పగా పెరుగుతుంది. కంచెగా కూడా వేస్తారు, ఎళ్ళ, నూజెళ్ళ, ఏజెళ్ళ, రావెళ్ళ లాంటి గ్రామాల్లోని ఎళ్ళ ఇలాంటిదే. భూభాగ సూచితం.

ఇక గుంటూరు జిల్లాలో పరిమి పేరుతో రెండు గ్రామాలున్నాయి. తాడి కొండకు సమీపంలోని పరిమిని పెద పరిమియని, తెనాలికి సమీపంలోని పరిమిని చినపరిమి అని అంటారు. పెదపరిమికి పందుల పరిమి అని, చినపరిమికి జంగాల పరిమి అనే పేర్లుకూడా వున్నాయి. జంగాలు అనబడే శైవులు మొదట అక్కడ నివాస ముండడంవలన అది జంగాల పరిమి అయింది.

పలాస :

శ్రీకాకుళం జిల్లా గ్రామం. ఇది పలాస (Butea froudosa Roxb) వృక్ష సంబంధ నామం. మోదుగ చెట్టునే పలాస అంటారు. పలాస ప్రాంతాన్ని ఉద్దానం (ఉద్యానవనం) అని అంటారు.

పలుగురాళ్ళపల్లి :

కడపజిల్లా బద్వేలు తాలూకా గ్రామం· భూమిని త్రవ్వే పనిముట్టు 'పలుగు'కు దీనికి సంబంధంలేదు. వాస్తవాని కిది పలుకురాళ్ళపల్లి. పలుకురాయి అంటే తెలుస్తుంది. జమ్మలమడుగు తాలూకాలో మరొక రాళ్ళపల్లె వుంది. అది సున్నపు రాళ్ళపల్లె. వివక్ష ఎందుకు అవసరమైనదో తెలుస్తోంది గదా !

ఈ ఊరి సమీపాన రెండు మైళ్ళ దూరంలోగల చిన్న కొండమీద పాడుబడ్డ భైరవాలయ ముంది. అక్కడ సకలి పెదకోడూరు అనే గ్రామమున్నట్లు శాసనం వలన తెలుస్తోంది. మరొక కోడూరు ఇదే తాలూకాలో ఉంది. కాగా రాజంపేట తాలూకాలోని కోడూరును రైల్వే కోడూరంటారు. కారణం రైల్వేస్టేషనుండటమే. పలుకురాతిపాలెం అనే గ్రామం పశ్చిమ గోదావరి జిల్లాలోంది·

**పాచ్ఛానగరం :**

పశ్చిమ గోదావరిజిల్లా గ్రామం. పాదుషాహీనగరం పాచ్ఛానగరమయింది. ఇది నైజాం నవాబుల కాలంలో వచ్చిన గ్రామం.

**పాణ్యం :**

కర్నూలు జిల్లా గ్రామం. శాసనాల్లో 'పానెము'గా వ్యవహరింపబడింది. పానారసీమ అనేది ఒక సీమ పేరు. పానగల్లు ఒక ఊరిపేరు. పాన శబ్దం పాణ సంబంధి గావచ్చును. అప్పుడు పాడి పూర్వరూప మవుతుంది. పాడి పేరుతో గ్రామాలున్నాయి. ఉదా : మేల్పాడి. బహుశా ఇది ఒక మొక్కగావచ్చును. ఇక్కడి అధిష్ఠాన దైవాన్ని పాణికేశ్వరస్వామిగా సంభావిస్తారు.

**పాయకరావుపేట :**

విశాఖ జిల్లా గ్రామం. ఫాయక్ అనే ఉర్దూ పదానికి బిరుదు అని అర్థం. యుద్ధభూమిలో అగ్రభాగాన నిలిచేవాడని శబ్దార్థం. క్రీ.శ. 1676లో విజయనగర పాలకుడు తానీషాపై తిరుగుబాటు చేశాడు. ఆ తిరుగుబాటును అణచివేయడంలో అక్కన్న మాదన్నలు అప్పలరాజు అనే వ్యక్తిసాయమర్థించారు. అతడు చేసిన సాయానికి కృతజ్ఞతా సూచకంగా అతనికి ఫాయక్‌రావు అనే బిరుదు నిచ్చారు. ఆ బిరుదు నామంతో ఏర్పడినదే ఈ పాయకరావుపేట. అనకాపల్లి జమీందారులకిది బిరుదు నామంగా ప్రవర్తిల్లింది. ఆ తాలూకాలో పాయకరావు బోనంగి అనే గ్రామం కూడా వుంది.

**పాలకొల్లు :**

పశ్చిమ గోదావరి జిల్లా నరసాపురం తాలూకా గ్రామం. పాల, కొలనుల కలయిక పాలకొలను. పాలశబ్దం గ్రామనామపరంగా, క్షీరశబ్దార్థ సంబంధికాదు. ఇది ఒక రకం కంచెమొక్క. పాలకాడ, పాలతీగ (Ipomaea hispida R.s) పేరులతో కూడ కొన్ని మొక్కలున్నాయి. అలాగే పాలచెట్టు (Mimusops hxaenadra Roxb) పాలకొడిశె, (Halorrhena antıdysenterıa wall) పాలచెంప

పాలటొంత, పాలలం (Tylophova asthamdica WOA) అనే మొక కూడా వున్నాయి.

ఇక కొలను, కొల్నుగా మారి కొల్లుగా స్థిరపడింది.

"పాలుకొల్ని ఊరు ఇశాన్యమునందలి...." [1]

ఈడుప్పగల్లులోని కల్లు కూడ కొలను శబ్ద సంబంధి యని ముందు చెప్ప జరిగింది. ఈ పాలకొల్లు సమీపాన పాలేరు పేరుతో ఒక ప్రవాహముంది. దాని వ కూడ ఈ పేరు ఏర్పడియుండవచ్చు. అప్పుడుకూడ పాల శబ్దం వృక్ష సంబంధి వెలగలేరు, వెలగలపాయ, వెలగపూడిలోని వెలగ కూడ మొక్క మాత్ర పాలపర్రు, పాలకుర్రు అనే గ్రామాలు కూడా వున్నాయి.

కాని పాల శబ్దాన్ని క్షీర సంబంధిగా భావించి పాలకొల్లును క్షీరారామమ క్షీరారామేశ్వరమని క్షీరారామపురమనే విధంగా సంస్కృతీకరించడం జరిగింది.

"క్షీరారామేశ్వర శ్రీమన్మహాదేవరకు...." [2]

"క్షీరారామమంద్దు గుడి గట్టించి...." [3]

పిన్నెలి :

పల్నాడు తాలూకా గ్రామం. శాసనాల్లో దీన్ని పింగళి. కన్నడంలో పిన్ని (Urostigma retusum reiquel) పేరుతో ఒక మొక్క వుంది. ఇది ఒక మొక్క. ఇచ్చటి దైవం రామలింగేశ్వరుడు. పిన్నింటి గృహనామం దీనిమీదుగా ఏర్పడిందే.

పుట్టరేణిగుంట :

తిరుపతికి సమీపంలోని రేణిగుంట వేరు. ఇది వేరు. రెండూ చంద్రగిరి తాలూకాలోనివే. చర్చలోని రేణిగుంట అద్దెకు తీసుకున్న గ్రామం. రైల్వే స్టేషను గలది అగ్రహారగ్రామం. గుంటసీటిపల్లంగా తెలిసిందే. ఇంతకు పూర్వం వివరింపబడింది. రేణి ఒకరకం మొక్క. ఉత్తరేణి తెలిసిందే. రేణిమాకులపల్లె, మదనపల్లె తాలూకాలో

1 No. 155, S. I. I; Vol. v

2 No. 120, S. I. I; Vol. v

3 No. 130, S. I. I; Vol. v

ఉంది. ఇందలి పుట్ట శబ్దం 'చిన్న' అనే అర్థమిస్తుందిది. వెనుక పుట్టగుంట వివరింప బడింది.

## పుత్తూరు :

చిత్తూరు జిల్లా గ్రామం. పుత్తూరు రాజులు ఎముకల వైద్యంలో బహు నిపుణులు. పుత్తు ఊరుల కలయిక పుత్తూరు. పుత్తు శబ్దానికి కొత్త అని అర్థం. దట్టమైన అరణ్యమని మరొక అర్థం. సందర్భాన్నిబట్టి అర్థం గ్రహించాలి. పెద్ద పుత్త, చిన్న పుత్త అనే గ్రామాలు కూడ వున్నాయి. పుదుచ్చేరి, పుత్తేరి కూడా ఇలాంటివే. కోయంబత్తూరు వాస్తవానికి కోయంపుత్తూరు. తమిళనాడులో చాల పుత్తూరులున్నాయి.

## పులిగడ్డ :

ఇది కృష్ణాజిల్లా గ్రామం. ఇక్కడే కృష్ణ రెండు పాయలుగా చీలుతుంది. పులి శబ్దం జంతు సూచిగా తెలుసు. ఆ భావన నుండి ఆధిక్యము, గొప్ప (పులి లాంటి వాడు) అనే అర్థాలు కూడా వున్నాయి. గ్రామ నామంలోని పులి పైవాటితో సంబంధ మున్నది గాదు. గడ్డ పూర్వం భూమి సంబంధిగా చెప్పతం జరిగింది. పులిగడ్డ అంటే సాగుచేయబడని భూమి, అనాది బంజరు అని అర్థం. ఇది ఆ గ్రామ మేర్పడినప్పటి మాట. ఇప్పుడిది సుక్షేత్రమే.

ఇక పులివెందుల, పులిచింతలలోని పులి కూడా జంతు సూచిగాదు. అవి ఒకరకం మొక్కలు. ఇంకాపులి శబ్దం పుల్లేరులో కన్పిస్తుంది. ఇక్కడ పులి అంటే మురికి. పులు కడిగిన ముత్యం అనే మాట విని వుంటారు. ఫలితార్థం పుల్లేరు అంటే మురుగుకాల్వ. ఈ పుల్లేరును సంస్కృతీకరించి మలాప హారిణి అవి కూడా సంభ వించడం జరిగింది. ఆంధ్రదేశంలో చాల చోట్ల పుల్లేరు పేరుతో సహజ ప్రవాహాలు కన్పిస్తాయి. గుంటూరు జిల్లాలో కొండపీటివాగు అని పిలవబడుతున్న దాని అసలు పేరు పుల్లేరే. ఇక్కడ పులిని జంతువుగా భావించి వ్యాఘ్రనది అని సంస్కృతీకరించి శాసనాల్లో ప్రయోగించారు. పశ్చిమ గోదావరి జిల్లాలో పుల్లేటికుర్రు అనే గ్రామ ముంది.

**పులివెందుల :**

కడపజిల్లాలో ఆ పేరు గల తాలూకాకు కేంద్రస్థానం. దీని శాసనస్థ నామం పులిపిండుల. ఇల్లిందలతో పోల్చిచూడండి. ఇది ఒకరకం మొక్క అనిచెప్పడం జరిగింది. వ్యవహారంలో పులివెందుల అయింది.

**పుల్లలచెరువు :**

మార్కాపురం తాలూకా గ్రామం. పుల్లాపుడకలోని పుల్లతో దీనికి సంబంధం లేదు. దీని శాసనస్థనామం పులచెర్వు, పుల్లంకి ఒకరకం కంచె మొక్క. తమిళంలో పుల్లకుడురు (Terminalia paniculata) అనే చెట్టు వుంది. గంగయసాహిణి అను నతడు, తనకు, తన ప్రభువైన కాకతి గణపతిదేవునికి అభ్యుదయ పరంపరాభి వృద్ధి నిమిత్తము ఈ గ్రామాన్ని త్రిపురాంతకదేవునికి ధారపోశాడు. అదే చోట ఈ గ్రామం మొట్టవాడి నాటి లోనిదిగా చెప్పబడుతుంది. మార్కాపురం ప్రాంతాన్ని మొట్టవాడినాడుగా వ్యవహరించారని పూర్వం చెప్పడం జరిగింది.

**పుసులూరు :**

ఈ పేరుతో గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలోను, కర్నూలు జిల్లా నంద్యాల తాలూకాలోను గ్రామాలున్నాయి. కంటి నుండి వెలువడే వ్యర్థ పదార్థంగా పుసి అనే పదం వాడుకలో ఉంది. అదే అర్థంతో ఈ గ్రామ నామ మేర్పడింది. అంటే పంటలకు అనువైన భూమి కానిది అనే అర్థంలో భావించాలి. అయితే ఈ పనికి రాకపోవడమనేది కాలాన్ని బట్టి ఉంటుంది. సాగర్ కాల్వ వచ్చిన తరువాత గుంటూరు జిల్లా గ్రామం సుక్షేత్రమయింది.

**పూసపాటిరేగ :**

విజయనగరం జిల్లా గ్రామం. విజయనగరాన్ని ఏలిన గజపతులు పూసపాటి వారు. వారికి సంబంధించిన రేగు కనుక ఇది పూసపాటిరేగ. రేగ నేల స్వభావాన్ని పట్టి ఇస్తుంది. రేగడి నేల తెలిసిందే. ఇదే జిల్లాలో రేవిడి (రేగడి) అనే గ్రామం కూడ వుంది. రేగ శబ్దంతో గల మరొక గ్రామం భూపాలరాజు రేగ. కనుకనే పై విధంగా వివక్ష ఏర్పడింది. ఇక పూసపాడు అనే గ్రామం గుంటూరు (ప్రస్తుతం ఒంగోలు)

జిల్లాలో ఉంది. పూస పూరి, పూస కామంచి గడ్డి పేరుతో కలుపుమొక్కలున్నాయి. పూషదం కూడ ఒక రకం చెట్టు. కృష్ణాజిల్లాలో ఒక గ్రామం పేరు కూడా.

## పెండ్యాల :

నల్లగొండ జిల్లా గ్రామం. పెండ ఆలం కలయిక పెండలం. పెంట, పెండ, పేడ, పెద్ద, బెద్ద ఇవన్నీ ఒకే మూల ధాతువు నుండి ఏర్పడ్డాయి. అయితే ఈ గ్రామనామంలోని పెండ, పెంట నుండి ఏర్పడింది. లోగడ వివరించిన పెంట, పశువులను మందవేసే స్థలంగా చెప్పినది, ఇది ఒకటి కాదు.

ఆల, అల శబ్దాలున్నపుడు అవి వృక్ష సంబంధులని చెప్పడం జరిగింది. ఇక్కడ కూడా అదే వర్తిస్తోంది. పెంటారు అనేది ఒక రకం కలుపు మొక్క. తెలంగాణా జిల్లాల్లో పెరుగుతుంది. పెంటుంట (Hibiscus speclıs) అనేది అడవిగోగు జాతికి చెందిన కలుపుమొక్క. ఈ రెంటిలో దేనినుండైనా ఇది వ్యుత్పన్నమై యుండవచ్చును. వ్యవహారంలో మధ్యగల 'ట' కారం 'డ' కారమైంది. పెండ్యాల, పెంట్యాల ఇంటిపేరుగా కూడ కన్పిస్తాయి. అంట్యాల కూడా ఇలాంటిదే.

## పెదకళ్ళేపల్లి :

కృష్ణాజిల్లా దివితాలూకా గ్రామం. చిన్న కళ్ళే పల్లి అనే మరో గ్రామం ఉండడం కారణంగా ఈ వివక్ష అవసరమైంది.

శాసనం : రాచగురు దేవర కొడుకు జ్ఞానోత్తమ శివదేవరలు కదలుపల్లి నాగేశ్వర దేవరకు .. [1]

సుప్రతిష్ఠిత దివ్యలింగమైన కదలు పురి నాగేశ్వర శ్రీ మహా దేవరకు....[2]

దీని శాసన రూపాలు కదలుపల్లి, కదలుపురి అంటే సముద్ర సమీపంలోని పల్లె అని అర్థం. కదలి పేరుతో ఒక గ్రామం తూర్పు గోదావరి జిల్లా రాజోలు తాలూకాలో గలదు. కళ్ళేపల్లి పేరుతో మరో గ్రామం శ్రీకాకుళం జిల్లాలో ఉంది.

[1] No. 86, S. I. I; Vol. vi

[2] No. 81, S. I. I; Vol. vi

పెదనింద్రకొలను :

పశ్చిమ గోదావరి జిల్లా గ్రామం. చిననింద్రకొలను అనే గ్రామం కూడా ఈ జిల్లాలో ఉంది. 'చిత్తూరు జిల్లాలో నింద్ర అనే గ్రామముంది. పరిమాణ భేదం వలన పెద్ద, చిన్న అనే విశేషణాలు వచ్చాయి. కొలను శబ్దం తెలిసిందే. నింద్ర అంటే ఒక రకం గడ్డిమొక్క. దీనినే నేరడుగడ్డి (Enginia jambolona Lamk) అని కూడా అంటారు. చూడటానికి వరిమొక్క వలె వుంటుంది. దుబ్బు చేస్తుంది. దీనికి గల మరో పేరు నేంద్రగడ్డి. (Dschalmum laxum. R. Bv).

పెద్దబ్రహ్మదేవం :

తూర్పు గోదావరి జిల్లా కాకినాడ తాలూకాలో, విశాఖ రైలుమార్గంలో ఉంది పెద్ద అనేది వివక్షకొరకు వచ్చింది. బ్రహ్మదేవం, బ్రహ్మదేయ శబ్ద సంబంధి. అంటే బ్రాహ్మణుల కివ్వబడినదని అర్థం. ఇలాంటివే దేవదేయం. అంటే దాని కివ్వబడింది. దేయ మంటే ఇవ్వబడింది, దాయమంటే వంతు, పాలు, భాగము అనే అర్థా లున్నాయి. ధర్మదాయమంటే సత్రములు మొదలైన వాటి నిర్వహణ కొరకు ఇవ్వ బడింది. దేవాదాయ, ధర్మాదాయ మనడం సరికాదు. దేవదాయ, ధర్మదాయ మనడం సరియైనది. బ్రాహ్మణుల కివ్వబడినది, అగ్రహారమనే భావనలో బ్రహ్మదేయం ప్రవర్తితమైనది. బ్రహ్మదేవమనే మరో గ్రామం నెల్లూరు జిల్లాలో వుంది. కేవలం దేవ శబ్దంతో ఒక గ్రామం పశ్చిమ గోదావరి జిల్లాలో ఉంది.

పెనగలూరు :

కడప జిల్లా గ్రామం. పెనగలు, ఊరుల కలయిక పెనగలూరు. పెనగలు జాతి సస్యం. ఇనగలూరు కూడా ఇలాంటిదే కావచ్చును. ఈ పెనగలూరు గ్రామానికి ఎల్ల మరసు సముద్రమనే పేరున్నట్లు శాసనాధారముంది. ఎల్ల మరసు లోని అరసు అంటే రాజు. కన్నడ శబ్దం. లోగడ తిమ్మరుసు వివరించడం జరిగింది. ఫలితార్థం ఎల్లం రాజు సముద్రం. ఇక్కడ సముద్రం చెరువుకు పర్యాయపదం. ఈ గ్రామాన్ని ఎల్లమరుసుసముద్రం అనే పేరుతో, మట్ల తిరుమలరాజు బ్రాహ్మణులకు దానమిచ్చాడు. ప్రస్తుత నామం పెనగలూరు మాత్రమే. నాగిరెడ్డిపల్లె దీని శివారు గ్రామం. ఇప్పటికీ పై చెరువే ఈ రెండు గ్రామాల సేద్యానికి ఆధారం.

పెనమకూరు :

ఇది కృష్ణాజిల్లా గ్రామం. పెనమ, కుర్రుల కలయిక పెనమకూరుగా పరిణమించింది. భోజరాజీయ కర్త అనంతామాత్యుడు విలసితంబగు "కృష్ణవేణీ మలాపహారిణి భీమరథి నా దరిత్రియందు దనరు నదీ త్రయాంతర్వేది యగు సవనక్షేత్రమున శోభనముల కెల్ల ధరణివాసంబగు పెరుమగూరు పురంబు" అని ఈ పెనమకూరును తన తాత తండ్రుల నివాసంగా పేర్కొన్నాడు. భీమరథి యని ముద్రించుట పొరపాటు. అది భీమనది. కృష్ణవేణి తెలిసిందే. మలాపహారిణి పుల్లేరు. దీనిని గూర్చి ఇంతకు పూర్వం కొంత చెప్పడం జరిగింది. ఇక భీమనది, లేక భీమేరు లేక భీమ్మరు అనేది నేడు పెదపూడికి బయట ప్రవహిస్తున్న మురుగుకాల్వ. ఇది, గుండేరు, లంజ కాల్వ, ఈ మూడు ఒకప్పటి కృష్ణానది ప్రవాహాలే. పెరుమగూరు అనడం కూడ పొరపాటే. ఇవి రెండూ అనంతరకాలంలోని వ్రాయస కాండ్ర పొరపాట్లు కావచ్చును. పెనమ అనేది ఒక రకం మొక్క. ముందు పెనగ వివరించడం జరిగింది. పేనారి అనే పేరుతో కన్నడంలో ఒక చెట్టు ఉంది.

అనంతమాత్యుని నివాసస్థలాన్ని గూర్చి పూర్వాసమీక్షకులు సందేహాస్పదముగా వ్రాయుట, వారికి గ్రంథపరిచయమే తప్ప గ్రంథస్థ ప్రాంతాలతో పరిచయం లేకపోవడమే.

ఇక పుల్లేరును గూర్చి మరికొంత వివరణ. మురుగు ప్రవాహాలను పుల్లేరు లనడం పరిపాటి అని ముందు చెప్పడం జరిగింది. ఉయ్యూరుకు ప్రక్కగా మద్రివాడ, పామర్రుల మీదుగ నేడొక పుల్లేరు, పంటకాలువగా ప్రవహిస్తోంది. కాని చర్చలోని పుల్లేరు ఇది కాదు. ఏనుగులకోడు స్థానికులకు తెలుసు. అది పుట్టినచోటు నుండి తూర్పుకు ప్రవహిస్తూ నిమ్మకూరు (నిమ్మకుర్రు) ను చుట్టి ఇంకా దిగువకు ప్రవహించి, నిడుమోలుకు దిగువ బందరు బెజవాడ రోడ్డును దాటి, గుడ్లవల్లేరు, కవుతరంవైపుకు ప్రవహించి సముద్రంలో కలిసేది. ప్రస్తుతం ఈ ప్రవాహభాగం పంటకాలువగా మారింది. కృష్ణపై ఆనకట్ట కట్టిన తరువాత తూర్పు కృష్ణా ప్రాంతపు భూభౌతికస్థితిలో చాల మార్పు వచ్చింది. నిడుమోలు తరకటూరు (తరక-ట్టుర్రు) ప్రాంతాలలో సముద్రంలో నుండి పడవలు రావడానికి ఒక కాలువ ఘంటశాలవరకు ఉండేది. ఈ రేవులలోనికి వచ్చిన పడవలపై సుంకాలు వసూలు చేసేవారు. దాని ప్రక్కన ఉండేది కరపట్నం. శ్రీనాథుడు తన జన్మస్థలంగా పేర్కొన్న కరపట్నం

ఇదే గావచ్చును. ఆయన బావమరిది దుగ్గన ఇంటిపేరుకు ఆకరమైనదగ్గుమల్లి (దగ్గుపల్లి) దీనికి సమీపగ్రామమే. ఇక్కడ దగ్గుమల్లిని ఇంటిపేరుగా గాక దుగ్గన నివాసస్థలంగా గ్రహించడం ఉచితం. శాసనాల్లో చాలచోట్ల ఆయావ్యక్తులపేర్లు చెప్పిన చోట చెప్పిన గ్రామాలు వారి నివాస గ్రామాలే ననే విషయం తెలిసిందే. అవే తరువాత ఇంటి పేర్లుగా పరిణమించాయి. కృష్ణపై ఆనకట్ట కట్టించినవాడు సర్ ఆర్థన్ కాటన్ దొర. కాగా పంటకాలువల తీరుకు బాధ్యుడు 'ఆర్' అనే దొర.

## పెనమలూరు :

విజయవాడ సమీపాన గల గ్రామం. శాసనాలలో పినమల్లూరుగా పేర్కొన బడింది.

శాసనం : "స్వస్తిశ్రీ శక వర్షంబులు 1185 గునేంటి మాఘ బహుళల 15 బుధ వారానం పినమల్లూరి ముత్తిరెడ్డి కొడుకు .." [1]

పినమల్లుడనే వ్యక్తిపేరు మీదుగా ఏర్పడిన గ్రామం. లేక మల్లూరు అనే గ్రామం మరొకటి వుంటే, పరిమాణంలో దానికంటె చిన్నది అవడం చేత కూడా ఇది పినమల్లూరు కావడానికి అవకాశముంది. అయితే సమీపంలో మద్దూరు తప్పమల్లూరు కనిపింపదు. మల్లశబ్దం, మల్లికార్జున శబ్దసంబంధి. శ్రీశైలంలోని అధిష్ఠానదైవానికి మల్లికార్జునుడని పేరు. మల్లయ్య, మల్లమ్మ, మల్లికార్జున, మల్లేశ్వర మొదలైన )ధంగా తెలుగువారి వ్యక్తి నామాల్లో మల్ల శబ్దం కనిపిస్తుంది.

## పెనుగంచిప్రోలు :

కృష్ణాజిల్లా నందిగామ తాలూకా గ్రామం. ఇంతకు పూర్వం కొండ కంచి (కొణకంచి) వివరించడం జరిగింది. అదే ఇక్కడ వర్తిస్తుంది. ప్రోలు కూడ ముందు వివరింపబడింది. శాసనాల్లో ఇది బృహత్కాంచీపురంగా సంస్కృతీకరింపబడింది. శాసన కాలము శాలివాహన శకం 1169. దీనికి 78 సంవత్సరాలు కలుపుకుంటె క్రీస్తుశకం అవుతుంది.

[1] No. 746, S. I. I. Vol. iv

పెనుమూలి :

తెనాలి తాలూకా గ్రామం. శాసనస్థనామం పెనుంపులువు. ఇది బలివెలాంటిది. ఒక రకం మొక్క. ఇదే శాసనంలో కాట్యవరం, గుండిమడ, పినరావూరు గ్రామాలు పేర్కొనబడినవి. ఈ కాట్యవరం నేటికతెవరం. కాటయవేముని (కుమారగిరిరెడ్డి బావమరిది) పేరుమీదుగా ఏర్పడింది. గుండిమడ నేటిగుండిమెడ. గుండిమడ పల్లపునేలలో పెరిగేవృక్షం. నాటి పినరావూరు నేటి చిర్రావూరు. పెదరావూరు తెనాలి తాలూకాలోనిది.

పొత్తూరు :

గుంటూరుజిల్లా గ్రామం. పొత్తూరి వారి తోట గుంటూరు పట్టణంలో ఒక భాగం. ఇది పొత్తూరి ఇంటిపేరు మీదుగా ఏర్పడింది. ఇక చర్చలోని గ్రామం, శాసనాల్లో, పొత్తూరుగా పేర్కొనబడింది. పాందువ్వ అనే గ్రామముంది. లోగడ పమ్మిని వివరించినపుడు పాము వివరింపబడింది. పాముదుర్తి, పాములపర్తి అనే గ్రామాలున్నాయి. వానపాముల, ఆటికపాముల, కలువపాముల అనే గ్రామాలు కూడా వున్నాయి. వీటితో పోల్చి చూసినవుడు ఇది పొంతుర్రుగా భాసిస్తోంది. పామర అనేది ఒక రకం మొక్క. తుర్రు ముందు వివరింపబడింది.

పొన్నూరు :

గుంటూజిల్లా గ్రామం. దీనిని సంస్కృతీకరించి స్వర్ణపురి అని వ్యవహరించారు. దీనికి కారణం పొన్ను (కన్నడంలో హొన్ను) శబ్దానికి బంగారమనే అర్థ వుండడం బంగారాన్ని స్వర్ణ మంటారు గనుక ఇది స్వర్ణపురి అయింది.

నిజానికి దీని పేరు పొరనూరు. ఈ మేరకు శాసనస్థాధారాలున్నాయి. పొరనూరు కాలక్రమంతో పొన్నూరయింది. పొర అంటే పొరుగు. అంటే నిడుబ్రోలు లేక స్థానిక ప్రవాహమైన తుంగభద్రకు పొరుగున వుండడం వలన ఇది పొరనూరు. పొర (కాగితం పొర) పొరబడు, పొరపాటు శబ్దాలలోని పొర- ఇవన్నీ పొర నుండి ఏర్పడినవే. ఆంగ్లంలోని పేజి (Page) అనే పదాన్ని తెలుగులో పొరట అనడం కద్దు. పొరలు, పొరలుగా వున్నవి గనుక అవి పొరటలు. పాటు సమంగా పడకపోవడం వలన అది పొరపాటు. ఇరుగు పొరుగులోని ఇరుగు సరిగా

ఇంటి ప్రక్కను (ఏప్రక్క అయినా) సూచిస్తుంది. కాగా పొరుగు, ఇరుగుకు ప్రక్క నున్నది. అంటే మూలధాతువు ఒకటే అయినా వ్యవహారాను కూల్యతను బట్టి వేరువేరు అర్థచ్ఛాయల్లో పదాలు రూఢ్యమవుతాయి. లోగడ చెరశబ్దం వివరింపబడింది. ఇలాంటిదే చేమ. చెమ్మ, చెమట, చీము, చీమడి; చిమ్మిరి లేక చిమ్మిలి. నీ చిమ్మిరతిబిగువు అని అన్నమయ్య అన్నింటిలోను వున్న భావం ఒకటే, తేమ అనేదే.

## ప్రాసంగులపాడు :

గుంటూరు జిల్లా గ్రామం. వరిధాన్యంలో ఒకరకంగా పరిగణింపబడే 'బసంగి' ప్రాసంగి నుండి వ్యుత్పన్నమయినదే. ఫలితార్థం వరిపండే చోటు. వరిధనం అనే పూరు కూడ వుంది.

## ప్రొద్దుటూరు :

కడపజిల్లాలోని ఆ పేరు గల తాలూకాకు కేంద్రస్థానం. ఇప్పటి వ్యవహారమిదే. కాని శాసనాల్లో దీనిని రామేశ్వరం పొదటూరుగా వ్యవహరించారు. రామేశ్వర గ్రామానికి సమీపంలోనిదిగనుక అలా చెప్పబడింది. అంటే మరో ప్రొద్దుటూరుండాలి. దానిని పులి ప్రొద్దుటూరు అంటారు. ఇందలి ప్రొద్దు శబ్దం, సూర్యుడు, కాలము అనే అర్థాలలోకాక, పొద (శాసనంలో అదే పేరుంది) శబ్దంతో పోల్చి చూడాలి. పొదిలి అనే గ్రామం కూడా వుంది. మొక్కల గుబురులను పొదలనడం తెలిసిందే. అలాగాక పొద శబ్దంతో ఒక మొక్క ఏదైనా వుండివుండాలి. పొదటూరులోని 'టు' ఆగమంకాదు. పొదట్రుు పొదటూరు అయింది. ట్రుుకూడ, తుర్రు, మిర్రు, పర్రులతో పోల్చి చూసినపుడు భూ స్వభావ సూచిగా బోధపడుతోంది. ఇదే జిల్లాలో జమ్మలమడుగు తాలూకాలో తాళ్ళప్రొద్దుటూరు అనే గ్రామముంది. కేవలం ప్రొద్దుటూరు పేరుతో కృష్ణాజిల్లాలో ఒక గ్రామముంది.

## ఫిరంగిపురం :

గుంటూరుజిల్లా గ్రామం. ఇందలి 'ఫిరంగి' శబ్దం మందుగుండు పేల్చే సాధనమైన ఫిరంగి కాదు. నిజానికి దీని పేరు ఫరంగిపురం. వాడుకలో ఫిరంగిపురమయింది. క్రీ.శ. 1751-1758 మధ్య కాలంలో ఫ్రెంచి సైనికదళాలు కొండవీడులో మకాం వున్నాయి. వారు విదేశీయులు. విదేశీయ శబ్దాన్ని సూచించే ఆంగ్లపదం

ఫారిన్, రోమను లిపిలో forign అని వ్రాస్తారు. దాన్ని లిప్యంతరీకరణం గావించి వ్యవహరించడంతో ఫరంగి అయింది. అనంతరం ఫ్రెంచి జెసూట్ మిషనరీలు దీనిని స్థావరం గావించుకున్నారు. 1782-84 మధ్య రేపల్లె జమీందారులు, ఫాదరీలకు దీనిని కౌలు కిచ్చినట్లు తెలుస్తోంది. పురం తెలిసిందే.

ఇక ఈ గ్రామంలో ఒక విశేషముంది. జిల్లా మొత్తంలో ఏ గ్రామంలోను కన్పించని వ్యత్యాసం వాతావరణపరంగా ఈ గ్రామంలో కన్పిస్తుంది. వేసవి, చలి కాలాల్లో ఉష్ణోగ్రతలో వ్యత్యాసముండడం సహజమే. అయితే ఇక్కడ ఆ వ్యత్యాసం చాల అధికం. కారణం ఇది కొండవీడు కొండలశ్రేణిలో ఉత్తర భాగాన వుంది. అందువల్ల ఉత్తరాయణంలో మే, జూన్ మాసాల్లో విపరీతమైన ఎండ. కారణం కొండలపై పడిన ఎండవలన రేడియేషను అధికం గావడం. ఇక దక్షిణాయనంలో విపరీతమైన చలి. కారణం కొండ అడ్డుగా వుండడంవలన సూర్యదర్శనం చాల ఆలస్యమవుతుంది.

ఐచ్చలికూరపాడు :

ఇది పొదిలి డివిజనులో వుంది. ఐచ్చలి (Portulaca oleracia, Lidn) ఒకరకం కూరాకుగా తెలుసు. కూరపాడు పేరుతో ఇంకా గ్రామాలున్నాయి. తోటకూరపాడు, కొయ్యగూరపాడు మొదలైనవి.

తోటకూరలో పెరుగుతోటకూర, కొయ్యతోటకూర అని రెండు రకాలున్నాయి. పెరుగుతోటకూరకు సంస్కృతంలో రాజశాకమని పేరు. దాని పోషక విలువలనుబట్టి దానికాపేరు వచ్చింది. పెరుగుతోటకూరలోని పెరుగు, దధ్యర్థంలో గల పెరుగు (పాలు, పెరుగు)తో సంబంధమున్నదికాదు. ఇది పెరుకు. సమూలంగా భూమినుండి వేరుచేయబడేదని అర్థం. ఈ పెరుకు వ్యవహారంలో పెరుగు అయింది. ఇక కొయ్యతోటకూరలోని కొయ్య, కోయు శబ్ద సంబంధియే తప్ప కఱప అనే అర్థంలోనిదికాదు. దీని ఆకును మాత్రమే కోసుకుంటారు. మళ్ళీ మళ్ళీ చిగురిస్తుంది. పెరుగుతోటకూర కూడా గిల్లుకోవచ్చు. మొదటి పర్యాయమంత నేవళంగా తరువాతి దుండదు. అందువల్ల దానిని సమూలంగానే గ్రహిస్తారు.

ఇక బచ్చలిమొక్క బచ్చలి, తీగెబచ్చలి పుల్లబచ్చలి అనే రకాలున్నాయి. పుల్లబచ్చలిని చుక్కకూర అని కూడా అంటారు.

**బట్టిపాడు :**

దరిశి తాలూకా గ్రామం. బట్టి అనేది ఒకరకం మొక్క. బట్టి గరిక అంటే తెలియవచ్చును. బట్లాకు, బట్లలం అనే కలుపుమొక్కలు కూడ వున్నాయి. ఈ గ్రామానికి సింగరికొండ అనే పేరున్నట్లు శాసనంవలన తెలుస్తోంది. ఇది కొచ్చెర్ల కోట సీమలోనిదిగా శాసనంలో చెప్పబడింది. సింగరి, సింగరాయ శబ్దసంబంధి.

**బడేపురం :**

గుంటూరు జిల్లా తాడికొండ సమీప గ్రామం. దీని పూర్వనామం రామచంద్ర పురంగా శాసనం వలన తెలుస్తోంది. ఈ గ్రామము, మంగళగిరికి సమీపాన గల రామచంద్రపాలెం రామచంద్ర నృపతి పేరుమీదుగా వచ్చాయి.

**బందరు :**

కృష్ణాజిల్లా ముఖ్య కార్యస్థానం. దీని నిప్పుడు మచిలీపట్నం అంటున్నారు. వెనుకటి నాళ్ళలో మచిలీబందరు, బందరు అనేవారు. బందరు అనేపదం పర్షియన్ భాషా సంబంధి. సముద్రతీర గ్రామం రేవు అని అర్థం. మచిలీ మత్స్య సంబంధి, మహాపూజ్ బందరు, బందరు మచ్చిలీసం అనే గ్రామాలు శ్రీకాకుళ జిల్లాలో వున్నాయి. గాంధీ జన్మస్థలం పోర్‌బందరు గుజరాత్‌లో వుంది. కర్ణాటక రాష్ట్రం లోని ఉడుపికి సమీపాన మల్పి బందరుంది. ఉడిపి అనడం తప్పు. దాని పేరు ఉడుపి.

**బబ్బేపల్లి :**

గుంటూరు జిల్లా నరసరావుపేట తాలూకా గ్రామం. దీని పూర్వనామం ప్రబ్బపల్లి. కాలక్రమంలో బబ్బపల్లి అయి బబ్బేపల్లిగా స్థిరపడింది. పూర్వపదంమీది 'ఏ' నిర్దేశార్థంలో గ్రామనామాల్లో వస్తుందని పూర్వం చెప్పడం జరిగింది. పబ్బ (Calamui rotany Linn.) అంటే ఒకరకం ఆకుకూర. పబ్బలి తెలిసిందే.

ఇలా మొక్కలు చెట్లపేర్లతో గ్రామాల పేర్లు వచ్చినపుడు ఆచోట అవి అప్పట్లో విస్తారంగా వుండేవని భావించాలి.

**బయనకుంటపల్లె :**

అనంతపురం జిల్లా హిందూపురం తాలూకా గ్రామం. బయన వ్యక్తినామం. బాయప్ప తెలుగువారిలో వ్యక్తినామంగా కలదు. ఈ బాయ శబ్దం బాచ శబ్దంనుండి వ్యుత్పన్నం. తిరిగి ఇది 'భాషా' శబ్ద సంబంధి. బాచరుసయ్య, బాచిదేవయ్య అనే పేర్లు కర్నాటకలో వ్యాప్తిలో ఉన్నాయి. తెలుగులో బాచ ఇంటిపేరుగా కూడ కన్పిస్తోంది. కుంట తెలిసిందే.

శాసనాల్లో దీని పేరు బయనకుంట మాత్రమే మల్లెల స్థలంలోని బయనకుంట, ఆదింసెట్టిపల్లె, వానకోట గ్రామాలను కలిపి కమలాబపురమనే పేరుతో అగ్రహారం గావించి మహానాయంకరాచార్య నరసింహనాయడు దానంచేసినట్టు శాసనం చెపు తోంది. ఇలా కొన్ని గ్రామాలను కలిపి, మరొక పేరు మీద దానంచేసిన విషయం. అచ్యుతాపురత్రయం గ్రామంవద్ద చెప్పడం జరిగింది.

**బల్లిపర్రు :**

ఈ పేరుతో కృష్ణాజిల్లాలో మూడు గ్రామాలున్నాయి. గుంటూరు జిల్లాలో బల్లికురవ అనే గ్రామముంది. బల్లిపాడు బల్లిపర్రు పేరుతో గ్రామాలున్నాయి. బల్లి అనేది ఒకరకం గడ్డి. బల్లంకి, బల్లంకితుని అనే గ్రామాలు విశాఖ జిల్లాలో వున్నాయి. పర్రు పూర్వం వివరింపబడింది. కురవ ఎత్తైన నేల, లేక నేలపారుగా వున్న కాండ అని కురగల్లు గ్రామ వివరణలో చెప్పబడింది.

**బహదూర్ శేషయ్య ఖండ్రిక :**

చిత్తూరు జిల్లా పుత్తూరు తాలూకా గ్రామం. శేషయ్య అనే వ్యక్తి పే మీదుగా వచ్చిన గ్రామం. బహదూర్ అనే పదం టర్కిష్ నుండి ఉర్దూ వచ్చిన ఈ పదానికర్థం నాయకుడు, వీరుడు అని. ఇది బిరుదుగా ప్రవర్తిస్తోం వెనుక పాయక శబ్దం వివరింపబడింది. ఇది కూడా అలాంటిదే.

హైదర్‌షా ఆలంవేయించిన నాణాలకు బహదూరీలని పేరు. ఇంకా ఇదే తాలూకాలో మహారాజు బహదూరివారి పేట. రాజకుమార వెంకట పెరుమాళ్‌రాజు బహదూరి వారిపేట, అనే గ్రామాలు, కాళహస్తి తాలూకాలో బహదూర్‌వెంకటాపురం అనే గ్రామాలున్నాయి. ఖండ్రిక పూర్వం వివరింపబడింది.

బహర్జల్లి :

పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం తాలూకాలోని పూర్వపు జమీందారి గ్రామం. బాహర్‌జల్‌కు వికృతరూపం బహర్జల్లి. బాహర్ అనే హిందూస్తానీ పదానికర్థం బయట, వెలుపల అని- జలమంటే నీరు. ఫలితార్థం కొల్లేరుకు బయట వున్న గ్రామం. కొల్లేరుకు లోపల వున్న గ్రామం భీతరజల్లి.

ఈ బహర్జల్లికి పూర్వనామం గోకర్ణపురం. కొల్లేరు తూర్పున గల చెట్టూ చేమ లేని పల్లపు ప్రాంతం. గోకర్ణపురం నీటిలో మునిగిపోగా, ఇది ఆ తరువాత అచోటనే వచ్చిన గ్రామం.

బాపనత్తం :

పై జిల్లాలోని పలకు నేరి తాలూకా గ్రామం. బాప శబ్దం బ్రాహ్మణ శబ్ద సంబంధి. నత్తం తమిళ శబ్దం. ముందు వివరింపబడింది. దీనికి గల మరొక పేరు గరుల బండ బాప నత్తం. ఇదే తాలూకాలో కడవ నత్తం అనే గ్రామముంది. కడవ శబ్దం ముంగు వివరింపబడింది.

బుగ్గ వెంకటాపురం :

నెల్లూరు జిల్లా గ్రామం. సమీపంలోని కొండలలో పుట్టిన పేరు (బుగ్గేరు) వలన, మరో వెంకటాపురం వుండడం వలన వివక్ష కొరకు ఇలా వ్యవహరింపబడుతోంది. ఈ ఏరునే బొగ్గేరు అంటారు బుగ్గఏరు వ్యవహారంలో బొగ్గేరు అయింది. అంతే తప్ప బొగ్గుకు సంబంధం లేదు. మరో బొగ్గేరు కడప తాలూకా పాలకొండలలో పుట్టి ప్రవహిస్తోంది.

ఇక నీరు సహజంగా పైకి ఉబికి వచ్చే వనరును బుగ్గ అనడం తెలిసిందే. అలా లాలాజలం ఊరే చోట గనుక నోటిలోని ఆ అవయవానికి బుగ్గ అని పేరు.

**బుచ్చిరెడ్డిపాలెం :**

నెల్లూరు జిల్లాలో, ఆ పేరు గల తాలూకాకు కేంద్ర కార్యస్థానం. వ్యక్తి నామ పరంగా వచ్చిన గ్రామం. బుచ్చి అనేది చిన్ని, ముద్దు అనే వాటికి మారుగా ఉపయోగించడం తెలిసిందే. పిన తల్లిని మద్వులు అబ్బుబ్బి అని వ్యవహరిస్తారు. ఇక ఈ గ్రామాన్ని వ్యస్తంగా బుచ్చి, పాలెం అని వ్యవహరించడం కూడా ఉంది. దీనికి గల మరొక పేరు రామక్షేత్రం. ఇచ్చట గల వైష్ణవ క్షేత్రం రామరెడ్డి గారిచే నిర్మింపబడింది.

**బురకాయల కోట :**

చిత్తూరు జిల్లా మదనపల్లె తాలూకా గ్రామం. కోట అంటే ఎత్తైన గోడలతో (ఆవరణ చుట్టూ) నిర్మించిన రక్షిత ప్రదేశం. ఇందలి బురకాయలు అనేది 'బుర్ర' చెట్టుకు సంకేతం. కొన్ని చెట్లను కాయలు చేర్చి పలకడం కద్దు. బురతుంగ (Cyperus species), బుర్రతోడెంగ అనే నామాలున్నాయి. కృష్ణాజిల్లాలోని ఉచ్చి కాయల పూడితో పోల్చి చూసినపుడు అలాంటివ్యవహారముందని తెలుస్తోంది. ఇదే జిల్లాలో కాట్రకాయల గుంట, గుంటూరు జిల్లాలో వంకాయలపాడు అనే గ్రామాలున్నాయి.

**బూతుమిల్లి :**

గుంటూరు జిల్లా తెనాలి తాలూకా గ్రామం. కృష్ణాజిల్లాలో బూతుమిల్లి పాడుంది. బూతు అనేది ఇక్కడ అశ్లీలమైన మాట అర్థంలో కాదు. ఒక రకం మొక్క. ఔషధాల్లో ఉపయోగిస్తారు. సాతురేగినా బూతురేగినా ఆగదని సామెత. సాతు కూడా ఒక రకం మొక్క. సాతులూరు పేరుతో గుంటూరు, కృష్ణా జిల్లాల్లో గ్రామాలున్నాయి. మిల్లి, పల్లికి రూపాంతరం.

**బెండపూడి :**

తూర్పు గోదావరి జిల్లా గ్రామం. బెండపూడి అన్నయ మంత్రి ప్రస్తావన శ్రీనాథుని భీమేశ్వర పురాణంలో కన్పిస్తోంది. ఇక శాకంగా ఉపయోగిస్తున్న బెండ వేరు. ఇది వేరు. బెండకాడ, బెండలం (Abutilon species) అని పిలువ బడే కలుపు మొక్క ఇది. వ్యవసాయ దారులకు బాగా తెలిసిందే. పసుపు పచ్చని

పూలు పూస్తుంది. బెండ అనే గ్రామం టెక్కలి తాలూకాలో ఉంది. దీనిని శాసనాలలో భేండిగా వ్రాయడం జరిగింది.

**బెరహంపూరు :**

ఒరిస్సా రాష్ట్ర గ్రామం. తెలుగు వారి ఉచ్చారణలో బరంపురం అసలు పేరు బ్రహ్మపురం. రోమను లిపిలో బ్రహ్మశబ్దం BRAHMA గా వ్రాయబడుతుంది. ఉచ్చారణలో బ్రహ్మ శబ్దం బ్రెహ్మ. BREHMA గా వ్రాయబడి, ఆంగ్లేయుల ఉచ్చారణ బెరహ్మగా మారి బెరహం గా స్థిరపడి బెరహంపూరుగా రూపు దాల్చింది. బెరహంపూరు పేరుతో శ్రీకాకుళం జిల్లాలో ఇంకా గ్రామాలున్నాయి.

**బెల్లంకొండ :**

గుంటూరు జిల్లా గ్రామం. ఇందలి బెల్లం ఖాద్య పదార్థమైనది కాదు. ఇదొక మొక్క పేరు. బెల్లపలం అంటే తెలియవచ్చును. అక్కడ అవి విస్తారంగా వున్నాయి. గనుక, ఆ కొండ బెల్లంకొండ.

ఇక ఖాద్యమైన బెల్లం ఎలా ఏర్పడిందో చూడండి. ఎవరినైనా సంతోషపెట్టడానికి తీపి పదార్థం పెట్టడం తెలిసిందే. అంటే వారిని ఆ పదార్థంతో వేల పరస్తున్నామన్నమాట. ఈ వేల శబ్దం పూర్వాక్షరంపై దీర్ఘం పోయి పదసమత నిలుపడం కొరకు ద్వితీయ వర్ణంపై ద్విరుక్తత వచ్చి బెల్లం అయింది. చెరకు రసంనుండి ఉత్పత్తి అయినది. దీని గుణం తీపికదా. ఇంక ఈ బెల్లం స్త్రీల వ్యవహారంలో పురుషాంగానికి పేరు, ఈ మేరకు రాధికా సాంత్వనంలో ప్రయోగముంది. ఆసక్తి గలవారు చూడవచ్చును.

శాసనం : నాదెండ్ల : గుంటూరు తాలూకా, గుంటూరు జిల్లా.
"....బెల్లంకొండ్డ తూర్పు దక్షణలు...." [1]

**బెళగల్ :**

కర్నూలుజిల్లా గ్రామం. బెళ కన్నడ భాషా పదం. తెలుగులో వెళ. వెల్ల వెలుతురు తెలిసినవే. కల్లు శబ్దం గల్‌గా మారింది. ఫలితార్థం తెల్లనికొండ. దీని

---

[1] No. 686, S. I. I. Vol. iv

పూర్వనామం కెరెబెళగల్. కెరె అనే కన్నడ శబ్దం తెలుగులో చెరువుతో సమానం. అంటే చెరువుగల బెళగల్.

బేజాత్పురం :

గుంటూరుజిల్లాలో గ్రామం. బేజాతి విజాతీయులు. మహమ్మదీయులు ఆక్రమణ వలన ఈ పేరు సిద్ధించింది. దీని అసలు పేరు పులిపాడు. ఈ మేరకు శాసనాధారముంది. సమీపంలోని ఉద్దండాయపాలెం, అమరావతి నేలిన కోట గణపతి దేవుని మహాప్రదాని ప్రోతినాయకుని తండ్రి ఉద్దండనాయకుని పేరుమీదుగా ఏర్పడింది. ఉద్దండ శబ్దం బలశాలి అనే అర్థాన్నిస్తుంది.

బేతపూడి :

గుంటూరు జిల్లాలోను, ఇతర జిల్లాలలోను ఈ పేరుతో గ్రామాలున్నాయి. కోట వంశస్థుల్లో ఒక బేతరాజున్నాడు. ఇతర వంశాల్లోనూ ఉన్నారు. ఆయా వంశాల్లో ఎవరి పేరుమీదుగానైనా వచ్చి యుండడచ్చును. బేతవోలులు కూడా ఇలాంటివే. మంగళగిరికి సమీపంలోని బేతపూడికి దేగర బేతపూడి అనే వ్యవహారా మున్నట్లు శాసనం వలన తెలుస్తోంది. ఈ దేగర అనేది ఒక రకం మొక్క. దుమ్ము దూగరతో పోల్చి చూడండి. చాగర్లమూడిలోని చాగర కూడా ఇలాంటిదే. జగ్గయ్యపేటకు పూర్వనామం బేతవోలు. బేత, భేతాళ శబ్ద సంబంధి యని ముందు చెప్పబడింది.

శాసనం : కొండవీడు: గుంటూరు తాలూకా, గుంటూరు జిల్లా.
"దేగల బేతపూండిని కేసరిపాటిని..." [1]

భేతాపల్లె :

అనంతపురం జిల్లా గుత్తి తాలూకా గ్రామం. వ్యక్తి నామసూచి. బేత, భేతాళ శబ్ద సంబంధి. ఈ గ్రామానికి గోరాజపురమనే పేరున్నట్లు శాసనం చెపుతోంది. ఇచ్చట తిమ్మరాజస్వామి ఆలయముంది. అయితే శాసనంలో వెంకటాద్రి స్వామిగా వ్యవహృతము.

[1] No. 699, S. I. I; Vol. iv

బొడ్డుపల్లె :

శ్రీనాథుడు 'బొడ్డుపల్లెను గొడ్డేరిమోసపోతి'నంటాడు. అవసానదశలో ఈ గ్రామాన్ని గుత్తకు తీసుకొని, బిలబిలాక్షలు తిలలు పెసలు తినిపోయాయి, మిగిలిన దానిని కృష్ణవేణమ్మ వరదలో ఊడ్చివేసింది. ఒడ్డె ప్రభువుల శిక్షకు గురైనాడు ప్రస్తుతం ఈ పేరుతో ఊరు కనుపించదు. కాలగర్భం కలసిపోయింది. ఈ ఇంటి పేరుగలవారున్నారు.

గ్రామనామాల్లో బొడ్డు నాభి సంబంధం కాదు. బొడ్డు పావలి Portulaca oberaua, Linn.) అనేది చెమ్మనేలల్లో పెరిగే మొక్క. వైద్యంలో దీని ఆకులను గింజలను ఉపయోగిస్తారు. శాకంగా కూడా వాడతారు. పావులూరులో పావు శబ్దం ఇదే. వెదురు పావులూరు కొండపావులూరు అనే గ్రామాలు కృష్ణాజిల్లాలో వున్నాయి. బొడ్డు శబ్దంతో చాల ఊర్లున్నాయి.

బొబ్బనపల్లి :

పశ్చిమగోదావరి జిల్లా భీమవరం తాలూకా గ్రామం. బొబ్బన వ్యక్తి నామం. బొప్పన దీని పూర్వరూపం. బహుశా ఈ గ్రామం శా. శక 1182 ప్రాంతాల్లో గల సకల సేనాధిపతి పట్టసాహిణి బొప్పయదేవుని పేరుమీదుగా ఏర్పడి యుండవచ్చునని ఊహిస్తున్నాను.

బొబ్బిలి :

ఈ పేరు తలిస్తే తాండ్రపాపారాయుడు గుర్తు రావడం సహజం. బొబ్బిలి బెబ్బులినుండి వ్యుత్పన్నమయిందని కొందరు భావించారు. నిజానికి బొబ్బిలి ఒక చెట్టు పేరు. దీని కాయలాకారంతో చేసిన ఆభరణమొకటుంది. దానిని బొబ్బిలికాయ లంటారు. వెనుకటి తరాల స్వర్ణకారులకు, స్త్రీలకు ఈ ఆభరణం తెలుసు. కన్నడంతో బొబ్బులి (Acacia avabica Willa) ఒక రకం ముళ్ళమొక్కగా కన్పిస్తుంది. ప్రబ్బలి అనే మొక్క పేరు వినివుంటారు. తాండ్రమాడ ఒక చెట్టుపేరు. మామిడి గుజ్జుతో తయారుచేసే ఖాద్య పదార్థం మామిడితాండ్ర వేరు.

**బోనంగి :**

విశాఖపట్నం జిల్లా శృంగవరపుకోట తాలూకా గ్రామం. అంకి, అంగి పూర్వం వివరింపబడ్డాయి. బోన అనేది ఒక రకం ముళ్ళపొద. కన్నడంలో బోనకారె (Vangueria spinosa Roxb) అంటారు. అనకాపల్లి తాలూకాలో పాయకరావు బోనంగి అనే గ్రామమున్నట్టు ముందు చెప్పబడింది. ఇంకా అదే తాలూకాలో ఈదులపాక బోనంగి. పెంటసీమ బోనంగి అనే గ్రామాలున్నాయి. బోని, బొన్ని పేరుతో విశాఖ, శ్రీకాకుళం జిల్లాల్లో గ్రామాలున్నాయి. కాగా వరంగల్లు జిల్లాలో బోనకల్లు అనే గ్రామ ముంది. దానిని రైల్వేవారు బోనకాలుగా సంభావించడం వింత.

**బోయలఉప్పలూరు :**

కర్నూలుజిల్లా కోయిలకుంట్ల తాలూకా గ్రామం. ఉప్పలూరు ఉప్పల మొదలైన వాటిలోని ఉప్పు లవణ సంబంధికాదు. ఉప్పిగడ్డికి సంబంధించింది. అయితే ఈ గ్రామం 'బోయల' అనే జాతిజనుల పరంగా వ్యవహరింపబడుతోంది. దీనికి కారణం, ఇదే తాలూకాలో మరో ఉప్పలూరుంది. దానిని మొగలాయి ఉప్పలూరంటారు. ఈ బోయ ఒక కులంగా రాయలసీమలో వున్నారు. వీరి పేరుతో గల మరొక గ్రామం బోయల తాటిపత్రి. ఈ బోయల ఉప్పలూరికి సోమ సముద్ర మనే పేరున్నట్టు శాసననాధారముంది. ఈ గ్రామంలోని చెన్నకేశవస్వామి ఆలయ ముఖమండపానికి, ఈ ఊరి విప్రవినోదులు తమకు వచ్చే వర్తనలను (వార్షికంగా వచ్చే ఆదాయం) దానం చేసినట్టు శాసనం చెపుతోంది.

**భీమవరం :**

ఆంధ్రదేశంలో చాల భీమవరాలున్నాయి. కొన్ని వ్యక్తుల పేర్ల మీదుగా, మరికొన్ని స్థానిక దేవతామూర్తుల పేర్ల మీదుగా వచ్చాయి. దేవుని పేరుమీదుగా వచ్చిన గ్రామాలు కూడ భీమ నామధేయులైన చారిత్రక వ్యక్తుల పేర్లమీదుగా వచ్చినవే. ఇంతకు పూర్వం గల భీమవరం వివరింపబడింది. ఇక్కడ మరికొన్ని భీమవరాల సంగతి చూద్దాం.

పశ్చిమగోదావరి జిల్లాలోని రైల్వేస్టేషను గల భీమవరం అందరికి పరిచయ మైనది. దీనిని ఉండి భీమవరమని కూడా అంటారు. ఉండి సమీపంలోనిది కావడం

వలస దీనికా పేరు. సమీపంలోని మరో భీమవరాన్ని అయి భీమవర మంటారు. శ్రీనాథుని సాహిత్యంతో పరిచయమున్నవారికి చళుక్య భీమవరం పరిచయమైనదే.

శాసనం : కాకినాడ తాలూకా; తూర్పుగోదావరి జిల్లా

చాళుక్య భీమహేశ్వరరాగ్రే. . (భీమఖండం)

స్వస్తిశ్రీ శక వర్షంబు 1395 అగునేంటి పరాభవ సంవత్సర మాఘ బహుళ 11 గునాండు కుమారారామ భీమేశ్వర దేవరనగరిను లోపల....[1]

స్కందారామ చళుక్య భీమనగరీ భీమేశ్వర ప్రీతయే ... [2]

ఈ భీమవరం కాకినాడ తాలూకాలోనిది. దీనికే కుమారారామమని పేరు. కుమారారామ చళుక్య భీమవరమని కూడా వ్యవహారం. కుమార శబ్దాన్ని మరింత సంస్కృతీకరించి స్కంధరారామ చాణుక్య భీమవరమని కూడా శాసనాల్లో వ్యవహరించారు.

చాళుక్య భీమవరమనడానికి కారణం చాళుక్యుల పాలన. కాగా కుమార శబ్ద వ్యాప్తిలోనికి రావడానికి కారణం కుమారగిరిరెడ్డి. కాటయవేముని బావ. అతని కుమారునికి తన బావ పేరే పెట్టుకున్నాడు. కుమారగిరిపురమనే పేరుతో చాల గ్రామాలు కోటయవేముడు దానం చేశారు.

భీమవరం పేరుతో చాల గ్రామాలున్నాయి. అనకాపల్లి తాలూకాలో గాలి-భీమవరంతోపాటు గురుగుభీమనే మరో గ్రామముంది. శ్రీకాకుళం జిల్లాతో సేతు-భీమవరముంది.

**భూపసముద్రం :**

అనంతపురం జిల్లా గ్రామం, సమీపంలోని చెరువు వలన సముద్రమనే వ్యవహారం సిద్ధించింది. విజయనగర ప్రభువుల్లో ఎవరిమీదనో ఇది వ్యవహారంలోకి వచ్చి యుంటుంది. అయితే ఒక శాసనంలో ఇది క్రియాశక్తిపురంగా పేర్కొనబడింది. శ్రీనాథుని గౌడ డిండిమ భట్టుకు ఏర్పడిన పండిత వివాదంలో చంద్రభూషా క్రియాశక్తి మధ్యవర్తిగా వ్యవహరించాడు. బహుశా ఇది అతని పేరుమీదుగా ఏర్పడి యుండవచ్చు.

[1] No. 31, S. I. I; Vol. xvi

[2] No. 37, S. I. I; Vol. x

భోగాపురం :

విశాఖజిల్లా గ్రామం. భోగ శబ్దం భూకామందుకు, సేద్యగానికి గల వంతుల నిర్ణయానికి సంబంధించింది. తూర్పుగోదావరి జిల్లాలోని గుడిగళ్ళ భోగ ఇలాంటిదే. అయితే దేవునికి అంగరంగ భోగాలకు గాను ఇచ్చిన గ్రామం కూడా కావచ్చు. లేదా భోగనామం గల వ్యక్తికి ఇచ్చినది కావడంచేత కూడా భోగాపురం కావచ్చు. ఈ భోగాపురానికి విక్రమగంగవీర పేంట అనే పేరున్నట్లు శాసనాల వలన తెలుస్తోంది, పేంట, పేట శబ్ద సంబంధి. పేట వేరు. పేంట వేరు. పేట ముందు వివరింపబడింది.

మంగలగుంట :

చిత్తూరుజిల్లా కాళహస్తి డివిజన్‌లోని గ్రామం. ఇదే జిల్లాలో మంగలపురి, మంగలపల్లె. మంగలగుంట అనే గ్రామాలున్నాయి. మంగలమంటే శుభప్రదమైన అని అర్థం. అయితే తెలుగునాట క్షురికా వృత్తిలో నున్నవారిని ఉద్దేశిస్తూ వ్యవహరింపబడుతోంది. ఆ వృత్తివారు మంగళ వాయిద్యాలను కూడా వాయిస్తారు. మంగళ శబ్దం వ్యవహారంతో మంగల అయింది, వేటినైనా వేయించుకోవడాని కుపయోగించే పనిముట్టు కూడా మంగలం. అయితే గ్రామనామంతో దీనికి సంబంధం లేదు. అయితే మంగ (Randia dremetorum, Lank) పేరుతో ముళ్ళకంచె మొక్క ఒకటుంది. గ్రామనామార్థంలో ఇదే సరైనది.

మంగళగిరి :

గుంటూరు జిల్లాలోని ప్రసిద్ధ వైష్ణవ క్షేత్రం. మంగళగిరి అంటే శుభప్రదమైన కొండ అని అర్థం. నృసింహస్వామి ఆలయ తూర్పుగోపురం చాల ఎత్తైనది. దిగువ సన్నిధికి దిగువ తిరుపతి స్థలమని పేరు. ఎగువ సన్నిధికి ఎగువ తిరుపతి అని పేరు. ఎగువ తిరుపతిలోని స్వామిని పానకాలరాయనిగా సంభావిస్తారు. 108 ప్రసిద్ధ వైష్ణవ క్షేత్రాలను దివ్యతిరుపతులనడం కద్దు. మంగళగిరి అందులో ఒకటి. దీనికి తిరికొండ అనే వ్యవహారమున్నట్లు బ్రౌనుదొర తన నిఘంటువులో సూచించారు.

ఇక ఈ మంగళగిరి, పాతకొత్తల పేరుతో రెండు భాగాలు. ఈ రెంటికి సరిహద్దు హుస్సేన్‌కట్ట. కొత్త మంగళగిరి నిజాంపట్నం సర్కారుకు పాత మంగళగిరి సత్తెనపల్లి జమీందారులు మానూరి వారికి చెందినవి. అమరావతి

పాలకులు నరసింహస్వామిని తమ ముంగిటి దైవంగా భావించుకున్నారు. మంచెళ, వాసుదేవకవి, కనుపర్తి అబ్బయామాత్యుడు తమ కృతులను ఈ దేవునికి అంకిత మిచ్చారు. కనుపర్తి అబ్బయామాత్యుడు ఎగువ సన్నిధిలో గల లక్ష్మీదేవిని మూరొక్కొండ లక్ష్మిగా సంభావించాడు. దీనినిబట్టి మంగళగిరికి దేశీయనామం మూరొక్కొండ గావచ్చును. మరొక్కొండ ఒకరకం మొక్క. అవి విస్తారంగా వుండే కొండ అనే అర్థంలో కావచ్చును. విజయనగర ప్రభువులు ఈ దేవునికి పెక్కు గ్రామాలు సమర్పించారు. కాలక్రమంలో శిథిలమైన తూర్పుగోపురాన్ని అమరావతి నేలిన వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు మరమ్మత్తు చేయించాడు.

కృష్ణా జిల్లాలో ఆకిరిపల్లిలో నృసింహస్వామి ఆలయముంది. అది కూడ మంగళగిరి. దానికి మరింత సంస్కృతీకరణం శోభనాచలం. శోభనాద్రి నూజివీడు పాలకులు స్థాపించిన సినిమా స్టూడియోను శోభనాచల స్టూడియో అని పేరు రావడానికిదే స్ఫూర్తి. ఆ వంశపాలకుల్లో శోభనాద్రి అప్పారావు అనే పేరుగల వారున్నారు.

ఇక మంగళగిరి కంప పేరుతో ఒక కంప కూడా వుంది. (Balsamoden-dron genns)

### మంచికలపూడి :

తెనాలి తాలూకా గ్రామం. శాసనంలో దీని పేరు మంచ్చెకలపూండి. మంచి, మంచె అనేవి గడ్డి మొక్కలు. చిప్పరగడ్డి, ఊదజాతికి చెందినవి గావచ్చును. మంచికలు అనే గ్రామముంది. వీటితో పోల్చి చూసినపుడు కామంచి మొక్క తెలి ందే. కన్నడంలో మంచ పేరుతో గడ్డిమొక్క వుంది. (Panieum ciliare Retz. 2) మంచి పేరుతో కూడా ఒక కలుపు మొక్క వుంది. ఎలమంచిలి మొదలైనవి కూడా గడ్డి పేర్లేమోననిపిస్తుంది. ఇంకా పరిశీలన అవసరం. మంచిలి అనే గ్రామం కూడా ఉంది.

### మణేసముద్రం :

అనంతపురం జిల్లా గ్రామం. మణే శబ్దానికి ముఖ్యుడు, అధికారి, యజమాని అని అర్థాలు. మణేదారు అనడం తెలిసిందే. మణియము అంటే యాజమాన్యము.

'గుడి మణియము చేయబోకు గువ్వలచెన్నా' అనే పద్యపాదం విని వుంటారు. మన్నెం ఇంటిపేరు దీనినుండి వచ్చినదే. వీరప్రతాపరుద్రరాయని శాసనాల్లో ఈ మణే సముద్రానికి దేవరాయపురమనే వ్యవహారమున్నట్లు తెలుపబడింది.

**మత్స్యపురి :**

బాపట్ల తాలూకా గ్రామం. మత్స్యకారుల నివాసం గనుక మత్స్యపురి. అయితే దీని పూర్వనామం కనకాద్రి నగర్. ఇమ్మడిశెట్టి కనకాద్రినాయడు అనే ఆయన ఈ స్థలాన్ని ఇవ్వడం వలన దానికాపేరు వచ్చింది. 1977లో సంభవించిన తుపానులో గ్రామం పూర్తిగా కొట్టుకుపోగా. కాసా (Casa) సంస్థవారు పునర్నిర్మించారు. అప్పటినుండి మత్స్యపురిగా వ్యవహరింపబడుతోంది.

**మదనపల్లె :**

చిత్తూరుజిల్లా గ్రామం. ఇందలి మదన శబ్దం మన్మథ సంబంధి కాదు. ఇది ఒక మొక్క. మదనకట్టె, మదనకాడ, మదనబుడత, మదనముత్తకాడ, మదనలం మదనాకు పేర్లతో (Spermocou hispidu, Linn) దీన్ని పిలుస్తారు. ఇది పాకే తీగెజాతికి చెందినది. ఎర్రనేలల్లో పెరుగుతుంది.

**మద్దినాయనిపల్లె :**

ఇది కూడా మదనపల్లె తాలూకా గ్రామం. దీని పూర్వనామం మద్దినాయని పాళెం. వ్యక్తి నామపరంగా వచ్చింది. మద్ది మాదవ శబ్దానికి వికృతరూపంగావచ్చును. పద్మనాభ శబ్దం వ్యవహారంలో పెద్దగా మారడంలో తెలిసిందే. మద్దినే ఇంటిపేరుగలవారున్నారు. నాయడు పూర్వం వివరింపబడింది.

ఈ మద్దినాయనిపాలెం, సమీపంలో గ్రామాలపై వచ్చే వర్తనలు కాలువపల్లిలోని అంకాళమ్మ దేవికి, జిల్లెళ్ళకృష్ణమ రాజయ్య వెంగళరాజుగారు, శకసంవత్సరం 1400 కాళయుక్తి నామ సంవత్సరం మాఘ బహుళ శివరాత్రినాడు సమర్పించినట్లు శాసనం చెపుతోంది.

**మధురవాడ :**

విశాఖపట్నం సమీపగ్రామం, దీనికి, కృష్ణ సంబంధి మధురకు సంబంధం

లేదు. నిజానికిది మదురువాడ. అంటే వెనుకనున్న జనావాసం. మదురుగోడ అనే వ్యవహారం తెలిసిందే. ఖమ్మంలోని మధిర కూడా ఇలాంటిదే. దాని శాసనాస్థ నామం మదిర.

మనవ_ర్తికొత్తూరు :

చిత్తూరు జిల్లా గ్రామం. పుత్తూరు తాలూకాలో ఈ గ్రామం కాక మరొక కొత్తూరు అడవి కొత్తూరు వుంది. వివక్ష కొరకు ఇలా పిలవబడుతున్నాయి. కొత్తగా కొత్తగా వచ్చిన ఊరు కొత్తూరు. అడవి సమీపంలోని కొత్తూరు అడవి కొత్తూరు 'మనవర్తి' మనోవృత్తి శబ్దభావం. అంటే ఇష్టానుసారం ఇవ్వబడింది. వయోవృద్ధులకు మనోవర్తి ఏర్పాటు చేయడం తెలిసిందే. ఇక ఈ మనోవర్తికూడ ఇష్టానుసారం అనుభవించే హక్కుతో అంటే సర్వమాన్యంగా ఇవ్వబడిన అగ్రహారం. ఇది పూర్వం జమీందారీ గ్రామం. మనోవర్తి లాంటిదే ముదనష్టం. ఎవరికైనా దూరపు బంధువులు చనిపోగా ఆస్థి సంక్రమిస్తే ముదనష్టం వచ్చిపడిందంటారు. ముదనష్టపుది ముదనష్టపు వాడు అని తిట్టడం తెలిసిందే. ముదనష్టమంటే ముదిమిని ఇచ్చే నష్టం. లాభనష్టాలలోని నష్టంతో ఇక్కడ ప్రసక్తిలేదు. ఇక్కడ నష్టాని కర్థం పరిహారం. వార్ధక్యంలో జీవిక కొరకు ఏర్పాటు చేయబడినది. మనోవర్తికి దీనికి గల భేదం. మనోవర్తి ఇష్టానుసారం ఎవరికైనా సంక్రమింపజేయవచ్చు. కాగా ముదనష్టం అనుభవ హక్కు మాత్రమే. అన్యాక్రాంతం చేయడానికి వీలుండదు. చట్టబద్ధమైన వారసులకే వారి తరువాత ఆస్థి సంక్రమిస్తుంది.

మందపాడు :

గుంటూరు తాలూకా గ్రామం. శాసనాల్లో దీనిపేరు మందాపురం. ఇదే శాసనంలో సిరిపురంగా వ్యవహృత మవుతున్నది. సిరిప్రోలుగా ప్రస్తావింపబడింది. 12వ శతాబ్దంలో ఈ సర్విప్రోలును మందడి నామినాయకుడు పాలించాడు. ఈతని ఇంటిపేరైన మందడి, మంగళగిరికి సమీపంలోని మందడం గ్రామం. తిరిగి ఈ ఇంటిపేరుతో మందపాడు ఏర్పడి యుండవచ్చు. లేదా మందవేసే చోటుగా వచ్చి యుండవచ్చు.

నామినేని ఇంటిపేరుగా గల వారికి చర్చలోని నామినాయడు మూలపురుషుడు కావచ్చును. కొండ పడుపటి (కొండవీడుకు పడుమటి) సీమలోని పన్నెండు పూండ్లలో ఈ సిరిపురం ఒకటి. ఇచ్చట రామేశ్వరాలయముంది.

మల్కాపురం :

గుంటూరు జిల్లాలో మందడం గ్రామ సమీపాన వుంది. దీని పూర్వనామం శ్రీరుద్రదేవీపురం. ప్రస్తుతం మల్కాపురంగా శిధిల దేవాలయం, శాసనస్థంభం గల చోటు. ప్రాంతం రుద్రదేవీపురం. కాకతి గణపతిదేవుని కుమార్తె రుద్రమదేవి పేరు మీదుగా ఈ గ్రామ మేర్పడింది. సమీపాన గల పెద్ద గ్రామం మందడం. రెండుగట్ల మధ్యగల భూభాగం మందడం. ఇక్కడ గట్లుగాక, రెండు ఏరుల నడమి భాగంగా చెప్పుకోవాలి. మరో మందడం కడపజిల్లాలో వుంది.

ముందు ఆమీన్‌బాదను గూర్చి చర్చించినపుడు మాలిక్ అమీన్, (కులీకుతుబ్‌షా ప్రధాని) శక సంవత్సరం 1514 (క్రీ.శ. 1592) ఈ ప్రాంతాల్లో జరిగిన తిరుగుబాటులను అణచివేయడానికి వచ్చాడని, అతని పేరుమీదుగా ఆమీన్‌బాద ఏర్పండిందని చెప్పడం జరిగింది. ఆతని పేరుమీదుగా (మాలిక్) ఏర్పడిన గ్రామం మల్కాపురం.

మల్లాకాలువ :

అనంతపురం జిల్లా దర్మవరం గ్రామం. ఈ గ్రామాన్ని సకలరాజు చిన్న తిరుమలయ్య (అచ్యుత దేవరాయల పాలనకాలం) క్రీ.శ. 1455 (క్రీ.శ. 1538) ఈ గ్రామాన్ని కట్టించి ఉత్థాన ద్వాదశి పుణ్యకాలంలో ధర్మవరం పొలంలో ప్రత్యక్షమైన మండే నరసింహదేవరకు మల్లపనాయనిపల్లె అనే పేరుతో సమర్పించారు. ధర్మవరం చెరువు నడిమి తూము కాల్వనుండి మరొక కాలువ తవ్వించి వరి వ్యవసాయానికి అనువు చేశాడు. అనంతరకాలంలో మల్లపనాయని పల్లె మల్లాకాలువగా స్థిరపడింది.

మహాజనంపేట :

పాలకొండ తాలూకా గ్రామం. మహాజనమంటే గొప్పవారు అని సామాన్యార్థం. అయితే ఉత్తర భారతదేశంలో ఈ పేరుతో ఒకజాతి జనులున్నారు. కర్మలు నిర్వర్తింప చేయడం వీరి వృత్తి. కాగా పురోహితులు, షాహుకార్లు, అధికార గణం. వీరిని మహాజనులుగా తెలుగు శాసనాల్లో ప్రస్తావించడం జరిగింది.

( 17 )

**మాచెర్ల :**

గుంటూరు జిల్లా గ్రామం. బ్రహ్మనాయడు కట్టించిన ప్రసిద్ధ చెన్నకేశవస్వామి ఆలయ మున్నది కూడా. దీని పూర్వనామం మహాదేవిచర్ల. మరొక పేరు మహాదేవి తటాకము.

శాసనం : సబేత భూపతిః శౌనక గోత్రేణ మహీధర పౌత్రేణ శ్రీ ధర పుత్రేణ జోగ మాంబికానందనేన శ్రీ మదాదిత్యేన మహాదేవి తటాకా భిదానాయాం రాజధాన్యాం ప్రతిష్ఠితా... [1]

ఇది మాదేవి చర్ల అయి మాచర్లగా స్థిరపడింది. మహాదేవి ఇచ్చటి గ్రామ దేవత. చెర్ల చెరువుపై బహువనం. ముందు వివరింపబడింది.

**మారేడు మానిపల్లె :**

అనంతపురం జిల్లా కల్యాణ దుర్గం తాలూకా గ్రామం. మారేడు చెట్టు (Aegle mermclos Corr) తెలిసిందే. ఈ గ్రామానికి హనుమంతపురమనే మరొక పేరున్నట్లు శాసనం వలన తెలుస్తోంది. ఈ పేరుతో దేవదాసు కుమారుడు, వెంటాద్రినాయడు సమీప గ్రామమైన బూది గుమ్మ గ్రామంలో వేంచేసి యున్న హనుమంత దేవునికి శక సంవత్సరం 1458లో తన ప్రభువు అచ్యుత దేవ మహారాయలకు పుణ్యంగా సమర్పించినట్లు శాసనం చెపుతోంది. ఈ ప్రాంతం, రాయదుర్గ సంబంధమైన కుందుర్పి సీమలోనిదిగా పేర్కొనబడింది.

**మార్కాపురం :**

ఒకప్పటి కర్నూలు జిల్లాకు చెందినది. నేడు ప్రకాశం జిల్లాలో ఉంది. శాసనాల్లో ఇది మారికాపురంగా, మారకాపురంగా. మారకపురంగా వ్యవహృతమైనది. మారి, మారిక గ్రామ దేవత పేరు. కలరా, మశూచి మొదలైన వ్యాధులను మహమ్మారి అనడం కద్దు. ఇచ్చటి చెన్నకేశ్వరాలయం ప్రసిద్ధమైనది. మాచర్లలోని చెన్నకేశ్వరాలయ ప్రసిద్ధి తెలిసిందే. కాగా కర్నూలు తాలూకాలో మరో మార్కాపురం, కడపజిల్లా బద్వేలు తాలూకాలో మరో మార్కాపురం వున్నాయి.

మారికా, పురంగాక మారి, కాపురమయిన సందర్భంలో కాపుర శబ్దానికర్థం. సేద్యయోగమైన భూమి అని అర్థం. కాపురం ద్వితీయావయవంతో కూడిన గ్రామాలున్నాయి.

[1] No. 66 S. I. I. Vol x

**మారొ్కొండపాడు :**

ఇది కూడా పశ్చిమ గోదావరిజిల్లా నిడదవోలు తాలూకా గ్రామం. మారొ్కొండ ఒక రకం మొక్క. మూరు కొండాకు అంటే తెలుస్తుంది. మంగళగిరి ఏగువ సన్నిధిలో గల లక్ష్మీదేవిని మూరొ్కొండ లక్ష్మి అని కనుపర్తి అబ్బయా మాత్యుడు సంభావించాడు. మంగళగిరి సంస్కృత నామం. కాగా మురకొండ అనేది అసలు పేరు గావచ్చు. మోరుకొండ కింద ఖండ్రిక అనే గ్రామం చిత్తూరుజిల్లా పుత్తూరు తాలూకాలో ఉంది.

**మీసరగడ్డ అనంతవరం :**

ఈ గ్రామం గుంటూరు జిల్లాలో ఉంది. సమీపంలో మరొక అనంతవరం ఉంది. దానిని దేవుడనంతవరం అంటారు. అనంత అనే వ్యక్తి పేరు మీదుగా ఏర్పడింది. ఇక మీసరగడ్డ నిజానికి మీసర గండ. ఒక బిరుదు.

**ముఖలింగం :**

శ్రీకాకుళం జిల్లా పర్లాకిమిడి తాలూకాలోని ప్రసిద్ధ శైవక్షేత్రం. ముఖ శబ్దం ముఖ్య శబ్ద సంబంధి. లింగం ఈశ్వరుని అర్చామూర్తి. ఇచ్చట నెలకొన్న దేవుని పేరు మధుకేశ్వరుడు, దీని పూర్వనామాలు నకరము, నకరపువాడ. అంతేగాక నగరానవీడు, నగరపువాడగా కూడా శాసనాల్లో సంభావితము.

నకరము బహుశా న కరముల కలయిక కావచ్చును. కరము అంటే పన్ను ఫలితార్థం పన్నులేని ప్రదేశం. (Tax exempted area) కావచ్చును. కా॥ వ్యాపార స్థలాలు పూర్వకాలంలో ఇలా నిర్దేశించబడి యుండవచ్చును. పశ్చి గోదావరిజిల్లా పెనుగొండ క్షేత్రంలోని స్వామి నగరేశ్వరస్వామి. ఇది వైశ్యులకు నెలవు. నకరపువాడ యందలి 'క' కారం, 'గ' కారంగా రూపొందింది. అంతేతప్ప, నగర సంస్కృత శబ్ద సంబంధికాదు. రాజానగరము, విజయనగరాల్లో గల నగరం సంస్కృత సంబంధి. కాగా నగరికటకం, నక్రేకల్లు (నాగరికల్లు అని క్రీడాభిరామం) చిత్తూరు జిల్లాలోని నగరి, రేపల్లె తాలూకాలోని నగరం పై రెండుకాక వృక్ష సంబంధి తెలుగు శబ్దం. నగరకేసరి, నక్కెరిగడ్డి తెలిసినవే. కన్నడంలో నగరె అనేది సువాసన వేరుగల మొక్కగా చెప్పబడింది.

కన్నడంలో నగర్తలంటే వైశ్యులు. వైశ్య వాటికను నగర్తపేట అనడం వుంది. ముఖలింగ సంబంధమైన నకరపువాడ ఇదే అర్థంలో ప్రవర్తితముగా భావించాలి.

శాసనం : ముఖలింగము : పర్లాకిమిడి తాలూకా, గంజాం జిల్లా
"శ్రీమధుకేశ్వర దేవరకు పీరచోడ దేవర నకరపువాడపుర...." [1]

"బాణశరఖేందు గణితే శాకాబ్దే దక్షిణాయనేతు నిమిత్తే కాలింగ్గావని నగరే. " [2]

"ఉత్తరాయణ సంక్రాంత్తియు గురువారమున నగరాన పీటి మధుకేశ్వర దేవరకు
భూమి గొలకోలను నగరపువాడ...." [3]

**ముచ్చింతాల :**

నందిగామ తాలూకా గ్రామం. శాసనంలో ముచ్చింతలు వ్యవహారంలో ముచ్చింతాలు అయింది. మూడు చింతలు కాదు. ముచ్చింతల అనేది ఒకరకం గడ్డిమొక్క. ఈ గ్రామంతోపాటు కంభంపాడు, బూదపాడు, నాబిరూపురం అనే గ్రామాలను చాగిపోతరాజు ముక్త్యాలలోని ముక్తేశ్వరదేవరకు ఇచ్చినట్టు శాసనంలో పేర్కొనబడినది.

**ముట్లూరు :**

ఇది గుంటూరు జిల్లాలో చేబ్రోలుకు సమీపంలో వుంది. ముట్లు ఊరు ముట్లూరు. ముట్టుట అంటే స్పృశించుట, తాకుట, అంటుకొనుట అని అందరికీ తెలిసిందే. అయితే ఇక్కడ ఈ అర్థంకాదు. ఇక్కడ 'ముట్టు' అంటే సాధనం. పనిముట్టు, కొరముట్టు పదాల్లో 'ముట్టు' అంటే సాధనమనే అర్థం. కొర అంటే కూడ పని అనే అర్థం. కొరగానివాడు అంటే పనికిరాడు, పనికి తగనివాడు అని అర్థం. కొరకరాని కొయ్య అంటే కొరకడానికి (పంటితో) పనికిరాని కొయ్య అని

[1] No. 1005, S. I. I; Vol. IV

[2] No. 1035, S. I. I; Vol. IV

[3] No. 1046, S. I. I; Vol. IV

కాదు. అయినా కొయ్యను ఎలా కొరుకుతారు. అసలు కొయ్యను కొరకడం ఎందుకు. కొరకరాని కొయ్య అంటే కొరకురాని కొయ్య-పనికిరానికొయ్య, ఉపయోగపడని కొయ్య అని భావించాలి. ఇక ముట్టు సంగతి ఆలోచిద్దాం. ముట్టు అంటే సాధనం అని చెప్పడం జరిగింది. గ్రామనామపరంగా దీని కర్థమిది. ముట్లు సాధనములు. అనగా అధికారులు. రాజ్య కార్యనిర్వాహకులు (Officers) అధికారులు అనే అర్థంలో శాసన ప్రమాణం ఉంది. కనుక ముట్లూరు అంటే రాజోద్యోగుల నివాసము. ఆధునిక కాలంలోని ఆఫీసర్స్ కాలనీలాంటిదన్నమాట.

**ముత్యాల చెరువు :**

ఇదే అనంతపురం జిల్లా గ్రామం. చెరువు తెలిసిందే. ఇక 'ముత్యాలు' ఆభరణాల్లో ఉపయోగించే ముత్యాల సంబంధమైనది కాదు. కన్నడంలో ముత్తుక అంటే ఒక రకం చెట్టు. తెలుగులో దీనికి సమానమైనది మోదుగ. మదన ముత్తకాడ ఒక రకం పాకుడు తీగ. అల అంటే పాకే స్వభావం గలది అని చెప్పడం జరిగినది.

ఇక కృష్ణాజిల్లాలోని ముక్త్యాల కూడా నిజానికి ముత్యాల మొక్క పేరే. సంస్కృతీ కరణం గావించి 'ముక్తి' అర్థంలో స్థిరపరిచారు. పై ముత్యాల చెరువుకు సాళువ నరసింహ సముద్రమని పేరున్నట్లు శాసనాల్లో చెప్పబడింది.

**ముదినేపల్లి :**

ఇది కృష్ణాజిల్లా గ్రామం. ఇందలి ముదిని శబ్దం కూడా ఒక రకం క‹ మొక్కనే సూచిస్తుంది. పదాంతంలోని ఎకారం రావడానికి కారణం తాడేపల్లి మొ‹ లైన వాటిని వివరించినప్పుడు వివరించడం జరిగింది.

**మునబాలపల్లి :**

ఇది నందిగామ తాలూకాలో వుంది. దీని పూర్వనామం మునబలపల్లి. అయితే మునగాలనే పేరుతో మరొక ఊరుంది. మునగాల మునగ, ఆల శబ్దాల కలయిక. మునగ, ములగ మనకు తెలుసు అయితే ఇది, ఆ ములగ కాదు. ఇది ఒకరకం గడ్డి మొక్క. కనగాల కూడా అలాంటిదే. కనుపర్రు, కనుమూరు, కనిగిరి మొదలైన వాటిలోని కని లేక కనప (Sorghun halepense. pers) అనేది ఒక విధమైన ప్రాకే మొక్క. ఆలము, ఆల శబ్దాలను ముందు వివరించడం జరిగింది. మిరియాల,

కంకణాల కూడా ఇలాంటివే. అయితే ప్రస్తుత ఉపయోగిస్తున్న మిరియాలకు, ఈ మిరియాల గడ్డికి సంబంధం లేదు. అదివేరు ఇదివేరు. కాని మిరపకాయలకు మాత్రం, ఆ పేరు మనం ఉపయోగిస్తున్న మిరియాల వల్లనే వచ్చింది. మిరియపు గుణం అంటే కారుగా వుండడం వలన మిరపకాయలకు ఆ పేరు వచ్చింది. మిరియపుకాయ మిరపకాయ అయింది. మిరపకాయలు దేశీయమైనవి కావు. కనుకనే ప్రసిద్ధి దేవాలయాలలో చేసే ప్రసాదాలలో కేవలం మిరియాలనే ఉపయోగిస్తారు తప్ప మిరపకాయలను ఉపయోగించరు.

**మునమాక :**

గుంటూరుజిల్లా నరసరావు పేట తాలూకా గ్రామం. దీని పూర్వనామం ములు వుంపాక. పాపయారాధ్యుల గృహనామం ములుగు. ములుగు ఒక గ్రామ నామం కూడా (వరంగల్ జిల్లా) వ్యవహారంలో మునమాకగా స్థిరపడింది. ఇక్కడ అమరేశ్వర స్వామి ఆలయముంది. పాక, అంటే చిన్న ఆవాస గృహము. తాటాకుల పాక తెలిసిందే. అయితే పాకను తమిళంలో పాక్కం అంటారు. ఉదా : నుంగం బాక్కం, మీసంబాక్కం అక్కడ జనావాసమనే అర్థం. తెలుగులో కూడ గ్రామనామ పరంగా అలాగే గ్రహించాలి. నెల్లూరి సీమకు పాకనాడని పేరు.

**ముమ్మిడివరం :**

తూర్పుగోదావరి జిల్లా గ్రామం. దీని సరియైన పేరు ముమ్మడివరం. ఇమ్మడి అంటే రెండు. ముమ్మడి అంటే మూడు. ఒక రాజవంశంలో ఒకే పేరు గలవారు అధికంగా ఉన్నప్పుడు ఇలా వ్యవహరించేవారు. ఇలాంటి మూడవవాని పేరుమీద ఇది ఏర్పడింది. కోనవంశంలో ముమ్మడిరాజు గలడు. మరి ఇది అతని పేరుమీద ఏర్పడిందో లేక కోరుకొండ నేలిన ముమ్మడి నాయకుని పేరు మీద ఏర్పడిందో తెలియదు. ఈ ఊరి పేరుతో ఏర్పడిన పాడు ముమ్మిడివరప్పాడు. సమీపంలోని భీమవరానికి ముమ్మిడి భీమవరమని పేరు.

**మురికిపూడి :**

ఇది చిలకలూరిపేట సమీపంలో ఉంది. దీని అసలు పేరు మొరకపూడి. ఇది అచ్చటి భూమి ఆకారాన్ని తెలియపరుస్తుంది. గ్రహిణపుమొరిక తెలుసు గదా.

అలా అక్కడ గలవారు భూమిని కోసివేయడం వలన మొరిక ఏర్పడింది. దాని ప్రక్కన గల పూడి మొరికపూడి. ప్రస్తుత గ్రామం వాగు దగ్గరనుండి దూరంగా జరిగింది.

**ముసలిమడుగు :**

కర్నూలు జిల్లా నంది కొట్కూరు తాలూకా గ్రామం. శాసనాల్లో దీని పేరు మొసలిమడుగు. మడుగు లోతైన జలాశయం. మొసలి తెలిసిందే. అయితే లోతైన నదీ గర్భాల్లోను, పెద్ద సరస్సులోనూ ముఖ్యంగా ఆ సరస్సులను నింపే లోతైన వాగులుంటే తప్ప మొసళ్ళు వుండే అవకాశం లేదు. ఇది మొసలిమడుగు కావచ్చు లేదా ముసలి అంటే ప్రాచీనమైన అర్థంలోను కావచ్చు. జమ్మలమడుగు, గడ్డమణుగు (మడుగు) మొదలైనవి. 'మడుగు' అనుబంధంతో గ్రామాలు కన్పిస్తాయి. ఇంతకు పూర్వం గట్టిరాజ పెంటను గూర్చి ప్రస్తావించినప్పుడు అవసరం చంద్రశేఖరయ్య వారి ప్రస్తావన వచ్చింది. ఆయనే శా.శ. 1452లో (కృష్ణదేవరాయల పాలనాకాలం) మొసలిమడుగు సీమలోని శివపురం గ్రామాన్ని శ్రీశైలమల్లికార్జునునికి దానమిచ్చాడు ఈ దానం, తన ప్రభావైన కృష్ణరాయనికి, తన మేనమామ దేమరుసయ్యకు పుణ్య ప్రాప్తి కొరకుగాను సమర్పించాడు. అంతేగాక కృష్ణరాయని శిలావిగ్రహాన్ని, దేమరుసయ్య విగ్రహాన్ని ప్రతిష్ఠ చేయించినది కూడా ఈయనే. తన మామ పేరు మీదుగా దేమసముద్రమనే అగ్రహారాన్ని బ్రాహ్మణులకు దానం చేశారు. దేమ శబ్ద భూమి కేతు సంబంధి. దేమకేతెపల్లె అనే గ్రామం అనంతపురం జిల్లా హిందూపురం తాలూకాలో ఉంది.

**మేడసానిపల్లె :**

ఇది చిత్తూరుజిల్లాలోని గ్రామం. మేడసాని ఇంటిపేరు గలవారు మొదట ఆ చోట నివాసముండటం వలన ఆ పేరు వచ్చింది. మేడసాని అనేది వ్యక్తి పేరు. అసలు పేరు మేడయసాహిణి. మేడ, మేట, మెట్ట; మిట్ట అనేవి అన్నీ ఒకే మూలం నుండి వచ్చాయి. ఎత్తైన అర్థం. వ్యక్తి నామపదంగా గొప్ప, పెద్ద, ఉన్నత అనే అర్థాలు చెప్పుకోవచ్చు. కుప్పుస్వామి అనే పేరు విని వుంటారు. అలాంటిదే ఇది కూడా. ఇక సాహిణి అంటే సైనికాధికారి. గజ సైన్యాధికారిని గజసాహిణి,

అశ్వాలపై అధికారిని అశ్వసాహిణి అంటారు. ఈ సాహిణి శబ్దం సానిగా రూపొందిం దని పూర్వం చెప్పడం జరిగింది.

**మేడికొండూరు :**

ఇది గుంటూరుజిల్లాలోని గ్రామం. దీనికిగల మరొక పేరు పొన్నమాంబా పురం.

శాసనం : మంగళగిరి : గుంటూరు తాలూకా; గుంటూరు జిల్లా

మేడుకొండూరి ఖంౘడిక ప్రతి నామధేయమైన పొన్నమాంబా పురము గ్రామము 1కి గుడికట్టి కుచ్చళ్ళు.... [1] (శ. వ. 1460)

ఇదే జిల్లాలో కల నల్లపాడుకు నరసింగపురమని, గోళ్ళమూడికి అవుభళా పురమనే పేర్లున్నాయి. ఈ మూడు గ్రామాల వివరాలు మంగళగిరి శాసనంలో కలవు. ఈ శాసనం సదాశివమహిరాయల పాలనాకాలంలో మండలేశ్వరులైన సిద్ధిరాజు అవుభళా రాజు కుమారుడు తిమ్మరాజు వేయించాడు. బహుశా తన తండ్రి పేరు మీదుగా తాటూరు పేరు అవుభళాపురంగా మార్చాడని భావించవచ్చు, మేడికొండూరు కాక మరొక గ్రామం పెదకొండూరు కలదు. మేడి వృక్ష సంబంధి. (Flcus glometra Roxb) కొండు, కోడు (ప్రవాహం) శబ్ద సంబంధి. కంఠమరాజు పేరు మీదుగా వచ్చిన కొండూరు. కంఠమహారాజు అనే ఇంటిపేరు గలవారున్నారు.

**మేరికపూడి :**

నరసరావుపేట తాలూకా గ్రామం. ఇది మెరుగు, మెరుపులతో సంబంధ మున్నది కాదు. దీర్ఘం స్పష్టంగా నిలిచింది. మెరుగ ఇంటిపేరుగా కూడా కన్పిస్తుంది. మెరిగ లేక మెరిక అనేది ఒక రకం గడ్డి. ఉర్రంకి (Iscbamum pilosvm Hack) లాగా వుంటుంది పశువుల మేతకు పనికి వస్తుంది. గాజు వస్తువులు పెట్టెల్లో పెట్టి ఎగుమతి చేసేటప్పుడు రాపిడి, వత్తిడి లేకుండా, మెత్తగా ఉండే టందుకు ఉపయోగిస్తారు. దుబ్బుగా పెరుగుతుంది. "పూడి" సమీపంలోని వాగు వలన వచ్చింది. మెరుపు కాంతికి సంబంధించినది. మెరుగు పదాన్ని కాచిన నెయ్యికి పర్యాయంగా ఉపయోగిస్తారు. మెరుగుబోడి అనడంలో, నేయివంటి కాంతి కలిగిన దని అర్థం.

---

[1] No. 709, S. I. I; Vol. iv

## మైలాడుదురై :

ఐదేండ్లకు పూర్వం తంజావూరు జిల్లాలో పెనుతుఫాను సంభవించిన సందర్భంలో, వార్తా పత్రికల్లో ఈ ఊరిపేరు ప్రముఖంగా ప్రస్తావింపబడింది. అయితే పైన వ్రాసిన విధంగా కాదు. పైన సూచించినది దాని వాస్తవ రూపము. కాగా పత్రికల్లో "మయిలాదుతురాయి" గా వ్రాశారు. దీనికి కారణం వార్తలు టెలెక్స్‌పై రోమను లిపిలో రావడం. దాని రూపం ఇలా వుంటుంది. **Mayiladu-turai.** ఆ ఊరిపేరు వాస్తవ రూపం తెలియని కంపోజిటర్ దాన్ని యథాతథంగా తెలుగులోనికి లిప్యంతరీకరణం గావించడంతో ఈ తబ్బిబ్బు ఏర్పడినది. ఇక దీని అర్థం. మయిల్ అంటే నెమళ్ళు, ఆడు అనగా ఆడుట. అనగా నెమళ్ళు ఆడేతురై అన్నమాట. తురై అనేది ఊరు. పల్లె, పాడులవంటి గ్రామ నామానుబంధం. మొగలితుర్రులోని తుర్రు, ఈతురై రెండూ ఒకటే ఈ మయిలాడుతురైనే ప్రస్తుతము మనం మాయవరంగా వ్యవహరిస్తున్నాము. మనవి కాకపోయినా, పై ఊళ్ళను గూర్చి ఇంత వివరముగా చెప్పవలసి రావడానికి కారణం పేర్లు సమంగా తెలియక పోతే కలిగే ఇబ్బందిని సూచించడం కొరకే.

## మొఖాసా కలువపూడి :

కృష్ణాజిల్లా గ్రామం. గుడివాడ తాలూకాలో వుంది. దీనికి పేరు రావడానికి కారణం, సమీపంలో మరొక కలువపూడి వుంది. దానిని శేరీ కలువపూడి అంటారు. మొఖాసా అంటే జమీందారు తన బంధువులకు ఉచితంగా ఇచ్చిన భూమి కావచ్చును లేదా తక్కువ పన్నుకు ఇచ్చినది కావచ్చును. శేరికి దీనికి కొంత భేదం వుంది. శేరీ భూమికి భూకామందు కొంత పన్ను కట్టవలసి వుంటుంది. అయితే ప్రభుత్వానికి ప్రత్యక్షంగా పన్నుకట్టే అవసరముండదు. స్థానిక జమీందారుకు కట్టవలసి వుంటుంది. వీరపల్లి మొఖాసాకూడా ఇలాంటిదే. మొఖాసాదారుల యాజమాన్యంలో చాలా భూమి వుంటుంది. అయితే జమీందారులు కారు. వారికి లోబడి వుండేవారు. విజయవాడలోని మొఘల్రాజపురం, కాట్రగడ్డ వారికి మొఖాసా అని పెద్దలు చెప్పగా వినడం జరిగింది.

## మొగలితుర్రు :

పశ్చిమ గోదావరి జిల్లా గ్రామం. మొగలి, తుర్రుల కలయిక మొగలి. మొగలి (**Pandanus odoratissimus, Linn**) ఒక రకం మొక్కగా తెలిసిందే.

ఆకుల అంచున ముళ్ళలాగా వుంటాయి. సుమారు 20 అడుగులపైన పెరుగుతుంది. ఏ నేలలోనైనా పెరుగుతుంది గాని, సముద్రతీర భూములలో, తేలికపాటి నేలల్లో బాగా పెరుగుతుంది. దీని పువ్వు చాలా సువాసనగా వుంటుంది. చేలకు కంచెగా నాటడం కూడా ఉంది.

ఇక తుర్రు, నేల స్వభావాన్ని సూచిస్తుంది. ముఖ్యంగా ప్రవాహాల వెంట, ప్రవాహ మట్టానికి కొంచెం ఎత్తుగా ఉండి, ఇసుకపొరు కలిగిన నేల. అయితే బుసక కాదు. బుసక మరీ మెత్తగా ఉంటుంది ఇసుక అన్నంత మాత్రంచేత, నది లోని ఇసుకతో కూడా పోల్చి చూడరాదు.

అయితే ప్రస్తుతం వార్తా పత్రికలలో "మొగల్తూరు" అని వ్రాస్తున్నారు. ఇది పొరపాటు. గ్రామ నామాలను చిత్తం వచ్చినట్లు మార్చరాదు. ఇది అలసత్వంతో జరుగుతున్న పనిగా భావించాలి.

మొనపాలెం :

నెల్లూరు జిల్లా గూడూరు తాలూకా రేవుపట్నం గల గ్రామము. మొన అంటే చివర. పాలెం ముందు వివరింపబడింది. సముద్రతీర ప్రాంతం కావటం వల్ల రేవుకూడా ఉంది. దీనిని మొనపాలెం రేవు అని కూడా అంటారు. బ్లాక్ వుడ్ హార్బరు అనేది దీనికి గల మరొక పేరు. సర్ హెన్రీ బ్లాక్ వుడ్ అనే ఇంగ్లీషు దొర పేరులో ఇలా పిలవటం జరిగింది. దీనిని రేవుగా తీర్చి దిద్దడంలో ఇతడు చాలా కృషి చేసాడు. దీనికి సమీపంలోనిదే దుగరాజపట్నం.

మోటుపల్లి :

బాపట్ల తాలూకా గ్రామం వెనుకటి నాళ్ళలో ప్రసిద్ధమైన రేవు. మోటు అంటే పెద్ద. పల్లి తెలిసిందే. దీనికి గల మరొక పేరు దేశీయుకొండ పట్టణం. సముద్రతీర నగరమనే భావనలో వేళా నగరమని కూడా సంభావితము. వేలము అంటే తీర ప్రాంతము. వేళ సమయార్థంలో తెలిసిందే. కాగా సముద్రము, సముద్రములో పర్యాయ కాలక్రమానుగుణంగా వచ్చే ఆటు పోటులను కూడ (వేళ ననుసరించి వచ్చేవి) వేళ అనడం వుంది.

ఇక్కడి దైవం గణపతి ప్రసన్న కేశవ దేవుడు. ఈ పేరు కాకతి గణపతి దేవుని పేరుమీదుగా వచ్చింది. శక సంవత్సరం 1153 ఖరనామ సంవత్సర జ్యేష్ఠ బహుళ అమావాస్య సూర్యగ్రహణ కాలమందు ముక్కంటి కాడ్వెట్టి వంశానికి

చెందిన సిద్ధయ దేవమహారాజు ఆదూరు గ్రామాన్ని కాకతి గణపతి దేవునికి ధర్మువుగా ఈ దేవునికి సమర్పించాడు. ఆదూరు అసలు పేరు ఆదు[్రు.

మోదుగుల పాలెం :

చిత్తూరు జిల్లా, కాళహస్తి తాలూకా గ్రామం. పాలెం ముందు వివరింపబడింది మోదుగచెట్టు (Butea Prondra koen) తెలిసిందే. అయితే ఇది ఇంటి పేరు మీదుగా వచ్చిన గ్రామం. పాలెం అనే అనుబంధం ఈ ఊహకు ఆస్కారం. అంటే మొదట మోదుగులవారి పాలెంగా వ్యవహరింపబడి, కాలక్రమంలో మోదుగుల పాలెం అని స్థిరపడి యుండాలి. పొందుగల, అందుగల అనే గ్రామాలున్నాయి. అలాగే మోదుగల గ్రామం ఉండి ఉండాలి. ఆ ఊరినుంచి మొదట వలస వచ్చిన వారు నిర్మించిన గ్రామంగా ఇది మోదుగలపాలెం కావచ్చును. లేదా మోదుగుచెట్లు అధికంగా వున్నచోట వచ్చిన శివారు గ్రామం కావచ్చును.

ఇక దీనిని పూర్వం కుమార కాళహస్తి అని వ్యవహరించినట్లు శాసనాల్లో పేర్కొనబడింది. ఇదే తాలూకాలో అందరికీ తెలిసిన శ్రీకాళహస్తిగాక, శ్రీకాళహస్తి పురం అనే తూమ్మలగుంట, ఎర్ర కాళహస్తి గుంట అనే గ్రామాలున్నాయి. గుంటూరు జిల్లా తెనాలి తాలూకాలో మోదుకూరు (మోదుకు[్రు) అనే గ్రామము ఉంది. శాసనాల్లో ఇది ప్రోంతకు[్రుగా వ్యవహరింపబడింది. అలాగే పశ్చిమ గోదావరి జిల్లాలోని మోగల్లుకు పూర్వనామం ప్రోంగొలను.

మోపూరు :

ఇది పులివెందుల తాలూకాలోవుంది. దీని పూర్వనామం మోపురి మోపూరి భైరవుని ప్రస్తావన క్రీడాభిరామంలో కన్పిస్తుంది. ఈ మోపూరిలో భైరవస్వామి ఆలయముంది. అయితే ఇది మోప[్రు అనిపిస్తోంది. ప్రోంతకు[్రు మొదలయినవి శాసనాల్లో కనిపిస్తాయి. మరొక మోపూరు జిల్లా కృల్లాలో గుడివాడకు సమీపాన వుంది. మోప[్రు గుంటూరు జిల్లాలో వుంది. ఇచ్చట "మో" శబ్దం పెద్ద అనే అర్థం ఇస్తుంది.

మోరుబాగలు :

ఇది అనంతపురం జిల్లా గ్రామం. ఇందలి మోరు శబ్దం మోర నుండి వ్యుత్పన్నం. అంటే ముఖం. ముందర అని అర్థం. బాగలు కన్నడ శబ్దం. వాకిలి అని అర్థం. గుడి మోర మోగలు అనే ఊరు కూడా వుంది. అంటే గుడి ముందరి వాకిలి అని అర్థం. వాకిలి పేరుతో గల మరో ఊరు యాటవాకిలి.

మో ర్శి పే ట :

రేపల్లె తాలూకా గ్రామం. 1753 ప్రాంతంలో మచిలీపట్నాన్ని పాలించిన ఫ్రెంచి గవర్నరు యం. మోర్శిన్ అనే ఆయన పేరు మీదుగా ఏర్పడింది. నేటి మచిలీపట్నంలోని రాబర్ట్సన్ పేట 1816 లో కొద్దికాలం కలెక్టరుగా పనిచేసిన ఎఫ్. డబ్ల్యు. రాబర్టుసన్ పేరుమీద ఏర్పడింది.

యా ద గి రి :

వరంగల్లు జిల్లాలోని ప్రసిద్ధ వైష్ణవక్షేత్రం. ఇక్కడి స్వామి నరసింహ స్వామి. యాదవగిరి, యాదగిరిగా మారిందని వ్యుత్పత్తి చెపుతారు. యాదవ వంశ నామం. యదు సంబంధమైనదది యాదవ. శ్రీకృష్ణ భగవానుడు యదు వంశస్థుడు గనుక, అతడే విష్ణువు గనుక, నరసింహావతారం విష్ణు సంబంధి గనుక, అతడు ఆవిర్భవించిన గిరి కనుక ఇది యాదవగిరి అనీ, కాలక్రమంలో యాదగిరి అయిందనీ, చెప్తుతారు.

నరసింహస్వామి నెలకొన్న ఏ చోటునైనా వేదగిరి అని పిలవవచ్చు. యాద గిరిని వేదగిరి అని కూడా అంటారు. ఇది ఒక సంకేత నామం. కనుకనే కృష్ణా నది ఒడ్డున (జగ్గయ్యపేట సమీపంలో) గల నరసింహ క్షేత్రం కూడా వేదాద్రి అని పిలువబడుతోంది. దీని అసలు పేరు వేలాద్రి వేలము అంటే ఒడ్డు, తీరము. మరొక వేదాద్రి నెల్లూరు జిల్లాలో వుంది. ఎగువ యాదగిరి, దిగువ తొన్నవాడ అనేపాట వినే వుంటారు. ఈ పాటలోని యాదగిరి నెల్లూరు జిల్లాలోని యాదగిరి. పై పద్ధతిలో మంగళగిరి కూడా వేదాద్రియే. "వేదాద్రి నరసింహ విపుల వక్ష స్థలీకల్హార మాలికా గంధలహరి" అన్న శ్రీనాధుని పలుకులోని వేదాద్రి రాజ మహేంద్ర వరంలోని నరసింహస్వామి ఆలయాన్ని గూర్చి చెప్పిందే. ఈ సంగతి తెలియనివారు అంతర్వేది అని భ్రమకు లోనైనారు.

యా నా ము :

కాకినాడకు సమీపంలో కేంద్రపాలిత ప్రాంతం పాండిచ్చేరికి చెందిన గ్రామం. యానాం అంటే సముద్రపు ఒడ్డు అని అర్థం. అమలాపురం తాలూకాలో చిర యానాం, సూరసాని యానాం అనే గ్రామాలున్నాయి. చిర అనేది ఒక రకం ఆకు మొక్క. కూరగా వాడతారు. ఇక సూరసానియానాం అనేది వ్యక్తిపేరు మీదుగా వచ్చినది. సూరసాని అనే నట్టువకత్తెకు ఈ నామముగా ఇవ్వబడిన గ్రామం.

**రంపచోడవరం :**

తూర్పు గోదావరిజిల్లా గ్రామం. చోడవరాలు ఒకటికి మించి ఉండడం వలన, ఇది రంప దగ్గర చోడవరం గనుక రంపచోడవరం అయింది. చోడుల కాలంలో వచ్చిన గ్రామం. వరం శబ్దం ఇంతకు పూర్వం వివరించడం జరిగింది. ఇక రంప అనేది ఒక చెట్టు. వెనుక తాళ్ళలో చాలా రకాలున్నాయని అందులో రాప్తాడు ఒకటని చెప్పడం జరిగింది. ఇది దానికి సంబంధించింది. కడప జిల్లాలో రంపతాడు అనే గ్రామం ఉంది.

**రంపతాడు :**

కడప తాలూకా గ్రామం. వెనుక తాడిగురించి చెప్పినపుడు రాప్తాడు గురించి చెప్పడం జరిగింది. ఈ రెండూ ఒక్కటే. రంపచోడవరంలోని రంప కూడా ఇదే. సమీపంలోని చోడవరాలను వివక్షింపడం కొరకు అలా చెప్పడం జరిగింది. రంప ఎఱ్రపాలెం అనే గ్రామం రాజమండ్రి తాలూకాలో వుంది.

**రసీదుపురం :**

ప్రకాశంజిల్లా కనిగిరి తాలూకా గ్రామం. డబ్బు చెల్లించేటప్పుడు గుర్తుగా ఇచ్చే రసీదు (receipt) కు, ఈ గ్రామ నామంలోని రసీదుకు ఏమీ సంబంధం లేదు. ఇది రషీద్ అనే మహమ్మదీయ వ్యక్తి నామ సంబంధి. రషీద్ వ్యవహార ములో రసీదు అయింది. చెల్లింపుకు గుర్తుగా ఇచ్చే రసీదు ఆంగ్ల శబ్దం receipt (రిసీట్) నుండి వ్యుత్పన్నమైంది. చివరి 'ట' కారం 'ద' కారాంగా మారింది. ఆంగ్లంలో 'ట' కార సంకేతం 't' కేవలం 'ట' కారానికే గాక, 'త' కార 'ద' కారాలకు కూడా సంకేతం కావడం వలన పై విధంగా జరిగింది. దీనిని కొంత వరకు అంగీకరింపవచ్చు. కాని విద్యార్థికులు సైతం ఆంగ్లభాషా మర్యాద నెరుగక 'రసీప్ట్' అనడం క్షమార్హం కాదు.

**రాజమహేంద్రవరం :**

తూర్పుగోదావరిజిల్లాలోని ప్రసిద్ధ జనావాసం. చాళుక్య వంశస్థులకు, రెడ్డి రాజులకు, ఇంకా మరికొన్ని వంశాలకు ఇది రాజధానిగా ప్రవర్తిల్లినది. రాజరాజు పేరణపై నన్నయ్య మహాభారతం ప్రభవింప చేసిందిక్కడే. దీనికి గల మరొక పేరు జననాథనగరి ప్రస్తుత వ్యవహార నామం రాజమండ్రి. రాజమహేంద్రవరము, రాజమహేంద్రమై, రోమను లిప్యంతరీకరణంలో Rajahmundry కావడం వలన

'ద' దకారంగా మారి రాజమంద్రి అని సిద్ధించింది. శ్రీనాదుడు దీనిని రాజ మహేంద్రము- రాజమహేంద్రపురమని సంభావించాడు శాసనాల్లో రాజమహేంద్ర పట్టణంగా పేర్కొనబడింది. ఇది కాక, ఇదే తాలూకాలో మరి రెండు గ్రామాలు రాజమంద్రి పేరుతో గలవు.

**రాజాపేట :**

గుంటూరు జిల్లా చిలకలూరిపేట సమీప గ్రామం. ఇది రాజా వాసిరెడ్డి వెంక టాద్రి నాయని కాలంలో వచ్చింది. ఈ ప్రాంతానికంతటికి ఆయనకు సంబంధించిన కార్యస్థానమిది. అంటే నేటి తాలూకా కేంద్రం లాంటిది. పేట ముందు వివరింప బడింది.

**రాపర్రు :**

ఇది కృష్ణా జిల్లాలో కలదు. రాపర్తి పేరుతో తూర్పుగోదావరి జిల్లాలో ఉంది. రా అంటే నల్లని. అంటే ఇక్కడ భూమి రంగును సూచిస్తుంది. పర్రు, పర్తి శబ్దాలను ముందు వివరించడం జరిగింది. రామదుగు అనే గ్రామం చిత్తూరు జిల్లాలో కలదు.

**రామచంద్రపాలెం :**

గుంటూరు జిల్లా మంగళగిరి సమీపగ్రామం. ఇది నిజానికి రామచంద్రాపురం రికార్డుల్లో అలాగేవుంది. వ్యవహారంలో రామచంద్రపాలెం అయింది. ప్రస్తుత మున్నవూరు కొత్తగా వచ్చినది. పూర్వపు గ్రామం కృష్ణానదీ గర్భంలో కలిసి పోయింది. సమీపంలోని పాతూరు కూడా క్రొత్తగా వచ్చినదే. శక సంవత్సరం 1344 లో పరిపాలనలో నున్న శ్రీవీర ప్రధిత ప్రతాపమహిమా శ్రీదేవరాయని కుమారుడు రామచంద్ర నృపతి పేరుమీదుగా ఈ గ్రామమేర్పడింది.

**రామాపురం :**

అనంతపురంజిల్లా గుత్తి తాలూకా గ్రామం. ఈ పేరుతో ఇతర ప్రాంతాలలో కూడా చాలా గ్రామాలుండవచ్చు. ఇటువంటివి అవి నిర్మించిన వ్యక్తి పేరుతో గాని, అక్కడ నెలకొన్న దైవం పేరుతోగాని వచ్చి యుండవచ్చు. ఈ రామాపురం ఇక్కడ నెలకొన్న దైవం పేరు మీదుగా వచ్చింది. అయితే దీని అసలు పేరు జరివూటి లేక జరివూట్ల గ్రామం. క్రీ.శ. 1497 నాటికి పాలనలో నున్న సాళువ ఇమ్మడి నరసింహరాయల కాలంలో కూడా ఇది జరివూట గ్రామంగానే పేర్కొన

బడింది. ఈ గ్రామానికి తూర్పున తండిసిమానివంక, దక్షిణాన పెన్న, పడమట చీకిరేనుమానిదోవ, ఉత్తరాన తొడుకుమట్టి కనుమ సరిహద్దులుగా వున్నట్లు చెప్పబడింది.

రాయగడ :

ఒరిస్సా రాష్ట్రంలో తెలుగువారు అధికంగా గల గ్రామం. ఇందలి 'రాయ' శబ్దం 'రాజు' నుండి ఉత్పన్నమైనది. రాజ శబ్దంలోని 'జ' కారం లోపించగా 'అ' కారం 'య' కారంగా మారి స్థిరపడింది.

రాజ > రా అ > రాయ

ఇది 'రావ'గా కూడా మారింది. ప్రస్తుతం తెలుగువారి పేర్లలోని 'రావు' ఇలా ఏర్పడిందే. రాజ శబ్ద మరో రూపం రాచ. ఇందలి చ కారం దంత్యం.

ఇక 'గడ' శబ్దం 'ఘడ్' శబ్ద సంబంధి. తెలంగాణంలో ముఖ్యంగా సంస్థానాధిపతుల నివాస భవనాల విషయంలో విన్పించే 'గడీ' కూడ ఇదే. ఐతే ఇక్కడో విశేషముంది. ఘడ్ లోని 'డ' కారం తెలుగులో గల డకారం కాదు. అంటే ఉచ్చారణ అంత స్పష్టంగా వుండదు. కొంత తేల్చి పలుకువారు భాషా శాస్త్రపరంగా దీనిని శిథిల 'డ' కారమంటారు. అండ, పిండ, శబ్దాల్లోని డకారం వేరు. ఇచ్చట 'డ' కారోచ్చారణ స్పష్టంగా ఉంటుంది. ఈ రెంటిలోని భేదాన్ని సూచించడానికి ఆంగ్లేయులు 'శిథిల' డకార విషయంలో రోమన్ లిపిలోని 'ఆర్'(R) అనే అక్షరం వ్రాసి దాని క్రింద ఒక చుక్క (Ṛ) వుంచినారు. రైలు పెట్టెలమీద 'హౌరా' అని వ్రాసిన దానిని గమనించండి. నాగర లిపిలో హౌడా అని, రోమన్ లిపిలో 'హౌరా' (Howra). తెలుగు లిపిలో కూడా పై విధంగా వ్రాస్తున్నారు. కాని ఆంగ్లేయుల పాలనాకాలంలో రోమన్ లిపిలో Howṛa అని వ్రాసేవారు. అలాగే ధార్వాడ విషయంలో కూడా నేడు Darwar అని వ్రాస్తున్నారు. నిజానికి అలా వ్రాయడం పొరపాటు. తెలుగులో శిథిల డకారం లేదు. కావున వారి ఉచ్చరణకు అనుగుణంగా సాధారణ 'డ'కారాన్నే ఉచ్చరిస్తారు. మనం 'హౌరా' అంటున్నదాని అసలు పేరు హవడా. ఇందలి 'డ' కారాన్ని కొంత తేల్చి పలకాలి. ఊర్ల పేర్లు సమంగా తెలియకపోతే వచ్చే ఇబ్బంది ఇది.

రాయదుర్గం :

అనంతపురం జిల్లాలో ఈ పేరుతో గల తాలూకా కేంద్రస్థానం. రాయ,

రాజ శబ్దం సంబంధి. దుర్గం రక్షితమైన కోటను సూచిస్తుంది. స్థలదుర్గం, జలదుర్గం, గిరి దుర్గం ఇందలి భేదాలు. చుట్టూ నీరుగల దుర్గం జలదుర్గం కొల్లేరు కోట ఇలాంటిదే. అద్దంకి స్థలదుర్గం మైదాన ప్రాంతంలోనిది. కొండవీడు, కొండపల్లెలు గిరి దుర్గాలు. ఈ రాయదుర్గం గూడ గిరి దుర్గమే. దీనికి మరో పేరు రాయగిరి. మాధవరాయస్వామి ఇందలి అధిష్ఠాన దైవం. ఈ దైవానికి సదాశివ దేవ మహారాయల పాలనాకాలంలో (శక 1478) అరవీటి బుక్కరాజు, రామరాజు, తిమ్మరాజు మనుమడు విఠలరాజు కుమారుడు అయిన కృష్ణమరాజు బాగినాయన పల్లె అనే గ్రామం దానం చేశాడు. దీనికి గల మరొక పేరు మాధవరాయపురం. బహుశా ఇది ఈ దేవుని పేరై ఉండాలి. దీనికి నాలుగువైపులా భూప సముద్రం (ఇది ఇంతకు పూర్వం వివరింపబడింది) దక్షిణమున బెల్లోడు, పడమర పుడువ గోళం (నేటి ఉడేగోళం) ఉత్తరాన హెగ్గడి వున్నట్లు చెప్పబడ్డాయి. ఈ హెగ్గడికి మరో పేరు అపలాపురం, బాగినాయనపల్లె, రాయదుర్గం వెంఠియానికి చెందినదిగా చెప్పబడింది. వెంఠియ శబ్దానికి అర్థం పూర్వం వివరింపబడింది. ఇక రాయదుర్గం రోమన్ లిపిలో రాయద్రుగ్ (Rayadrug) గా వ్రాయబడడం వింత.

రాయచోటి :

కడప జిల్లాలో ఆ పేరుతో గల తాలూకాకు కేంద్రస్థానం. రాజవాసము అని అర్థం. దీని పూర్వనామం రాచవీడు. కాలక్రమంలో రాయచోటి అయింది. ఇక్కడి అధిష్ఠాన దైవం వీరభద్రేశ్వరుడు. కాగా శాసనాల్లో వీరేశ్వరునిగా పేర్కొనడం జరిగింది.

రాయికొరడు :

విశాఖపట్నం జిల్లా గ్రామం. ఇందలి రాయి శిలా సంబంధి కాదు. రావి సంబంధి. రావి ఒక చెట్టుగా తెలుసు. ఇది అది కూడా కాదు. ప్రత్యేక ఆకృతి గల భూమి. దీని వివరణ రావూరు దగ్గర చూడవచ్చు. కొరడు అంటే పనికిరానిది అని అర్థం. లోగడ 'కొర' శబ్దం వివరించడం జరిగింది. కొర అంటె ఉపయోగానికి వచ్చేది, పనికివచ్చేది అని అర్థాలు. కొరగానివాడు అంటే ఉపయోగపడని వాడు, పనికిరానివాడు అని అర్థాలు. కొర శబ్దంమీద 'డు' చేరి కొరడు అయింది. ఫలితార్థం పనికిరానిది. ఉపయోగంలో లేనిది అని అర్థం. చేయడు, వెళ్ళడు మొదలయిన వాటిలో 'డు' కు ముందు వ్యతిరేకార్థకం ప్రత్యయం 'అ' వుంది. చేయు + అ + డు = చేయడు 'కొరడు'లో శబ్దగతంగానే 'అ' వుంది. కనుక

వేరుగా 'అ' చేరినట్లు కన్పించడంలేదు. నిజానికి శబ్దగతమైన అకారం లోపించి వ్యతిరేకార్థక ప్రత్యయం 'అ' చేరిందని భావించాలి.

ఇక బంజరు, బీడు భూములను కొరకు అంటారు. పశువులను కొరదుకు తోలడం అనే మాట విని ఉంటారు. పెద్ద రైతులు (జమీందారులు) కొందరు తమ పశువుల మేతకొరకు కొంత భూమిని కొరదుగా వదిలేవారు.

రావినూతల :

ప్రకాశం జిల్లా గ్రామం 'రావి' చెట్టుగా కాక, నీటివరి ఎత్తైన భూమి, ఏటవాలుగా వాలిన భూమి. ఇక నూతుల లేక నూతల అనేది జలాధార సంబంధి యైన నూయికి బహువచనంగాదు. నూత, నూవ అనేవి ఒక రకం మొక్క. నూతక్కలోని నూత కూడ ఇదే నూవక్కకి శాసనస్థనామం నూదెంకి లేక నూవంకి. ఎన్నూదలగడ్డి, వెన్నిద్దలకాడ రైతులకు తెలిసినవే. నూద అనేది కన్నడంలో ఒక రకం మల్చరీ మొక్కలాగ చెప్పబడింది. వ్యస్తంగా నూతలపాడు, సంతనూతల, కుర్నూతల మొదలైన గ్రామాలు కన్పిస్తాయి.

రాళ్ళపెంట :

రాళ్ళ శబ్దం తెలిసిందే. పెంట పూర్వం పశువులను మందవేసే అడవిలోని స్థలంగా గట్టిరాజుపెంట గ్రామ నామాన్ని వివరించినప్పుడు చెప్పబడింది. వనిపెంట, సునిపెంట కూడా ఇలాంటివే పెంటపాడు కూడా ఇలా ఏర్పడించే.

రావూరు :

ఈ పేరుతో చాలా గ్రామాలు కన్పిస్తాయి. పెదరావూరు, చినరావూరు, సంతరావూరు, దైవాలరావూరులు బాగా పరిచయమైనవి. 'బందరావూరు' అనే గ్రామం శాసనాల్లో కనపిస్తుంది. ఇవి ఊరు అంతంగా కలవి. రావిపెంట, రా పూడి, రావికమ్మపాడు (రావికంపాడు) రావిరేల, రావిపాడు మొదలైనవి ఆవ అనుబంధాలుగల గ్రామాలు. అన్నింటిలోని రావి ఒక్కటే. రావి ఇంటిపేరుగా కూడా కనిపిస్తుంది. ప్రేమాభి రామకర్త రావిపాటి త్రిపురాంతకుడు. మంగళగిరికి సమీపంలోని రాయపూడి అసలు పేరు రావిపూండి. ఈ మేరకు శాసనస్థ సాక్ష్య ముంది. ఇక రావి శబ్దానికర్థం– ఇది రావి చెట్టుకుగాని, రాయికి సంబంధించినది గాని కాదు. ఏదైనా ఒక ప్రవాహం తీరానగల ఎత్తైన భూమియుండి, ఏటవాలుగా

నున్న భూమి 'రావి' ప్రాంత మొక్క రావినుండి అని కాశీఖండంలో శ్రీనాధుని ప్రయోగం. కృష్ణాజిల్లాలోని రావివారి పాలెం, ఆ ఇంటిపేరు (రావి) గలవారు మొదట ఆ చోట ఆవాస మేర్పరచుకోవడం వల్ల వచ్చింది. ఇది మోపిదేవికి సమీపంలో వుంది.

**రా వె ల :**

ఇది గుంటూరు జిల్లా గ్రామం. 'రావి'ని గూర్చి ఇది రావిచెట్టు సంబంధి కావని, భూమి ఆకృతికి సంబంధించినదని ఇంతకు పూర్వం చెప్పడం జరిగింది. రావెలలోని 'రావి' పై రెంటికి సంబంధించినది కాదు. ఇది ఒక రకం కలుపు మొక్క. కాదరాగి (**Eleusine aegypliaca Dist**) అంటే రాయలసీమ జిల్లాలోని వ్యవసాయదారులకు తెలిసిందే. రావులపాలెంలోని 'రావుల' ఒక జాతి జనుల పేరు. రాగి, రావి అవుతుంది. ఇంకొక రాగి, సస్యవాచకం. ఇక ఎళ్ళ, నూజెళ్ళ, వేజెళ్ళలోగల ఎళ్ళలాంటిది. ఇది భూమి స్వభావానికి సంబంధించినది. కేవలం మెట్టనేల. తెలంగాణాలో ఇలాంటి భూముల్ని ఎలగాడి నేలలంటారు.

**రెం ట చిం త ల :**

ఇది గుంటూరుజిల్లా గ్రామం. రెండు చింతలు, రెంటిచింతల కాలేదు. అ యించనుకుని ఈ ఇంటిపేరుగల వారొకరు, దీనిని సంస్కృతీకరించి 'ద్వితింత్రిణి, అని మార్చుకున్నారు. ఇక చింతశబ్దంతో చాలా పేర్లు కన్పిస్తాయి. చింతపల్లి' చింతలపూడి, చింతల్లంక, చింతలూరు మొదలైనవి. ఏమైనా, ఇది వృక్ష సూచకమే. అయితే మనం ఖాద్యపదార్థంగా ఉపయోగిస్తున్న చింతపండుకు సంబంధించిన చెట్టే అన్ని సందర్భాలలోను కాకపోవచ్చు. చింత అనేది ఒక రకం గడ్డిమొక్క కూడా. ఉచ్చింతల తెలిసే ఉంటుంది. కేవలం చింత శబ్దంతో కాక, చిరిచింతల, మూగ చింతలపల్లె, పులిచింతల మొదలైన ఊళ్ళు ఉన్నాయి. ఇవి వేరు వేరు జాతుల మొక్కలు. వేమన తన ఆవాసాన్ని గూర్చి చెప్తూ ఊరు కొండవీడు, ఉనికి పశ్చిమవీధి, మూగ చింతపల్లె మొదటి ఇల్లు అని అంటాడు. కొండవీడులో పశ్చిమవీధిలోగల, మూగచింతపల్లె అనే ఇంటిపేరు గలవారము. అందునా మొదటి ఇంటి వారము అని చెప్తున్నాడు. ఇక్కడ మొదటి ఇల్లు అంటే, ఆ చోట ఆ ఇంటి పేరుగల వారిండ్లలో మొదటిదని కాదు. ఆ ఇంటిపేరు గల వారలలో మొదటి కుదురువారమని అర్థం. ఇలాంటి పరిగణన కొన్ని ఇంటిపేర్ల కుటుంబాలలోవుంది. కాలంమీద కుటుంబాలు పెరిగేకొద్దీ, కొన్ని కుదుర్లుగా విభాగమవుతారు. అలా

కాకపోతే సూతకము మొదలైన వాటివల్ల, శుభకార్యాలు జరిగే ఆస్కారం లేకుండా పోతుంది. అలాకాకపోయినా, ఒకే ఇంటిపేరులో ప్రథమగణ్యత గలవారు ఉంటారు. బ్రాహ్మణుల్లో ప్రథమ శాఖీయుఁనే వ్యవహారం కలదు. మొదటి ఇల్లువారంటే గ్రామీణులకు బాగా పరిచయమైన వ్యవహారమే. ఇంతకు వేమన రెడ్డి వంశీయుడేకాని రెడ్డిరాజ్య వంశీయుడు కాదు.

ఇక సంఖ్యానామంలో (రెంటచింతలవలె) కొన్ని గ్రామాలు కన్పిస్తాయి. ఒంటితాడి, రెంటిపాళ్ళ (పాడులు), ముప్పాళ్ళ, వంచధార్ల, ఆరుగొలను, ఏడుగుండ్లపాడు, అష్టకావేరి, నవఖండవాడ, అచ్యుతాపురంత్రయుం, కల్హారి దశఖండం మొదలైనవి. కాని ఇవన్నీ సంఖ్యా సంబంధులు కావు.

ఈ రెంటచింతల కూడా సంఖ్యావాచక సంబంధికాదు. ఒక రకం మొక్క. రెంటాల కూడ ఇలాంటిదే.

**రొంపిచెర్ల:**

గుంటూరుజిల్లా నరసరావుపేట తాలూకా గ్రామం. రొంపి అంటే బురద. చెర్ల ముందు వివరింపబడింది. ఇక్కడ వేణుగోపాలస్వామి ఆలయముంది అయితే ఈ స్వామి పేరు నిజానికి అనంతగోపినాథస్వామి. ఈ దేవాలయాన్ని కట్టించిన వారు కోట భీమరాజు మంత్రి వల్లభుడు శక. 1157 ఫాల్గుణ శుద్ధ పంచమినాడు తిరుప్రతిష్ఠ జరిగినట్లు శాసనం చెపుతోంది శాసనంలో రొంపి చెరువుగా పేర్కొనబడింది.

**లంకపల్లి:**

కృష్ణాజిల్లాలో ఈ పేరుతో రెండు గ్రామాలున్నాయి. లంక అంటే ప్రవాహ మధ్యంలోని భూమి. చల్లపల్లినుండి బందరు వెళ్ళే మార్గంలో ఒక లంకపల్లి, శ్రీకాకుళానికి సమీపంలో మరొక లంకపల్లి ఉన్నాయి. బందరు వెళ్ళే మార్గంలో గల దానిని దిశను బట్టి తూర్పు లంకపల్లి అని, శ్రీకాకుళానికి సమీపంలో గల దానిని పడమటి లంకపల్లి అని అంటారు. అయితే ఈ పడమటి లంకపల్లికి దేవరలంకపల్లి అని పేరుంది. ఈ పేరుతో ఈ గ్రామాన్ని కృష్ణదేవరాయలు శ్రీకాకుళ దేవాలయానికి దానం చేశాడు. నిజానికి దేవరలంకపల్లి దేవరపల్లి గ్రామ సమీపంలో గలదు లంకపల్లిలాంటి గ్రామాలు ఇంకా ఉండవచ్చు గాజుల్లంక, పులుగుడు లంకల్లో లంకగ్రామ నామాంత్యపదంగా కన్పిస్తుంది. లంకలకో దేరు

అన్నపుడు లంకల అనేది పూర్వపదంగా అంటే విశేషణంగా కనిపిస్తుంది. సమీపంలో మరొక కోడేరు ఉండటం వల్ల వివక్ష మేరకు ఇలా వచ్చింది. ఏమైనా లంక అంటే నీటిమధ్యన ఒకపాటి విస్తృతి గల భూమి. విస్తీర్ణం తక్కువయితే 'తిప్ప'. నాగాయతిప్ప ఇంలాటిది. కాలువ నీటి అంచును, నది అంచున గల భూమికి కూడ లంక అనే వ్యవహారముంది. కృష్ణా, గుంటూరు జిల్లాల్లోని బొబ్బర్లంకలు ఇలాంటివి. ఇక సింహళాన్ని శ్రీలంక అనడం తెలిసిందే. భౌగోళిక స్వభావాన్ని బట్టి లంక అంటున్నారుగాని, రామాయణంలోని లంక ఇది కాదు. రామాయణంలోని లంక హిందూమహాసముద్రంలో భూమధ్యరేఖపై ఢిల్లీ, ఉజ్జయిని, చిత్రకూటంల మీదుగా వెళ్ళే రేఖాంశం కలిసేచోట ఉండేది.

### లక్ష్మీపురం :

ఈ పేరుతో చాలా గ్రామాలు, చాలా జిల్లాలు కనిపిస్తాయి. లక్ష్మి ఐశ్వర్యానికి ప్రతీక. ఇక లక్ష్మీపురాలు వ్యక్తిపరంగాను వచ్చి వుండవచ్చు. దైవపరంగాను వచ్చి ఉండవచ్చు ఇలా ఏర్పడ్డ లక్ష్మీపురాలు సమీపంలో ఒకటికి మించి వున్నపుడు వాటిపై విశేషణాలు చేరతాలు. ఇక్కడ వాటిని గూర్చి చర్చిద్దాం. సంత జరిగే లక్ష్మీపురం సంతలక్ష్మీపురం. ఇది శ్రీకాకుళం జిల్లాలో ఉంది. గుమ్మ లక్ష్మీపురం తెలిసిందే. స్నానాల లక్ష్మీపురం ఖమ్మంజిల్లాలో ఉంది. విశాఖపట్నం జిల్లాలో ఆర్డినరీ లక్ష్మీపురం అనే గ్రామముంది. ఈ పేరు రావటానికి ఒక కారణముంది. సమీపంలో చాలా లక్ష్మీపురాలున్నాయి. ఒక రెవిన్యూ అధికారి ఇప్పుడు మనం అనుకుంటున్న లక్ష్మీపురానికి వెళ్ళవలసివచ్చింది. క్రింది అధికారిని ఏర్పాట్లు చేయమన్నాడట. అతడు ఏ లక్ష్మీపురమని అడుగుతూ, ఆ యా లక్ష్మీపురాల పేర్లన్నీ చెప్పగా అవేవి కాదు. అలాంటివేమీ లేని లక్ష్మీపురం అనే అర్థంలో ఆర్డినరీ లక్ష్మీపురం అన్నాడట. ఈ గ్రామం ఇప్పుడు అలాగే రికార్డు అయింది. విశాఖపట్నం జిల్లాలో చుక్కలవాని లక్ష్మీపురం, దోనివాని లక్ష్మీపురం, పడాలవాని లక్ష్మీపురం, కూకలమెట్ట లక్ష్మీపురం అనేవి ఉన్నాయి. ఇవిగాక కేవలం లక్ష్మీపురం అనే గ్రామాలు ఇంకా వున్నాయి. తూర్పుగోదావరి జిల్లాలో కాశీనగరం లక్ష్మీపురం, మాదవరావుపేట లక్ష్మీపురం, సింగురాం లక్ష్మీపురం, కనుసులూరు లక్ష్మీపురం, జమీందారి లక్ష్మీపురం, లింగంపేట ప్యాచి అనే లక్ష్మీపురం, తూర్పు లక్ష్మీపురం అనే గ్రామాలున్నాయి. ఇవిగాక లక్ష్మీపురాలు కూడా ఉన్నాయి.

లబ్బీపేట :

విజయవాడలోని శాఖానగరం – మహమ్మదీయులలోని ఒక తెగ లబ్బీలు. అరబ్బీ అనే పదానికి వికృతరూపం లబ్బీ (తమిళ ఉచ్చారణలో) నిజానికి వీరు తమిళులే. అరబ్బులకు దేశీయ స్త్రీ సాంగత్యంలో ఉద్భవించినవారు (ఆధారము మద్రాసు ఎడ్మినిస్ట్రేటివ్ మాన్యువల్) తూర్పుకోస్తాలో ముఖ్యంగా పులికాట్ నుండి నాగపట్నం వరకు గల ప్రాంతంలో వీరి ప్రాబల్యమధికం. ఈ తెగవారికి నాగపట్నానికి సమీపములో నాగూరులో గల నాగూరు మీరాసాహెబ్ (ఖాదర్ వలీ) సమాధి, అవశ్యదర్శనీయ, ఆరాధనా స్థలం. వీరు బహుపొదుపరులు. చూడచక్కని వారు. ఏ వృత్తిలోనయినా, ఏ వ్యాపారములోనయినా (పడవ నడపటం నుండి వస్త్రాల వర్తకం వరకు) ముఖ్యంగా చర్మ వర్తకంలో కడుసమర్థులు. వీరుమొదట ఆవాసమేర్పరచుకున్న ప్రాంతం లబ్బీపేట. నేడు వెంకటేశ్వరపురంగా వ్యవహరింపబడుతోంది.

లాం :

శాసన : లాము క్షేత్రము కేసరిపాటిని.

ఇది గుంటూరు జిల్లాలో వుంది. కొండ సమీపానగల భూమినిలా అంటారు. ఈ లాం, లాము అయి, లావు(ఇంటిపేరు)గా మారి వుండవచ్చు.

లింగారావుపాలెం బిల్మక్తా :

ఇది పశ్చిమగోదావరి జిల్లా గ్రామం. లింగారావు అనే వ్యక్తి పేరు మీదుగ ఏర్పడ్డ పాలెం. ఇది 'బిల్మక్తా' అనే మాట నేడు కూడా వ్యవహరిస్తున్నాము. దేనినయినా భూమిని గాని, వస్తువును గాని సెంట్ల లెక్కనగాని, కిలోల లెక్కనగాని, లేక ఏక మొత్తంగా కొనుగోలు చేయడాన్ని 'బిల్మక్తా'గా కొనడము అని వ్యవహరిస్తున్నాము. ఫలసాయానికి సంబంధించి భూమిపై చెల్లించే ప్రభుత్వ పన్ను (శిస్తు) విధింపులో గల భేదం ఈ బిల్మక్తా ఇది ఉర్దూ పదం ఇందలి 'బిల్' ఇంగ్లీషు పదంగాదు. ఉర్దూ పదం 'మక్తా' అంటే కౌలుకు పర్యాయముగా ఉపయోగిస్తున్న సంగతి తెలిసిందే. బిల్మక్తా గ్రామమంటే గుండు గుత్తగా ఇవ్వబడ్డ గ్రామం. వెనకటి తరాల్లో (ఇంగ్లీషువారి పాలనాకాలంలో) భూమిలో ఏ పంటను పండించవలసిందీ ప్రభుత్వం నియంత్రించేది నేడు కూడా ఇది కాగితాలపై

No. 709; S. I. I Vol. IV

అమల్లో వుంది కాని ప్రత్యక్షంగా అలాంటి నియంత్రణ కనిపించటంలేదు. కాని అలాంటి నియంత్రణ చాలా అవసరం అది లేకపోవడం వల్లనే కొన్ని వ్యవసాయో త్పత్తుల కొరత ఏర్పడుతోంది. కొన్ని ఉత్పత్తులు అధికం కావడం వలన రైతుకు గిట్టుబాటు ధర లభ్యం కావడం లేదన్నది వాస్తవం. బిల్మక్తాగా ఇవ్వబడ్డ గ్రామపు భూముల్లో అలాంటి నియంత్రణ ఏమీ లేకుండా, రైతులు తమ ఇష్టం వచ్చిన పైరు లను సేద్యం చేయవచ్చు. ప్రభుత్వానికి ఫలసాయంలో నిమిత్తం లేకుండా నిర్ణ యించిన మేరకు, ఒప్పందం మేరకు పన్ను చెల్లించాలి. సాధారణంగా అయితే పండించే పంటను బట్టి చెల్లింపబడే శిస్తులో భేదం వుంటుంది. పై విధంగా నిర్ణయా నికి లోబడిన గ్రామం కనుక ఇది లింగారావుపాలెం బిల్మక్తా అయింది.

లొల్ల :

తూర్పుగోదావరి జిల్లా రామచంద్రపురం తాలూకా గ్రామం. వ్యర్థము పనికి రాని అనే అర్థాలో లొల్లి శబ్దం తెలిసిందే ఇక్కడ ఆ అర్థం కాదు. లొల్లి లొల్యశబ్ద సంబంధి. ఇది 'లోంగ' అనే కంచెమొక్క. కన్నడంలో లోయి (The plant Aloe perfoliata Lin), లోమిక (The herb Hibiscues esculentros Lin) అనే మొక్కలున్నాయి. లొల్ల ఇంటిపేరుగల వారున్నారు. లోలూరు అనే గ్రామం అనంతపురం జిల్లాలో వుంది.

వంగలపూడి :

తూర్పుగోదావరి జిల్లా గ్రామం. పూడి,నీటిదరి పల్లపు భూమిగాఇంతకుపూర్వం వివరింపబడినది. వంగల అనేది ఒక రకం గడ్డి. అంతే కాని వంకాయ సంబంధి కాదు. చేలల్లో కలుపుగా పెరిగే వంగ మొక్కను గూర్చి రైతులకు తెలిసిందే 'పూడి' రాదగిన పరిసరాలలోని జనవాసం గనుక ఇది వంగలపూడి. ఈ శబ్దంలో ఇంకా వంగలి (అనకాపల్లి తాలూకా) వంగపాడు (కనిగిరి తాలూకా) వంగర (చిక్కోలి తాలూకా) వంగరాద (పర్లాకిమిడి తాలూకా) వంగిమళ్ళ (రాయచోటి తాలూకా) వంగనూరు తాడిపత్రి తాలూకా) వంగంపల్లె (పెనుగొండ తాలూకా) వంగల మడుగు (ఎల్లవరం డివిజన్) లు కన్పిస్తాయి వంగపూడి ఇంటిపేరుగా గల అన్న రెడ్డి అనే వ్యక్తి మోగల్లు శాసనంలో నమోదైనాడు. వంగలి అనే గ్రామం విశాఖ పట్నంజిల్లా అనకాపల్లి తాలూకాలో వుంది.

**వజ్రకరూరు :**

ఇదికూడా అనంతపురం జిల్లా గ్రామమే. వజ్రాలు దొరికే కరూరు గనుక ఇది వజ్రకరూరు. 'కరు' అంటే నల్లని అని అర్థం. నేల స్వభావాన్ని సూచిస్తుంది. తమిళనాడులో మరొక కరూరు ఉంది.

**వడ్డేశ్వరం :**

గుంటూరుజిల్లా మంగళగిరి తాలూకా గ్రామం. వడ్డ+ఈశ్వరంల కలయిక వడ్డేశ్వరం. 'ఈశ్వరం' శబ్దంముందు వివరింపబడింది. వడ్డేశ్వరంలో ఈశ్వరాలయ ముంది. దేవుని పేరుకూడ వడ్డేశ్వరుడు. వడ్డ శబ్దానికర్థం 'శని' వడ్డవారమంటే శనివారమని అర్థం. మందవారమని కూడ వ్యవహారం. తూర్పుగోదావరిజిల్లాలోని, 'మందేశ్వరం' 'శని' దేవాల యముండడం వల్లనే వచ్చింది ఈ వడ్డేశ్వర గ్రామం పూర్వం ఈనాము గ్రామం.

**వత్సవాయి :**

కృష్ణాజిల్లా నందిగామ తాలూకా గ్రామం వాయి, వాక, వాగ అన్నీ ఒకటే అర్థాలనిస్తాయి. వాయి ప్రవాహ సంబంధి పాలువాయి కూడా ఇలాంటిదే. వత్స సంస్కృతంలో బిడ్డ. ముఖ్యంగా దూడకి ఈ అర్థం వర్తిస్తుంది. అయితే, ఇందలి 'వత్స' అదికాదు. ఇది ఒకరకం నీటి మొక్క. కన్నడంలో వచ్చే (An avomatic water-plant, Acoru calamus Lin) ఇదికాక వత్సక కూడా ఒకరకం మొక్క. (The medicinal plant Wrightia autidysrnterica R.) ఔషధాలలో ఉపయోగిస్తారు. చాల ప్రవాహాలు మొక్కల పేర్లతో ఉండడం గమనింప దగ్గది.

**వరగాణి :**

ఇది బాపట్ల తాలూకాలో వుంది. దీని అసలుపేరు ఒరిగాంది. ఈ గ్రామంలో ప్రసన్న చెన్న మల్లేశ్వర దేవాలయముంది. ఇందలి కాంటి లేక కాణి అంటే భూమి అని అర్థం. మాగాణి అంటే పల్లపునేల. కాకాని ఇలా ఏర్పడిందే. ఈ పేరుతో గుంటూరుజిల్లాలో మూడు గ్రామాలున్నాయి. పెదకాకాని, చినకాకాని, నరసరావు పేట తాలూకాలోని కాకాని. పెద్ద, చిన్న అనేవి వివక్ష కొరకు ఏర్పడ్డాయి చిన కాకానిని కుక్కకాకాని అని కూడా అంటారు. పెద్దకాకాని కోటకాకాని, రాజకాకాని అనే వ్యవహారముండేది. కోట శబ్దం కోడు నుండి వచ్చింది. ఒరగాణిలోని ఒర లేక వర వుంటే తేమలేనిదని అర్థం. 'వరపు' తెలుసుకదా 'వాన వరపిచ్చింది' అనే మాట వినే వుంటాము. ఇంతకూ ఇది ఆరు శబ్దభవం. నేల ఆరింది. అన్న

మాట తెలుసుకదా. వ్యవసాయ దారులకు ఆరుతడి నేలలు కూడా బాగా తెలుసు. ఈ ఆరు, ఓరు అయి ఒకగా పరిణమించింది. స్థల నామాలలో వరగా స్థిరపడింది. మొత్తం మీద ఇది నేల స్వభావాన్ని సూచిస్తుంది. ఇక కాకానిలో 'కా అంటే రక్షకుడు', దేవుడు అని చెప్పడం జరిగింది. కాణి అంటే నేల. కాకాని అంటే దేవునికి చెందిన భూమి అని అర్థం. ఇక చినకాకానిని కుక్కకాకాని అనడానికి ఒక కథ వుంది. పూర్వం ఈ గ్రామానికి చెందిన వ్యక్తి తన కుక్కను మరొకరికి ఇవ్వగా, అది తిరిగి తన యజమాని దగ్గరకు రాగా, తన మాట పాటించలేదనే కోపంతో దానిని చంపివేశాడట. అందువలన ఇది కుక్కకాకాని అయిందని ఒక కథనం. అయితే, ఈ మేరకు ఒక వ్యక్తి, కుక్కను మలచిన శిలమాత్రం నేటికీ ఈ ఊరిలో వుంది.

**వర్తల్లపల్లి :**

కృష్ణాజిల్లా బందరు తాలూకాలో ఈ పేరుతో రెండు గ్రామాలున్నాయి. వర్తల్లలోని లకారం మీది ద్విరుక్తత ఊనిక కొరకు వచ్చింది. నిజానికిది వర్తల పల్లి. వర్తల వర్తకు బహువచనం. ఇది ఒక రం మొక్క. వర్త తులసి (Ocimum genus) రైతులకు ముఖ్యంగా కోస్తా ప్రాంతంలోని వారికి తెలుసు. ఇది తుప్పగా పెరుగుతుంది.

**వలందపాలెం :**

కృష్ణాజిల్లా కేంద్రం కార్యస్థానం మచిలీపట్నంలోని ఒక శాఖానగరం(పేట). మచిలీపట్నాన్ని గతంలో ఆంగ్లేయులు, ఫ్రెంచివారు, డచ్చివారు, ఆక్రమించి పాలించారు. వారి వారి పాలనా కాలంలో ఆయా దేశస్థులు వేరు వేరుగా తమకు నివాస ప్రాంతాలు ఏర్పాటు చేసికొన్నారు. ఇంగ్లీషుపాలెం ఆంగ్లేయుల ఆవాసం. ఫ్రెంచి వారి ఆవాసం వారి దేశపు రాజధాని ఫ్రాన్సుపేరుతో పరాసుపేటగా సంభావించడం జరిగింది. ఇక డచ్చివారి నివాసం వలందపాలెం.

డచ్చివారి దేశం పేరు హాలెండు. దీనిని రోమను లిపిలో Holland గా వ్రాస్తారు. తెలుగులో దీని లిప్యంతరీకరణ రూపం (Transcription) హాలంద ఇందలి 'హ' కారం లోపించి 'ఒళంద' అయి వలందగా స్థిరపడింది. మరొక వలందపాలెం ఇదే జిల్లా దివి తాలూకాలో వుంది. విశాఖపట్నం జిల్లా, భీమునిపట్నం తాలూకాలో, కుమ్మరిపాలెం వళంద భూములు అనే గ్రామముంది. సమీపములో కుమ్మరిపాలెం ఉండడం కారణముగా ఆ ఆవాసాన్ని అలా వ్యవహరించడం జరిగింది.

**వ లి వే రు :**

గుంటూరు జిల్లా తెనాలి తాలూకా గ్రామం. వలి, ఏరు లేదా వలివె, ఏరుల కలయిక వలివేరు. స్థానిక ప్రవాహానికి గల పేరు గ్రామానికి స్థిరపడింది. నేడు గ్రామంలో ప్రవాహం కన్పించదు. తుంగభద్ర పేరుతో ఒక ప్రవాహముంది. ఆ ప్రవాహానికే ఇది స్థానికమైన పేరేమో తెలియదు. వలివె అనేది ఒక మొక్క. కన్నడంలో 'వలె' ఒక చిరుధాన్యపు మొక్క. పలివెల, బలిమెలలోని పలివె బలివె అనేవి కూడా మొక్కలే. బలివె అనే గ్రామం కృష్ణా జిల్లాలో వుంది. గొలమె, గొలిమి, మొలవ అనేవి కూడా మొక్కలే.

ఇక్కడ త్రిపురుష లేక త్రైపురుష మహాదేవర ఆలయముంది.[1] ఈ గ్రామం పేరేటి దక్షిణాన ఆరువేల వెలనాటిలో ఉన్నట్లు శాసనాల్లో చెప్పబడింది.[2] పేరేరు అంటే కృష్ణానది. ఇంకా ఈ నదికి పేర్వారె, పేరకమ్మ అనే పేర్లు కూడ ఉన్నాయి. పేరేరు అంటే పెద్ద ఏరు. కృష్ణకంటె చిన్నదిగనుక విజయవాడ సమీపాన గలది బుడమేరు. బుడమ, బుడ్డ అంటే చిన్నది అని అర్థం. బుడమ వడ్లు తెలిసినవే.

శాసనం : వెలనాణ్టి వలివేరి త్రిపురుష దేవరకు ... [1]

ప్లవ సంవత్సరమ్మున బెరేటి దక్షిసమ్మున ఆఱువేల వెలనణ్టి.... [2]

ఇక కమ్మనాటి సంగతి పూర్వం వివరించబడింది. ఆరువేల వెలనాడుకు వివరణ. కమ్మనాడు రెండు భాగాలు. ఒకటి వెలనాడు. రెండవది పలనాడు. వేలము అంటే తీరము. సముద్రాన్ని అంటివున్న తీరప్రాంతము వెలనాడు. దానికి లోపల పడమరగా వున్నది పలనాడు. పల్లెలున్ననాడు పలనాడు. వెలనాడు కూడ రెండు విభాగాలు. వెలనాడు, కొండ పడమటి వెలనాడు. కొండ అంటే కొండవీటి కొండలు. వాటికి పశ్చిమంగా వున్నది అంటే గుంటూరు, నర్సరావుపేట రోడ్డుకు, కొండవీడు కొండలకు మధ్యగల భూభాగం కొండ పడమటి వెలనాడు. ఆ కొండలకు తూర్పునగల భూభాగం వెలనాడు. ఆర్ అనే తమిళ పదం, తెలుగున గల ఏరుతో సమానం. ఫలితార్థం తీసాన్నంటి, ఏర్లు గల భూభాగం ఆరువేలనాడు. నిజమిదికాగా ఆరువేలను సంఖ్యావాచకంగా భావించి, దానిని సంస్కృతీకరించి షట్సహస్ర సీమగా సంభావించారు. తెలుగునాట నియోగి బ్రాహ్మణుల్లో ఆరువేలనాటి వారు ఒక శాఖ.

---

[1] No. 6, S. I. I Vol. X

[2] No. 8, S. I. I. Vol. X

ఏరు ప్రవాహ సూచిగా తెలిసిందే. ఏరు అంటే బాట కూడా. నల్లేరు పై ఖండీ స్వరక అనేది తెలిసిందే. నల్లేరు ఒక ప్రాకే తీగ. అయితే నల్లేరు మొక్క కాదు. నలిగిన ఏరు, కోటేరులాంటి ముక్కు, నాగలి కోటేరు వేయడం తెలిసిందే. పొడవు, ఋజుమార్గము, వక్రత లేనిది అనే అర్థాల్లో పై వాడుక వుంది. ప్రవాహార్థంలో కూడా కనిపించినంతమేర ఋజుమార్గంగా వున్నదే ఏరు అనుకోవాలి. వ్యవహార విస్తృతిచేత, ప్రవాహం పుట్టుకనుండి సముద్ర పర్యంతం ఏరు అనడం వాడుక. ఏటివంకర వరద తీరుస్తుందని సామెత.

**వల్లూరు :**

ఈ పేరుతో చాలా గ్రామాలున్నాయి. 'వళ్' అనే తమిళ పదానికి గొప్ప, పెద్ద, విస్తృతము, సారవంతము అనే అర్థాలున్నాయి. వళ మైయాన్ అంటే వ్యవసాయ దార్లు. ఇదిగాక వళ్లె అంటే ఒక మొక్క. తెలుగులో తుండికూరలాంటిది. ఊరు అనుబంధంగా కలిగి వుండడం వలన దీనిని మొదటి అర్థంలోనే భావించాలి. తమిళనాడులో కూడ చాల వల్లూరు లున్నాయి. వల్లంపేటతో కూడ గ్రామాలు వున్నాయి.

కృష్ణాజిల్లాలో తోట్లవల్లూరు, గుడ్లవల్లూరు (గుడ్లవల్లేరుకు పూర్వనామం) అనే గ్రామాలున్నాయి. కృత్తివెన్నుకు సమీపంలో ఘటురాంతక వల్లూరు అనే గ్రామము వుండేదని శాసనాల వలన తెలుస్తోంది.

**వసంతవాడ :**

పశ్చిమ గోదావరిజిల్లా గ్రామం. ప్రాథమికంగా చేతివృత్తులవారు, ముఖ్యంగా పంచాణం వారుండే నివాస ప్రాంతం. కాలక్రమంలో సాధారణీకరణను పొంది, ఆవాసమనే అర్థంలో స్థిరపడినది. వసంతఋతు సంబంధిగా తెలుసు. ఇక్కడ ఆ అర్థంతో సంబంధం లేదు. మార్గ మధ్యంలో బాటసారులు మజిలీ చేసేందుకు చెరువులు, కొలనులు ప్రక్కన ఏర్పాటు చేసే విడిదిగా భావించాలి. వసన్తీశ్వర మొకటి శాసనాలలో ప్రస్తావితము. ఈ వసంత శబ్దాలు సంస్కృత వసతి శబ్ద సంబంధి జైనమత ఆవాసాలను వసతి లేక బసతి అని సంభావిస్తారు. ఈ బసతియే బస్తీ అయింది. ఇక ఈ వసంతవాడ రెండు భాగాలు. పూర్వపు నాళ్ళలో జమీందారీ గ్రామం. వసంతగుండం అనే గ్రామం ఒరిస్సాలో వుంది. వసంత ఇంటి పేరుగల వారున్నారు.

**వాల్తేరు :**

ఆంధ్ర విశ్వవిద్యాలయ కేంద్రంగా సుపరిచితం. దీనిని రోమను లిపిలో Waltair అని వ్రాయడం, దానికనుగుణంగా దీనిని ఆంగ్లపదమని భ్రమించి

వాల్టేర్ అని ఉచ్చరించడం జరుగుతోంది. ఆ భ్రమవల్లనే వాల్తేరు రైల్వే స్టేషను పేరును విశాఖపట్నంగా మార్చారు. కాని వాల్తేరు తెలుగుపదమే. నిజానికి ఇప్పుడు పెదవాల్తేరుగా వ్యవహరింపబడుతున్నదే వాల్తేరు. పూర్వం వాల్తేరు స్టేషను దాటిన తరువాత విశాఖపట్నం స్టేషనుండేది. కాని నగరానికి వాల్తేరు స్టేషను దగ్గర కావడం, జనమంతా అక్కడే దిగిపోవడంతో విశాఖపట్నం స్టేషనుకు జంక్షను నడపడం మానివేశారు. వాల్తేరు స్టేషను కూడా వాల్తేరు గ్రామంలోనిది కాదు. అది కేవలం కొత్త స్టేషనే.

వాల్తేరు, ఏరుల కలయిక వాల్తేరు. ఈ పేరుతో మరి రెండు గ్రామాలు రాజాం, పాలకొండ తాలూకాలలో ఉన్నాయి. వాల్త శబ్దానికి అర్థం సమంగా తెలియడంలేదు. ఇలాంటిదే పాల్తేరు గ్రామం. ఈ వాలత, పాలత ఒకరకం గడ్డి పేర్లేమో తెలియలేదు. 'వాల' ఒక గడ్డిగా కన్నడంలో కన్పిస్తుంది. వట్టివేరులాంటిది. అయితే 'త' ఎలా వచ్చిందనేది ప్రశ్నగా మిగులుతుంది. తకారంతో అంతమయ్యే కొన్ని మొక్కలు అమత, కాగిత, బాడిత మొదలైనవి. కనుక వేలత, పాలతకూడ మొక్కలు కావచ్చునని ఊహ.

**విజయవాడ :**

కృష్ణాజిల్లా గ్రామం. దీని పూర్వనామం బెజవాడ అనీ, క్రొత్తపేరు విజయవాడ అని భావిస్తారు. కాని రెండూ పూర్వంనుండి చెల్లివస్తున్నవే. రెంటికీ శాసన ఆధారాలున్నాయి. [1], [2] రెండు కొండలమధ్య బెజ్జముచేసికొని కృష్ణ ప్రవహిస్తోంది గనుక బెజవాడ అనీ, విజయుడు (అర్జునుడు) ఇంద్రకీలాద్రిపై తపస్సు చేసికున్న వాటిక కనుక విజయవాటిక అనీ, వ్యవహారంలో విజయవాడ అయిందనీ చెప్తారు.[3] ఇక్కడ విజయేశ్వరాలయమున్నది. అదొక విశేషం అనిపిస్తుంది.

అయితే పెచ్చవాడ అనే ఇంకొక పేరు శాసనాల్లో (విజయవాడకు సంబంధించినదే) కన్పిస్తుంది.[4] పెచ్చ లేక పెత్స అనేది ఒక వ్యక్తి పేరేమోనని సందేహం. వాడ ద్వితీయావయవంకావడం, వ్యాపారస్థలాన్ని సూచిస్తుంది. కనుక

శాసనం : "స్వస్తిశ్రీ విజయవాడ మల్లేశ్వర శ్రీ మహాదేవరకు ...." [1]

"శ్రీ బెజవాడ మల్లేశ్వర దేవ దివ్య శ్రీపాద పద్మారాధక ...." [2]

"శ్రీమద్విజయవాటిఖ్యాపురీ కృష్ణభూషణే ఇంద్రకీలాద్రి ...." [3]

"సచయక్షః శాపాన్తరాత్కలా పచ్చవాడ కలయ యమలోలు పుత్రః" [4]

---

[1] No. 96, S. I. I. Vol. VI

[2] No. 22, S. I. I. Vol. X

[3] No. 761, S I. I. Vol. IV

[4] No. 38, S. I I. Vol. X

పెచ్చవాద, కాలక్రమంలో బెజవాద అయివుండవచ్చునని ఊహ. ఇలా కాక ముత్స కూడా గ్రామ నామాల్లో కన్పిస్తుంది పెనుముత్స. దానితో పోల్చి చూసినపుడు, ప్రాంతీయమైన, భౌతికమైన భూ ఆకృతి గావచ్చునేమో !

ఇంకా దీనికి ఫల్గుణక్షేత్రం, కనక పురి అనే పేర్లున్నాయి. కనకదుర్గ ఇప్పటి అధిష్ఠానదేవి. మాధవవర్మకథ తెలిసిందే. అతని సత్యదీక్షకు మెచ్చి కనకవర్షం కురిసిందనే ఐతిహ్యం తెలిసిందే. చోళుల కాలంలో దీనికి వీరరాజేంద్ర చోడనగరమనే వ్యవహరముండేది.

## విద్వత్ సదాశివపురం :

చిత్తూరుజిల్లా పుత్తూరు తాలూకా గ్రామం మరో సదాశివపురం ఇదే తాలూకాలో ఉండటం కారణంగా దీనిని ఇలా పిలుస్తారు. పండితులుగల విల్లూరు పండిత విల్లూరు. అలాంటిదే ఇది కూడా. విద్వత్ సంపన్నులు ఉండడం కారణంగా ఈ గ్రామానికి పేరు స్థిరపడింది. ఆధిక్య, అభావసూచనలతో గ్రామాలున్నాయి. ఇది ఆధిక్య సూచకం, కాగా నీళ్ళులేని తిమ్మాపురం అభావ సూచక సంబంధి.

## విలాస గంగవరం :

తూర్పుగోదావరిజిల్లా రామచంద్రాపురం తాలూకా గ్రామము. ఇదే తాలూకాలో మరో గంగవరం ఉన్న కారణంగా వివక్ష కొరకు ఇలా పిలుస్తున్నారు. గంగవరం వ్యక్తి నామ సంబంధి. విలాస అర్థానికి వైభవము, చిరునామా (address) అనే అర్థాలున్నాయి. పూర్వం జమిందారులు సాధారణ కార్యకలాపాలనుండి కొంత విశ్రాంతి నిమిత్తం మరోచోట కొంతకాలంపాటు ఉండేవారు. ఇప్పటి అతిథిగృహాలు, వేసవి విడుదులవలె. అలా ఏర్పాటుచేసుకోబడ్డ గ్రామాలు విలాసగ్రామాలు. సంద ర్భాన్నిబట్టి విలాసవతులకు ఈబడ్డ గ్రామాలు కూడా కావచ్చు. ఇంకా ఇలాంటివి విలాస వరాహపురం మూకమాంచా విలాసం అనే గ్రామాలు చిత్తూరు జిల్లాలో ఉన్నాయి. హవేలి గ్రామాలు కూడా ఇలాంటివే. దాని వివరం ముందు వివరింప బడుతుంది.

## విశాఖపట్నం :

దీనిని విశాఖపట్నం, విశాఖ, వైజాగ్ అని వ్యవహరిస్తారు. విశాఖ, పట్టణ ముల కలయిక విశాఖపట్నం. విశాఖేశ్వరుడు నెలకొన్న చోటు గనుక అది విశాఖ పట్నం. ప్రస్తుతం ఈ దేవాలయం కనిపించదు. తీర్థపురాళ్ళు అనే ప్రాంతం విశాఖ వాసులకు తెలుసు. ఆలయము ఆ ప్రాంతములో సముద్రములో కలిసి పోయింది. దీనికి కులోత్తుంగ చోడపట్టణమనే పేరు చోడుల కాలంలో వుండేది. పట్నం ముందు వివరింపబడింది.

**విశ్వనాథపురం :**

ఈ పేరుతో కృష్ణాజిల్లా దివితాలూకాలో ఒక గ్రామముంది. ప్రస్తుత చర్చ మార్కాపురంలోనిది. వ్యక్తినామ పరంగా వచ్చినట్లు తెలుస్తోంది. కాకతిగణపతి దేవుని గురువు గోళకీమఠ విశ్వేశ్వర శివాచార్యులు కట్టించినట్లు శ. క. 1174 పరీధావి సంవత్సర ఆశ్వయుజశుద్ధ విజయదశమి శనివారంనాడు వేయించిన శాసనం వలన తెలుస్తోంది. తూర్పున గుండేరు, దక్షిణాన, పడమట పులియేరు, ఉత్తరాన పూవులకొండ మొన, పలుగురాళ్ళ హద్దులుగా గల మధ్య అడవిని నరికించి, చెరువు కట్టించి ఈ గ్రామానికి రూపకల్పన గావించారు. శ. క. 1175 ప్రమాది చైత్ర బహుళ దశమి మంగళవారమునాడు త్రిపురాంతక మహాదేవునికి సమర్పింప బడింది.

**విశ్వేశ్వరగోళకి :**

మంగళగిరికి సమీపంలోని మందడం గ్రామ సమీపంలో ఉండేది ప్రస్తుతం లేదు. కాలగర్భంలో కలసిపోయింది. విశ్వేశ్వరగోళకి కాకతి గణపతిదేవుని దీక్షా గురువు. మల్కాపురమని పిలువబడుచున్న శ్రీ రుద్రదేవిపురంలో గోళకీమఠము స్థాపించబడింది. విద్యార్థులకు, ప్రసూతిశాలకు ఇంకా ఇతర ధర్మకార్యాలకు ఈ గ్రామం మీద, ఇతర గ్రామాలమీద వచ్చే ఆదాయాన్ని పై కార్యాలకు సమ కూర్చారు.

**వీరకుమారయాచ సముద్రం :**

నెల్లూరుజిల్లా వెంకటగిరి తాలూకా గ్రామం. మరొక యాచసముద్రం సమీప ములో ఉండడం కారణంగా దీనిని ఇలా వ్యవహరిస్తున్నారు యాచేంద్ర అనే పేరు వెంకటగిరి జమిందారులలోని వీరకుమార యాచేంద్రుని పేరు మీదుగా ఈ గ్రామ మేర్పడింది యాచేంద్ర ఈ వంశస్థులకు బిరుదు నామంగా కలసి వస్తోంది. సముద్రం పెద్ద చెరువుకు సంకేతంగా వ్యవహరింపబడుతుంది.

**వీరచోడ చతుర్వేది మంగళం :**

తూర్పుగోదావరి జిల్లాలోని ఒకప్పటి గ్రామం. ప్రస్తుతం ఈ పేరుతో గ్రామంలేదు. మాలవెల్లి, పొన్నతొట్ట, ఆలమి అనే మూడు గ్రామాలను ఒకే అగ్ర హారంగా చేసి, రాజమహేంద్రవరాన్ని పాలించిన మొదట కులోత్తుంగ చోడుని కుమారుడు వీరచోడుడు, బ్రాహ్మణులకు దానంగా ఇచ్చాడు. ఈ అగ్రహారానికి పొన్నవాడ, మర్లివోలు, గొల్లప్రోలు, చేబ్రోలు, బెండపూడి, తూర్పున సముద్రం హద్దులుగా పేర్కొనబడ్డాయి. చతుర్వేది మంగళం అగ్రహారానికి సంకేతం. ఈ రెండు పదాలు ముందు వివరింపబడ్డాయి.

వెంకటాద్రిపాలెం :

మార్కాపురం తాలూకా గ్రామం. వెంకటాద్రి అనే వ్యక్తి నామం మీదుగా ఏర్పడింది. 17వ శతాబ్దంలో శ్రీగిరి మండలాన్ని (శ్రీ శైలం) పాలించిన మాడాల గోత్రానికి చెందిన గంగపనాయకుని తండ్రి వెంకటాద్రి పేర ఈ గ్రామ మేర్పడింది. ఈ గ్రామంలోని చెన్నకేశవ ఆలయానికి గుర్రపుశాల, చెన్నరాయపల్లె, గార్లదిన్నె, కటారువానిపల్లె గ్రామాలు 1614 లో గంగపనాయకుడు సమర్పించాడు. 1622 నాటి శాసనంలో వెంకటాద్రి నగరంగా ప్రస్తావింపబడింది.

వెలగలపాయ :

ప్రకాశంజిల్లా కంబం తాలూకా గ్రామం. కృష్ణాజిల్లాలో వెలగలేరు, గుంటూరు జిల్లాలో వెలగపూడి, తూర్పుగోదావరి జిల్లాలో వెలగతోడు అనే గ్రామాలున్నాయి. ఇందలి వెలగ శబ్దం, శాకంగా ఉపయోగించే కపిత్థం కాదు. అనంతపురం జిల్లాలో గలగల అనే గ్రామం ఉంది. ఇది కూడా అలాంటిదే. ఒకరకంగా గడ్డి. వెలంగడ్డి అనికూడా అంటారు. ఆకెరువు మొక్క. పాయ అంటే చీలిన ప్రవాహ భాగం. తోడు అంటే కూడా ప్రవాహమే. మలయాళ, కన్నడ, తుళు, కొడగు భాషల్లో ఈ అర్థంలో ఈ శబ్ద వ్యవహారముంది. వెలగవలస పేరుతో రెండు గ్రామాలు బొబ్బిలి తాలూకాలో ఉన్నాయి.

వెలుగుపల్లి :

నల్గొండజిల్లా గ్రామం. వెనుక నందివెలుగును గూర్చి చెప్పినపుడు వెలుగు అంటే ఒక రకంచెట్టు అని చెప్పబడింది. చుట్టూ కంచె వేయబడిన రక్షిత ప్రాంతాన్ని కూడా వెలుగు అంటారు. నిజానికి వేయబడిన కంచే వెలుగు.

వెల్లంకి :

వాస్తవానికిది ఎల్లంకి. కృష్ణాజిల్లా గ్రామం. ఎల్లి ఒకరకం కలుపు మొక్క. దీనిని ఎల్లిపాయల గడ్డి అని కూడా అంటారు. మరో వెల్లంకి విశాఖపట్నంజిల్లాలో వుంది. ఎల్లంకివారిపల్లె చిత్తూరుజిల్లా చంద్రగిరి తాలూకాలో వుంది. అంకి అంటే సమీపంలోని ప్రవాహానికి హద్దు.

వేంద్ర :

పశ్చిమగోదావరి జిల్లా గ్రామం. వేంద్ర కూడా ఒకరకం కలుపు మొక్క. అగ్ని వేంద్ర (Ammania vessication Roxb; N Ammania beccifire

lenu) అని కూడా అంటారు. ఉంద్ర కూడ ఇలాంటిదే. కృష్ణాజిల్లాలోని ఉంద్ర పూడి అనే గ్రామముంది. ఉండి కూడా పై మొక్క సంబంధమే. విజయనగరం జిల్లాలో వేంద్రం అనే గ్రామముంది.

**వే పం జే రి :**

చిత్తూరుజిల్లా చిత్తూరు తాలూకాలో ఈ పేరుతో రెండు గ్రామాలున్నాయి. ఇందులో ఒకటి జమిందారీ గ్రామం. శాసనంలో కూడా రెండు గ్రామాలు చంద్ర గిరి రాజ్యంలో తిరుక్కడియకోట్టం మొగరాలపత్తునాడు ఇరుపత్తైసీమె వెలుకూరికి తూర్పున, బుక్కపట్నానికి పడమర, పీరకవులూరికి దక్షిణం, పొన్నంకోటకు ఉత్తరాన ఉన్నట్లు నిర్దేశించబడ్డాయి.

మొగరాలపత్తు నేడు మొగరాలపల్లెగా వ్యవహరింపబడుతోంది. ఈ రెండు గ్రామాలలో ఒకటి కరివేపంజేరిగాను, పెదవేపంజేరిగాను పిలువబడుతున్నాయి. వేంప వేప అయి, గ్రామనామంలో వేపం అయింది. కరివేపంజేరిలోని కరివేప, శాకపాకల్లో ఉపయోగించే కరివేప కాదు. ఇది వెంపలి మొక్క (**Tephrosia purpura Pers**) సంబంధి. వెంప, వెంపరాల అనే గ్రామాలుగా వున్నాయి, జేరి, చెరువులకు రుపాంతరం కరి శబ్దం నలుపును సూచిస్తుంది. ఇచట భూమి రంగుకు సంకేతం. ఈ విశేషాలన్నీ తమిళనాడులోని వాలాజాపేట తాలూకా, షోలింగూరు గ్రామంలోని ఆంజనేయస్వామి దేవాలయ శాసనంలో ఉన్నాయి. షోలింగూరు అసలు పేరు చోళింగపురం. మరొక పేరు ఘటికాచాలం. ఇక్కడ గల కొండకు ఇది సంకేతం. ఈ శాసనాన్ని చినతిమ్మరాజు ప్రకటించాడు. ఈయన తన పేరుతో ఒక అగ్రహారం వెలయింపజేశారు. నేటి తిమ్మనాచారి కుప్పం అదే కావచ్చును.

**వే మ వ ర ం :**

తూర్పుగోదావరి జిల్లాలో ఈ పేరుతో మూడు గ్రామాలున్నాయి. అవి అమలాపురంలో రెండు. తుని డివిజన్‌లో ఒకటి. అవసరాల వేమవరం. వీరారెడ్డి నాగవరం, నల్లూరు, పోంకలగుద్ద, అల్లాడరెడ్డి వేమవరం, గ్రామాలకు ద్రాక్షారామ భీమేశ్వరునికి సేవచేస్తున్న బలెంజెవారికి (బలిజ) దానమిచ్చినట్లు శాసనముంది. అవసరాల అంటే రాజుల వద్ద, ప్రభువు ఏ సమయాన ఏమి చేయాలో ఎరుక పరిచే వారు. అవసరాల ఇంటిపేరు గలవారున్నారు.

**వ్యాపులపల్లి :**

మదనపల్లి తాలూకా గ్రామం. దీని అసలు పేరు వెంపలపల్లె.[1] వెం ఒక మొక్కగా తెలిసిందే. నేటి వేంపల్లియే ఈ గ్రామం. వెంపలపల్లి ముది శివారు గ్రామంగా చెప్పబడింది.

శాసనం : ముదివేడు శివారు, మదనపల్లె తాలూకా, గుంటూరుజిల్లా క్రి. శ. 15 సదాశివరాయల కాలం.

"... వెంపలపల్లి స్తళం చేనున్న ...."

**శివరామపురం :**

ఇది కృష్ణాజిల్లా దివితాలూకాలోని పెదప్రోలుకు శివారు గ్రామం. ఇది మధ్యనే అంటే సుమారు 40, 50 ఏళ్ళ క్రితం ఏర్పడింది అప్పట్లో దీనిని కొత్త అని పిలిచేవారు. అనంతరం చల్లపల్లి జమీందారులయిన శ్రీ మంతురాజా యార్ల శివరామప్రసాదుగారి పేరుతో శివరామపురమని వ్యవహరిస్తున్నారు.

**శెట్టియప్పన్ తాంగల్ :**

చిత్తూరుజిల్లా చిత్తూరు తాలూకా గ్రామం. ఇది వ్యక్తి నామపరంగా వ గ్రామం. తాంగల్ అనే తమిళ పదానికర్థం వరిపంటకు నీరిచ్చే చిన్న జలాశ అంటే పరిమాణంలో చెరువువంటి చిన్నది. ఇంకా ఈ జిల్లాలో కొదకన్ తాంగ పుత్తూరు తాలూకాలోని ఇప్పతాంగల్, కొరకం తాంగల్, బ్రాహ్మణ తాంగ తిరుత్తని డివిజన్‌లో కడప్పన్ తాంగల్, పెరుమాల్ తాంగల్, పెరుము తాంగ బరం తాంగల్, తలాం తాంగల్ అనే గ్రామాలున్నాయి.

**శృంగవృక్షం :**

పశ్చిమగోదావరిజిల్లా గ్రామం. శృంగి అనేది ఒక చెట్టు పేరు. తెలుగ దీనిని ఎలా పిలుస్తారో తెలియదు. తమిళ, తుళు భాషలలో దీన్ని ఇత్తి (Ficus impectoria) అంటారు. దాని వేరు విషపూరితమైనది. విశాఖపట జిల్లాలో శృంగవరపు కోట వుంది. దీనికీ చెట్టుకు ఏమీ సంబంధంలేదు. కార వరం అని చివర వుండడం. కనుక దీనిని వ్యక్తి నామంగా ఊహించాలి. శ్రీనాథ 'శృంగారపు కోట' అంటాడు. ఇదిలావుండగా గుంటూరుజిల్లాలో శృంగారపు అనే గ్రామమున్నది. కొంతకాలం క్రితం వరకు, శృంగారపాడు అనేవారు. ఈ లోని పదానికి శృంగారమునకు ఏమి సంబంధంలేదు. దానికసలు పేరు సింగవ పాడు. సింగవరం, సింగారం అయి శృంగారంగా స్థిరపడింది. ఖమ్మంజిల్లా గట్టు సింగారం, చెరువు సింగారాలు కూడా ఇలాంటివే. సింగవరానికి రెండ సింగవరప్పాడు. 'సింగవరం' ఎన్నడో కృష్ణానదిలో కలిసిపోయింది.

---

[1] No. 240, S. I. I. Vol. XVI

శ్రీకాకుళం :

ఈ పేరుతో గల గ్రామాలు రెండు

దివి తాలూకా, కృష్ణాజిల్లా

శ్రీకాకుళం జిల్లా, కేంద్రం కార్యస్థానం.

దివి తాలూకాలోనిది శ్రీకాకుళంకాగా. రెండవది చికోకోలు అనేదానికి కృతక ప్రామాణిక రూపం (Hypre standerdsied form). శ్రీకాకుళంలోని 'శ్రీ' అంటే లక్ష్మి, సంపద, శుభప్రదము అని అర్థాలు 'కా' అనే ద్రావిడ పదానికర్థం. ఆధారము, రక్షకుడు, ప్రభువు, దైవం. కుళం అంటే కొలను. ఫలితార్థం శుభప్రదమైన దేవుని కొలను. ఇది కృష్ణానదీతీర గ్రామం. ఇక్కడ, ఆంధ్రమహావిష్ణు స్వామి ఆలయమున్నది. ఈ స్వామినే తెలుగు రాయడని, తెలుగు వల్లభుడని కూడా అంటారు. స్థానికంగా కృష్ణానదికి శ్రీకాకుళమనే పేరుంది. శ్రీకృష్ణదేవరాయలు తన పూర్వ దిగ్విజయయాత్రలు ఈ దేవుని సందర్శించి గ్రామాలను, ఇతర వస్తువులను సమర్పించినాడు. అయితే అతడు సందర్శించిన ఆలయం నేటిదికాదు. నాటి దేవాలయము పురాతన దేవాలయం, కృష్ణానది పాతంగా దానిని పెకలించి వేరుగా నిర్మించారు. రాయలు దర్శించినదీ పురాతన దేవాలయం. అతనికి కలలో కనిపించి ఆముక్త మాల్యద రచనకు ప్రేరేపించినది ఈ తెలు.

పురుషోత్తమకవి ఆంధ్రనాయక శతకం రచించినది ఈ దేవు:

వల్లభరాయడు తన క్రీడాభిరామంలో, శ్రీకాకుళపు తిరునాళ, కట్టినట్టు వర్ణించాడు. ఇక్కడ తిరునాళ్ళు దవనపున్నమినా, పున్నమిని దవన పున్నమి అంటారు. శ్రీకాకుళం సిరికాకుళం, ... రూపాలు సాహిత్యంలో, శాసనాలలో కన్పిస్తాయి. కాకుళయ్య అనే పేరు వ్యక్తి నామాల్లో కన్పిస్తుంది. తెలుసు రావుపాలెం అనే గ్రామంలోని సమీపములో వుంది.

పై వైష్ణవ సంబంధమైన వ్యుత్పత్తి లోకంలో ప్రచురంగా వుంది. కాని కాకోలి అనేది ఒక రకం మొక్క కూడా ఆయుర్వేదంలో ఉపయోగిస్తారు. ఆ మొక్క పేరుమీదుగా ఏర్పడి పిదప వైష్ణవ సంబంధంగా 'శ్రీ' చేరి నేటి రూపం సిద్ధించి వుండడానికి కూడా అవకాశముంది. మహాదేవ కాకిలి, పెద్ద కాకిల అనే మహాదేవ కాకిల అనే రెండు గ్రామాలు రాయఘడ్ ఏజన్సీలో వున్నాయి.

**ఇక రెండవ శ్రీకాకుళం :**

ఇది చికో్కలుకు కృతక గ్రామాణిక రూపమని ముందు చెప్పబడింది. నేటి జిల్లా కేంద్రమైన 'శ్రీకాకుళం' ఒకప్పుడు కంటోన్మెంటు (Contonment) అనగా సైనిక విడిది నేటికీ స్థానికుల వ్యవహారంకో చికో్కలు అనేవుంది. ఇది 'శిఖాఖోల్' అనేదానికి వికృత రూపం. నైజాంనవాబు పాలనా కాలంలో ఇక్కడి అధికారి, నవాబు నుంచి వచ్చిన టపాను అందుకొని, వివిధ అధికారులను పంపేవాడు. శిఖా అంటే రాజముద్ర గల సీలు (Sacel) 'ఖోల్' అంటే ఊడదీయం. ఇవి రెండూ ఉర్దూ మాటలు. శేర్లు, మరకాలు మొదలైన కొలపాత్రలు, పీశె, మణుగు మొదలైన తూనిక రాళ్ళ వెనుకటి తరాలవారికి తెలుసు వాటిమీద రాజముద్ర అంటే శిఖా ఉండేది. శిఖా వుంటే అసలైనది. లేనిది దొంగది. అంటే చట్టబద్ధతలేనిది. ఫర్మానాలున్న సంచిపై అలాంటి ముద్ర ఉండేది. దానిని ఊడదీసి, ఇతరులకు పంపేచోటుగనుక, ఇది శిఖాఖోల్ అయింది. వ్యవహారంలో చికో్కలు అయింది. నవీనులు దీనిని శ్రీకాకుళంగా మార్చారు. ప్రభుత్వ వ్యవహారాలలోకూడా అదే వ్యవహారం స్థిర పడింది. నిజానికి అలా మార్చకూడదు. మార్చాలంటే చట్టబద్ధత అవసరం. ఆమేరకు ఐక్యరాజ్య సమితి తీర్మానముంది. కాని ఇక్కడ అలాంటిదేమిలేకుండగానే వ్యవహారం జరిగిపోతోంది. కాని, ఇంగ్లీషువారు మాత్రం, తమ వ్రాతలో చికాకోల్ (Chicakol) అనే వ్యవహరించారు.

**శ్రీకూర్మం :**

శ్రీకాకుళం జిల్లా శ్రీకాకుళం తాలూకాలోని ప్రసిద్ధ వైష్ణవ క్షేత్రం ఇక్కడి అధిష్టాన దైవం శ్రీకూర్మ నాథుడు. కూర్మావతారం, శ్రీమహావిష్ణువు దశావతారాల్లో ఒకటి శ్రీ శుభప్రదమైన, మహత్వ పూర్ణము అనే అర్థాలలో నిబంధితము. దేవుని పేరుమీదుగానే ఈ గ్రామం ప్రశస్తిని పొందింది కూర్మమునకు మరము పర్యాయ పదం. ఆ పేరు మీదుగా కమఠ పురపతి, కమఠపతి అనేవిధంగా కూడా దేవుని పిలుస్తారు. కూర్మరాయలు, శ్రీపూర్ణకోటి, కూర్మస్వామి అనికూడ వ్యవహరితము. దేవాలయ ప్రాంగణానికి శ్రీభాండారమనే వ్యవహారముంది. శ్రీకూర్మానికి సితగిరి, శ్వేతతీర్థం, కూర్మగుండము, పూర్ణకోటి అనికూడా పేర్లున్నాయి.

ఎందరో మాన్యులు, సామాన్యులు ఈ దేవునికి భూములును, గోవులను, పూజాపాత్రాదికాలను సమర్పించారు. సింహళదేశపు అబ్జకేశవవుని కుమార్తె గాయక నాగలదేవి, ఈ దేవునికి అఖండదీపం సమర్పించింది. అయితే శక సంవత్సరము 1321 (క్రీ. శ. 1599) వికారి నామ సంవత్సర చైత్ర బహుళ ఏకాదశి

మంగళవారం నాడు ఈ దేవాలయం ధ్వంసం గావింపబడి మసీదుగా మార్చబడినట్లు తెలుస్తోంది.

**శ్రీనివాస ఉదాసిపురం :**

ఇది చిత్తూరుజిల్లా గ్రామం. వ్యక్తి నామం మీదుగా ఏర్పడిన గ్రామం. ఉదాసి అంటే వేదాంతి, నిర్లిప్తుడు. ఉదాసీనము అంటే నిర్లిప్తత.

**శ్రీరంగరాయపేట :**

తెనాలి తాలూకా అమృతలూరు (అమర్తలూరు)కు చెందిన పేటగా శాసనాల్లో పేర్కొనబడింది. ఈ శాసనకాలంనాటికి (1758) పాలనలో నున్న నాల్గవ శ్రీరంగ రాయ దేవమహారాయుల పేరుమీదుగా ఈ నివాస ప్రాంతమేర్పడి యుండవచ్చును.

**షేరుమహమ్మదుపురం :**

ఇది శ్రీకాకుళంజిల్లా చీపురుపల్లి తాలూకా గ్రామం. బొబ్బిలి పాలకుడు రంగా రావు ఈ గ్రామాన్నినిర్మించి, చికాకోల్ ఫౌజుదారైన షేర్ మహమ్మద్‌ఖాన్ పేరుంచాడు. ఆ పేరే స్థిరపడింది.

**సకలకొత్తపల్లె :**

ఇది ఏలూరు తాలూకా గ్రామం. ఇదే తాలూకాలో మరొక కొత్తపల్లె ఉండ డము కారణంగా దానిని పై విధంగా వ్యవహరిస్తున్నారు. సకల అంటే సర్వము అనే అర్థం తెలిసిందే. అర్థమదే గాని, ఇక్కడ 'సకల' అనేవ్యక్తి పేరుమీదుగా వచ్చింది. ఈ పేరుతో ఒక చారిత్రకవ్యక్తి రెడ్డి వంశజుడున్నారు. ఇప్పటికీ సకలారెడ్డి అనేవ్యక్తి పేరుగలవారున్నారు కృష్ణాజిల్లా మోపిదేవిలో సకలేశ్వరస్వామి ఆలయ ముంది. ఈ ప్రాంతానికి సకలినాడని పేరు.

**సంగం జాగర్లమూడి :**

గుంటూరు జిల్లా తెనాలి తాలూకా గ్రామం. నిజానికి దీని పేరు కేవలం చాగర్లమూడి మాత్రమే. శేకూరు ఈ గ్రామానికి ఉత్తరంగా వుంది. కొండవీటి సీమలోనిదిగా శాసనం చెపుతోంది. తుంగభద్ర మరొకవాగు కలవడంవలన ఇచ్చట సంగమం ఏర్పడింది. ఈ సంగమానికిది దిగువున చాగర్లమూడి గ్రామమున్నట్లు శేకూరు శాసనంలో స్పష్టీకరింపబడింది. జాగర్లమూడి బాపట్ల తాలూకా కొండజాగర్ల మూడి గుంటూరు తాలూకాలో ఉన్నాయి. అందువలన దీనిని, వివక్షకొరకు సంగమం వద్ద వచ్చిన చాగర్లమూడి కనుక దీనిని సంగం జాగర్లమూడిగా వ్యవహరిస్తున్నారు.

పై శాసనంలో కల్లపాడు, శెలపాడు, తంగెళ్ళమూడి, మల్లవరపాడు, అనపోతవరపు పాడు గ్రామాలు పేర్కొనబడ్డాయి. కపోతవరపుపాడు, కొండవీటి నేలిన అనపోతా రెడ్డి పేరుమీదుగా ఏర్పడింది. చాగర్లు ఒక రకపు తృణధాన్యం, పూడి పూర్వం వివరింపబడింది. శేకూరులోని బహుశా 'చే' కావచ్చును. చేకొరద అనేది ఒక మొక్క. కన్నడంలో, శేవల, సేగూగ్గి అనేవి మొక్కలుగా కన్పిస్తాయి. సప్తనదీ సంగమని మరొక శాసనములో పేర్కొనబడింది.

సంగాల :-

కూర్మవరం తాలూకా గ్రామం. సంకే (The plaent Trigonella cornicniata Lin) అనేది ఒకరకం మొక్క. 'అల ప్రాకె' స్వభావం గల మొక్కగా ఇతఃపూర్వం చెప్పబడింది. ఈ సంగాల తుమ్మల స్థలంలోనిదిగా శాసనం చెపుతుంది. తుమ్మల ఒక గ్రామం. ఈ పేరుతో గుంటూరు జిల్లాలో మరో గ్రామముంది. సంబ అనే గ్రామం చిత్తూరు జిల్లాలో ఉంది. ఇక ఈ సంగాలకు విజయ భూపతి పురమనే పేరున్నట్టు శాసనస్థ సాక్ష్యముంది. సంగాల పేరుతో మరో రెండు గ్రామాలు అనంతపురం తాలూకాలోను, గుత్తి తాలూకాలో వున్నాయి.

సంజీవరాయుని పట్టెడ :

చిత్తూరుజిల్లా గ్రామం. సంజీవరాయుడన్న వ్యక్తి పేరుమీదుగా వచ్చింది. ఆంజనేయుస్వామిని సంజీవరాయుడంటారు పట్టెడ, పట్టె శబ్ద సంబంధం. పట్టె భూఖండం. వెనుక కండ్రిగ సంగతి చెప్పడం జరిగింది. ఇదికూడా అలాంటిదే గాని కొంత అర్థం భేదముంది. భూఖండం అన్నంతవరకు సరిపోతుంది. కండ్రిగ, ఏదైనా గ్రామంనుంచి కొంత భాగం తీసి మరొకరి కిచ్చింది. కాగా పట్టె ఒకరినుండి పంచుకొన్న భూఖండం. ఇదే వ్యవహారంలో పట్టెడ అయింది. పై అర్థములో రాయలసీమలో దానికి వ్యవహారముంది. చిత్తూరు జిల్లాలో ఇలాంటి గ్రామనామాలు కనిపిస్తాయి. రాగిమానిపట్టెడ, బైరాగి పట్టెడ, కాశీపట్టెడ, నాయుడు పట్టెడ, సాళ్వ పట్టెడ, సీకాయ. పట్టెడ, శింగరరాజు పట్టెడ, చిన తిమ్మరాజు పట్టెడ, ఇరుదలవారి పట్టెడ, కీల్ఏల్ పట్టెడ, మేల్కాల్ పట్టెడ, మొదలయినవి. పట్టెం ఇంటి పేరుగా కూడా కలదు. ఈ ఇంటిపేరుతోకూడా చిత్తూరు జిల్లాలో పట్టెంవాండ్లపల్లి అనే గ్రామముంది.

సంతమాగులూరు :

ఇది నరసరావుపేట తాలూకాలోని వుంది. ఇదే తాలూకాలో మరొక మాగు

లూరు వుంది. దాని పేరు ఉప్పుమాగులూరు. సమీపంలో ఒకే పేరుతో రెండు గ్రామాలుండడం కారణంగా వివక్షణ కొరకు ఒక దానిపై సంత, మరొక దానిపై 'ఉప్పు' అనే పదాలు వచ్చి చేరాయి. సంత జరిగేచోట సంత మాగులూరు అయింది. ఉప్పుమాగులూరులోని 'ఉప్పు' లవణం సంబంధికాదు. ఉప్పు (Hockelochloa granulanis O. ktz) అనేది ఒక రకమైన గడ్డి. ఇది గాక ఉప్పుగడ్డి (Chloris virgota, Sw) పేరే ఉంది. అది ఎక్కువగా ఉండే ప్రాంతం కనుక అది ఉప్పుమాగులూడు అయింది. దీనికి గల మరొక పేరు ఉప్పుం పావులూరు. ఉప్పు లూరు, ఉప్పుల అనేవి కూడి అలావచ్చినవే 'ఊక' అంటే ఏమిటో ముందు చెప్పటము జరిగింది. మాగు అంటే భూమి స్వభావాన్ని, తెలియ జేస్తుంది. మాగిన అంటే తెలుసు. ఈ మాగిన శబ్దమే మగ్గిన, మగ్గుట (పండ్లు మగ్గినాయి). ఇది నేల స్వభావాన్ని సూచించేది. అయినా కావచ్చు, లేదా ఒక రకం గడ్డినయినా సూచించ మావిడి లేక మామిడి మనకు తెలుసు మనం పండుగా తినే మామిడివేరు. గడ్డిజాతి వేరు మామిడి కుదురు, మామిళ్ళపల్లి మొదలైన వాటిలో కన్పించేది గడ్డి మాత్రమే అలాగే తాడికొండలో కనిపించేది. మనకు తెలిసిన తాడి చెట్టుకాదు. తాడి పేరుతో చాలా మొక్కలున్నాయి. త్రిఫలాలలో తాడి లేక తాని తెలుసు గదా. ఆరదాడి, కోదాడి, మోర్తాడి, రాస్తాడి, అనేవి అలాంటి మొక్కలేనని ముందు చెప్పడం జరిగింధి

**సంతబయలు :**

ఇది చిత్తూరు జిల్లా పుత్తూరు తాలూకా గ్రామం. సంతజరిగే బయలు (Open place) విశాలమైన భూభాగం కాలక్రమంతో గ్రామమేర్పడింది. పేటలు కూడా ఇలాంటివే.

**సంతోషపురము :**

పార్వతీపురం, కురుపాం తాలూకాలో ఈ పేరుతో గ్రామాలున్నాయి. సంతోషరాయుడనే తెల్లదుమ్ము ముహాసాదారుని పేరుతో ఈ గ్రామమేర్పడి యుండవచ్చు.

**సందెపూడి :**

గుంటూరుజిల్లా గ్రామం. తూర్పుగోదావరి జిల్లాలో సందెపూడి అనే గ్రామముంది. రెండింటి మూలరూపం ఒకటే. 'సందె' నేల స్వభావాన్ని సూచించేపదం. ఠేగడు, ఇసుక కలిసిన నేల సందెకట్టునేల.

సమయపురం :

చిత్తూరు జిల్లాలో పుత్తూరు తాలూకా గ్రామము. సమయం అంటే కాలము సమయం, సందర్భము అనే వాడుకలోని అర్థాన్ని ఇక్కడ గ్రహించాలి. ప్రభువు ఎప్పుడు ఏవి చేయాలో హెచ్చరిక చేసే వారుండేవారు. వారిని సమయ వంతుల వారంటారు. సమయవంతుల ఇంటిపేరు గలవారున్నారు. ఆ ఇంటిపేరు మీదుగా ఆ గ్రామ మేర్పడివుండవచ్చు.

సర్పవరం :

తూర్పుగోదావరి జిల్లాలో కాకినాడ తాలూకా గ్రామం. సర్ప సంస్కృత శబ్దం. సృప్ మూలధాతువు. పాకే వంటి వాటికి దేనికైనా వర్తింప చేయవచ్చును. అయితే అలాంటి వాటి నన్నింటినీ సరీసృపాలని వ్యవహరించడం కద్దు. 'తెలుగున పాము'గా రూఢం. ఈ శబ్ద వ్యుత్పత్తి 'పమ్మి' ఆరోపం క్రింద చూడవచ్చును. శాసనాల్లో సర్పపురం, సబ్బిపురంగా సంభావితము. నిజానికిది సబ్బవరానికి సంస్కృతీకరణం కావచ్చు.

ఇచ్చట నెలకొన్న దైవం భావన్నారయణ స్వామి. ఈ స్వామికి గల మరొక పేరుమీదుగా ఈ గ్రామాన్ని రాజనారాయణపురంగా శాసనాల్లో వ్యవహరింప బడింది. ఈ దేవాలయ ప్రాంగణానికి ప్రత్యేకంగా "శ్రీ పురుషోత్తమం" అనే వ్యనహారమున్నట్లు శాసనాలు చెప్తున్నాయి. కాగా ఇదే తాలూకాలో బావరం పేరుతో రెండు గ్రామాలున్నాయి. భావవరం వ్యవహారంలో బావరమయింది. పై భావనారాయణస్వామికి దానం చేయబడినవి కనుక పై గ్రామాలు అలాసంకేతింప బడ్డాయి.

సర్వ ఇనాం రాఘవాచార్యులపల్లె :

ఇది చిత్తూరుజిల్లా గ్రామం. రాఘవాచార్యులు అనే వ్యక్తికి సర్వఇనాంగ ఇవ్వ బడిన గ్రామం. ఈనాముల్లో చాలా భేదాలున్నాయి. సర్వ ఈనామంటే సర్వ హక్కులతో ఇచ్చిన గ్రామం. అంటే దానదమన విక్రయ వినిమయ సమస్త హక్కులతో ఇచ్చినది. కొన్ని ఈనాములను అమ్మడానికి వీలుండదు. అనుభవించ ఎంచటానికి మాత్రమే హక్కు ఉంటుంది. మరికొన్నింటికి కొంత పన్ను కట్టవలసి ఉంటుంది. మరికొన్ని ఈనాములు, కేవలం కొన్ని సేవలు చేసినందుకు ప్రతి ఫలంతో ఇవ్వబడ్డవి. ఆ సేవ చేసినందుకు ప్రతి ఫలంగా ఇవ్వబడ్డవి. ఆ సేవ చేసినంతకాలమే వాటిని అనుభవించే హక్కు వుంటుంది.

సమేత పర్వతేశ్వరుని ప్రతిష్ఠించింది. ప్రస్తుతం రామేశ్వరునిగా వ్యవహరిస్తున్నారు. చాంచలూరులోని 'చాంచల' చంచలి సంబంధి. దీనిని కూరాకుగా ఉపయోగిస్తారు. సాతు అనే గ్రామం నార్త్ ఆర్కాడు జిల్లా, కంగుంధి డివిజన్‌లో వుంది. పూర్వం బూతుమిల్లి ని గూర్చిన వివరణంలో ఈ సాతు శబ్దం ప్రస్తావింపబడింది.

**సామంత కుర్రు :**

తూర్పుగోదావరి జిల్లా అమలాపురం తాలూకా గ్రామం. నెల్లూరు జిల్లా దరిశి డివిజన్‌లో సామంతపూడి అనే గ్రామం, సూళ్ళూరుపేట తాలూకా సామంత మల్లం అనే గ్రామాలున్నాయి. సామంత శబ్దం ప్రభువుకు లోబడి వుండే చిన్న పాలకునిగా తెలుసు. అయితే ఇక్కడ ఆ అర్థం కాదు. సామంతిగ అనేది కన్నడంలో మల్లెలో ఒక రకంగా చెప్పబడింది. చామంతి తెలిసిందే కుర్రుపూడి శబ్దాలు పూర్వం వివరింపబడ్డాయి. మల్లంకూడా, మల్లె సంబధియే. చిత్తూరు జిల్లాలో గుడి మల్లం అనే గ్రామముంది. మల్లం పాడులున్నాయి. బ్రహ్మనాయుని ఆయుధం సామంతరాగోల ఇందలి సామంత శబ్దం, గొప్ప ఎదురులేని సర్వాధికాం అనే అర్థాంనిస్తుంది.

**సామర్ల కోట :**

తూర్పుగోదావరి జిల్లాగ్రామం. నిజనామం చామర్లకోట పిఠాపురం జమీం దారుల నివాస స్థానం. చామర్ల ఒక రకం తృణధ్యాసం చామగడ్డ (**Panicum crus-galli Linn**) తెలిసిందే. దీనికే చాళుక్య భీమవరమని మరొక పేరు. 1976లో నైజాం నవాబు వశమైంది. 1838 లో ఇచ్చట కోట ధ్వంసం చేయబడింది. బ్రిటీషు పరిపాలనా కాలంలో సైనిక ఆసుపత్రి ఉండేది. 1866లో సైనిక కేంద్రం ఎత్తివేయబడింది కాని, రంప పితూరువల్ల తిరిగి 1879 లో సైనిక విడిది ఏర్పాటు చేయబడింది.

**సామినేనిపల్లి :**

కడపజిల్లా ప్రొద్దటూరు తాలూకా గ్రామం. సామినేని ఇంటి పేరుగా కన్పి స్తుంది. స్వామి సామిగా పరిణామం చెందింది. నాయకుడు, నాయనిగా కడకు నేనిగా స్థిరపడింది. ఇలా 'నేని' అంతమందు గల ఇంటిపేర్లు సుమారుగా 120 కి పైగా కన్పిస్తాయి. ఆ ఇంటి పేర్లలో ప్రస్తావింపబడిన (వీరమాచ-సాయప-పిన్నమ-,) పూర్వ పదాలన్నీ ఆయా వ్యక్తుల పేర్లు సైన్యాధికారులుగా - వని చేసిన వారు. కాకతీయుల తర్వాత ఇలాంటి పేర్లు వాడుకలోకి వచ్చాయి. ఈ 'నేని'

ఇంటి పేరు గలిపాటి కమ్మ, కాపు, రెడ్డి, యాదవ, బలిజ ఇతర కులాల్లో కన్పి స్తాయి. ఆయా వ్యక్తుల ప్రాధాన్యతవలన, అనంతర కాలంలో ఆ కుటుంబాలు, ఆ మూలపురుషుల పేర్లతో వ్యవహరింపబడుతున్నాయి.

**సుంకేశుల**

[illegible] కడప తాలూకాలో ఖాజీపేట [illegible] గ్రామ ముంది [illegible] సుంకేసుల వుంది. ఇది ఖాజీపేట సుంకేసుల అని వ్యవహరింపబడుతుంది. సుంకేసుల అనేది ఒక చెట్టు. (Ponician elata Linn) దీన్నే సుంకేసర అని కూడా అంటారు. కేసరి చెట్టు వేరు. చిట్టికేసరి తెలుసు కదా !

**సూరప్పకళం :**

చిత్తూరుజిల్లా చంద్రగిరి తాలూకా గ్రామం. వ్యక్తి నామపరంగా వచ్చినది. కళం అనగా నీరూరే చిత్తడి నేల. బురబురలాడే స్వభావం గల నేల. కళంకుప్పం. కళం మిట్ట అనే గ్రామాలు పుత్తూరు తాలూకాలో వున్నాయి. కళంకోట విశాఖ జిల్లాలో వుంది.

**సోమమల్లె :**

చిత్తూరుజిల్లా మదనపల్లె తాలూకా గ్రామం. వ్యవహారంలో సోంపాలెంగా కూడా వుంది. శాసనంలో సోంపల్లె అగ్రహారం. సోంపల్లె కోటలోని చవుదేశ్వరమ్మకు ఆ గ్రామంపై వచ్చే పన్నును పైన చెప్పిన వ్యక్తి దానం చేసినట్లు శాసనం.

**హవేలి లింగపాలెం :**

పశ్చిమ గోదావరిజిల్లా గ్రామం. లింగంపాలెం వ్యక్తినామపరంగా ఏర్పడ్డ గ్రామం. హవేలి పైన చెప్పిన వ్యవస్థా భేధాల్లో ఒకటి. 'హవేలి' శబ్దానికి భవన మనే అనే అర్థం కూడా వుంది. అయితే గ్రామ నామపరంగా ఈ అర్థం సరిపోలదు. నవాబు లేక అతని ఆంతరంగికుల స్వాధీనంలో కేవలం వారి స్వంత ఖర్చుల నిమి త్తం వచ్చే ఆదాయాన్ని నిర్దేశించడం జరిగింది. అలాటి గ్రామాల్లో ఈ లింగం పాలెం ఒకటి. గనుగ ఇది హవేలి లింగంపాలెం అయింది. మరికొన్ని సందర్భా లలో నవాబు తన పాలనా పరిధిలోని ప్రాంతాలలో పర్యటించే సందర్భాలను

పురస్కరించుకొని ఆయా గ్రామాలలో కొన్ని భవనాలను (నేటి రహదారి బంగళా వలె) నిర్మించారు. అలాంటి భవనాలు నిర్మింపబడ్డ గ్రామాలను అంటే హవేలీలు గల గ్రామాలను కూడా ఆ పేరుతో సంభావిచడం జరిగింది.

**హంసవరం :**

తూర్పుగోదావరిజిల్లా గ్రామం. కృష్ణాజిల్లాలో హంసలదీవి అనే గ్రామం ఉంది. వరం అని ఉండడం వలన తూర్పు గోదావరి జిల్లా గ్రామం వ్యక్తినామం అనిపిస్తోంది. నిర్థారించి చెప్పలేము. కాని హంసల దీనిలోని హంస హంసకాదు. గంగ తన కాలుష్యాన్ని పోగొట్టుకోవడానికి ఈ రూపంలో వచ్చి ఇచ్చటి కృష్ణా సాగరసంగమంలో స్నానం చేసి, హంసగా మారి వెళుతుందని స్థల పురాణగాధ. ఇచ్చట గోపాలదేవుని ఆలయముంది. ఇంతకూ ఇంచలి హంస ఒక మొక్క పేరు. హంసపాదాకు, అంస పాతాకు (**Vitis pedata, Vani or Heliotropium Covomandelianue, Retz**) అంటారు. ఇది అల్లుకునే స్వభావం గల తీగ మొక్క. ఇచ ఈ ప్రాంతం దీవి కనుక హంసలదీవి. "లలిత కృష్ణానది సంగమ స్థల విహార, పర కరుణా స్వభావ గోపాలదేవ" అనే మకుటంలో కాసుల పురుషోత్తమ కవి గోపాలశతకం చెప్పింది ఇక్కడి గోపాలదేవుని మీదనే. మాఘ పౌర్ణమికి ఇచ్చట కళ్యాణం జరుగుతుంది

**హార్స్లి కొండ :**

చిత్తూరుజిల్లా మదనపల్లె తాలూకాలోని వేసవి విడిది. పూర్వం కలెక్టరుగా పనిచేసిన హార్స్లి అనే దొర పేరు మీదగా పిలువబడుతుంది. దాని పూర్వ నామం, ఏనుగుమల్లయ్య కొండ. పైన 10, 12 డిగ్రీల ఉష్ణోగ్రత తక్కువ ఉంటుంది.

**హిందూపురం :**

అనంతపురంజిల్లా తాలూకా కేంద్రగ్రామం. ఒక మతంగా హిందూమతం తెలిసిందే. కాని భారతీయ ప్రాచీన సాహిత్యంలో ఎక్కడా ఈ పదం కనిపించదు. మత శబ్దం ఆంగ్లపదమైన 'రెలిజియన్' అనేదానికి సమానార్థకం వాడుతున్నాం గాని, నిజానికి ఒకటి గావు. తెలుగు సాహిత్యానికి సంబంధించి, మను చరిత్రలో పెద్దన్న ఈ శబ్దముపయోగించాడు. ఇక ఈ హిందూపురం వ్యక్తి నామపరంగా వచ్చింది. హిందూరావుపురం అనేది అసలైన పేరు. మహారాష్ట్ర పాలకుడైన ఘోర్పడే వంశస్థుల్లో, 1743 లో గుత్తినేలిన మురారిరావు తన తండ్రి హిందూ

రావు పేరు మీద ఈ గ్రామం కట్టించాడు. సమీపంలోని సుండూరు ఎస్టేట్ పాలకులు మొన్న మొన్నటి వరకు ఈ వంశస్థులే.

హిస్సారముురవణి :

పై తాలూకా గ్రామం. ముురువు ఒక రకం గడ్డి. కన్నడంలో మురుళి. అరణి అంటే మేర, పొద్దు, ప్రాంతము అని అర్థాలు. అంటే ఆ గడ్డి ఆవరించినంత మేర అని అర్థంకాగా, హిస్సార అనే కన్నడ పదాని కర్థం (హిస్సెదార్) వంతు కల్గినవాడు. వాటాదారుడు అని అర్దం. హిస్సావాని వేటపాడు ఇంతకు పూర్వం వివరింపబడింది. ఇంకా మరువణి శబ్దంతో వట్టుమరువణి (శిరుగుప్ప తాలూకా) హొసమురవణి (అదే తాలూకా) అనే గ్రామాలున్నాయి. ఎట్ట లేక వట్టి అంటే కానిది. అంటే అలాంటి తాలూకాలో ఏమీ గానిది అని అర్దం. లోగడ వట్టి చెరుకూరు (గుంటూరు జిల్లా) వివరింపబడింది. హొస అంటే పాడు దగ్గరలోని పాడు అనే గ్రామంతో వివక్షింపబడుతుంది.

హిస్సావావిలేటిపాడు :

ఇది నెల్లూరు జిల్లా గ్రామం. వావిలి పేరు. వావిలేరు దాని ఔప విభక్తిక రూపం వావిలేటి. తత్సంబధమైన పాడు వావిలేటిపాడు. ఇంక హిస్సా అంటే చాలా మందికి ఉమ్మడిగా ఇచ్చిన శ్రోత్రియం. శ్రోత్రియమంటే వేద పండితులకు అన్ని హక్కులతో ఇచ్చిన భూమి. శ్రోత్రియం పేరుతో చాలా గ్రామాలు కన్పిస్తాయి. చిత్తూరు జిల్లాలోని శ్రోత్రియం సాధుబడి వారిపల్లె ఇలాంటిదే.

# ఉపయుక్త గ్రంథాలు


తెలుగు :

ఆంధ్రవాచస్పత్యము — కొట్ర శ్యామల కామశాస్త్రి

దక్షిణ భారతశాసన సంపుటాలు

(South Indian Insrpritions)

— ఆర్క్యియలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా

ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము — కందూరి ఈశ్వరదత్తు

బ్రౌణ్య నిఘంటువు — సి.పి. బ్రౌన్

మాండలిక వృత్తిపదకోశము (వ్యవసాయము)

— ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

శబ్దరత్నాకరము — బహుజనపల్లి సీతారామాచార్యులు

శాసనశబ్దకోశము — కందూరి ఈశ్వరదత్తు

సూర్యరాయాంధ్ర నిఘంటువు — ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

ఆంగ్లము :

A manual of the Kistna District

Alphabatical List of Village in the Taluks and District of the Madras Presidency.

— Government Press, Madras

American Random House Dictionary

Castes & Tribes of Southern India Vol I to VII

— Edgar Thurston

Dravidian Etymalogical Dictionary and its supplement

— T. Burrow or Emeneou

Glossary of the Madras Presidency

— Ed. C.D. Maclean

Kenneda English Dictionary — Kittle

Mannuel of the Administration of the Madras Presidency Vol I or II — C.D. Maclean

Sanskrit English Dictionary

— Sir. Monier Monier-Williams

Tamil Laxicon — University of Madras

సంస్కృతము

అష్టాంగ సంగ్రహము — వాగ్భటుడు

# అగ్రహారం

గ్రామం మొత్తంగాని, కొంత భాగాన్నికాని ఏ విధమైన పన్ను లేకుండా లేక కొంత రాయితీ కూడిన పన్ను విధించిగాని బ్రాహ్మణుల కిచ్చినది. ఇచ్చిన షరతులను బట్టి దీనిలో భేదాలున్నాయి.

**అగ్రహార - ఈనాముల భేదములు :**

**1) బిల్మక్తా అగ్రహారం :**

చేసికొన్న ఒప్పందానికి లోబడినది. ఉత్తర సర్కారు జిల్లాలలోని దానికి దక్షిణాదిలోగల వాటికి వీటిలో కొంత తేడావుంది. మొదట దానిలో నియమితమైన నేల పన్నులేదా శిస్తు చెల్లింపవలసి వుంటుంది. అయితే ఇది సాధారణమైన దానికంటే తక్కువగా వుంటుంది. రెండవ పద్ధతిలో నియమితమైన పన్నుకు లోబడి తీసుకున్న భూమికి ఇది వర్తిస్తుంది.

**2) కట్టుబడి అగ్రహారం :**

జమీందారులు, తమ సేవకులకు రాయితీతో కూడిన నేలపన్ను విధించి ఇచ్చిన భూమి. ఇది ఒక రకమైన ఈనాము. బ్రాహ్మణులకే పరిమితమైనదికాదు. జోడి అంటే కూడా ఇదే.

**3) సర్వాగ్రహారం :**

ఏ విధమైన పన్ను లేకుండా ఇచ్చినది.

ఇవేవీ లేకుండానే కేవలం బ్రాహ్మణుల నివాస ప్రాంతాలను అగ్రహారాలని వ్యవహరించడం కూడా వుంది.

## ఈ నా ము లు

ప్రభువులు, జమీందారులు తమ సేవకుల సేవకు మెచ్చి బహుమతిగా ఇచ్చినవి. గ్రామంలో వివిధ వృత్తుల వారికి ఈ యీనాములున్నాయి. చాకలి, మంగలి, కంసాలి, కమ్మరి, కుమ్మరి, కరణం, కళావంతులు, తలారి, తంబళ, నంబి, పురోహితులు, పటేలు, పట్వారి, గణాచారి, పంచాంగం చెప్పేవారు, సుంకరి మొదలైన వారందరికి ఈనాములున్నాయి. ఇవిగాక మరికొన్ని ఈనాములున్నాయి.

**ఉప్పర యీనాము :** చెరువులకు గండ్లు పడితే పూడ్చే ఉప్పర్లకు ఇచ్చింది.

**ఊరడు యీనాము :** చలివేంద్రం పెట్టిన వానికిచ్చింది.

కావలి యీనాము : కోట గుమ్మంవద్ద కావలి వారికిచ్చింది.
తోలుబొమ్మల యీనాము : తోలు బొమ్మలాట ప్రదర్శించువారి కిచ్చింది.
దొరతనం ఈనాము : దొరతనం వారికి సాయపడినందుకిచ్చినది.
నీరుకట్టు ఈనాము : మాగాణి ప్రాంతాల్లో నీరును పంపకం చేసిన వారికిచ్చింది.
ఖట్రాజు ఈనాము : ఖట్రాజుల కిచ్చినది.
వ్యక్తిగత ఈనాము : దీనినే పర్సనాల్టీ (Personality) ఈనాము అని కూడా అంటారు. జమీందారులు తమ కిష్టమైన వ్యక్తుల కిచ్చింది.
సర్వదుంబాలా ఈనాము . చాలామందికి పన్ను లేకుండా ఇచ్చిన మాన్యం.
సర్వీసు ఈనాము : ఉద్యోగుల సేవకు ప్రతిఫలంగా ఇచ్చినది.
సాలిం ఈనాము : ఏ విధమైన పన్ను లేకుండా దేవాలయాలకిచ్చింది.
గ్రామం కట్టిన ఈనాము : మొదట గ్రామానికి బొడ్డురాయి ఎత్తినవారికిచ్చిన ఈనాం.
గొడుగు ఈనాం : (ఛత్రి) గొడుగుపట్టినవాని కిచ్చిన ఈనాము
దివిటీ ఈనాం : ముందు దివిటీ పట్టిన వానికిచ్చిన ఈనాము.
బాగ్‌మారి ఈనాం : పులిని చంపినవాని కిచ్చిన ఈనాము

## అనుభవ హక్కులు

1) కాస్తసరి : శిస్తు చెల్లించి ముస్సుకునే సొంత భూమి.
2) కొర్రు భూమి : పంటలు సరిగా పండకపోతే వదిలివేసిన భూమి.
3) గ్రామ కంఠం : గ్రామస్థులందరికి హక్కుగల బంజరు. శిస్తు ఏదయినా చెల్లింపవలసియుంటే అందరూ చెల్లిస్తారు.
4) గ్రామనత్తం : ఇళ్ళు కట్టుకోడానికి శిస్తు రద్దుపరచి ఇచ్చిన భూమి.
5) చెలక : సాగుచెయ్యడం మాని, పశువుల మేతకు వదిలివేసిన భూమి.
6) జిరాయితి : కాస్త సరిలాంటిది.
7) తెంపూరి భూమి : చుట్టు ప్రక్కల అమల్లోవున్న శిస్తు రేటు ప్రకారము చెల్లిస్తూ, ప్రభుత్వ అనుమతి మీద కావలసినంతకాలం సాగుచేసుకునే భూమి.
8) నివేశనం . నివాసస్థలం.
9) పాయకారి : భూకామందు దగ్గర కొంత కౌలుకు తీసుకొని, సాగుదార్లకు మారుకౌలు కిచ్చినది.

**పెనమకూరు :**

ఇది కృష్ణాజిల్లా గ్రామం. పెనమ, కుఱ్ఱుల కలయిక పెనమకూరుగా పరిణమించింది. భోజరాజీయ కర్త అనంతామాత్యుడు విలసితంబగు "కృష్ణవేణి మలాపహారిణి భీమరథి నా ధరిత్రియందు దనరు నదీ త్రయాంతర్వేది యగు సవనక్షేత్రమున శోభనముల కెల్ల ధరణివాసంబగు పెరుమగూరు పురంబు" అని ఈ పెనమకూరును తన తాత తండ్రుల నివాసంగా పేర్కొన్నాడు. భీమరథి యని ముద్రించుట పొరపాటు. అది భీమనది. కృష్ణవేణి తెలిసిందే. మలాపహారిణి పుల్లేరు. దీనిని గూర్చి ఇంతకు పూర్వం కొంత చెప్పడం జరిగింది. ఇక భీమనది, లేక భీమేరు లేక భీమఱ్ఱు అనేది నేడు పెదపూడికి బయట ప్రవహిస్తున్న మురుగుకాల్వ. ఇది, గుండేరు, లంజ కాల్వ, ఈ మూడు ఒకప్పటి కృష్ణానది ప్రవాహాలే. పెరుమగూరు అనడం కూడ పొరపాటే. ఇవి రెండూ అనంతరకాలంలోని వ్రాయస కాండ్ర పొరపాట్లు కావచ్చును. పెనమ అనేది ఒక రకం మొక్క. ముందు పెనగ వివరించడం జరిగింది. పేనారి అనే పేరుతో కన్నడంలో ఒక చెట్టు ఉంది.

అనంతమాత్యుని నివాసస్థలాన్ని గూర్చి పూర్వాసమీక్షకులు సందేహాస్పదముగా వ్రాయుట, వారికి గ్రంథపరిచయమే తప్ప గ్రంథస్థ ప్రాంతాలతో పరిచయం లేకపోవడమే.

ఇక పుల్లేరును గూర్చి మరికొంత వివరణ. మురుగు ప్రవాహాలను పుల్లేరులనడం పరిపాటి అని ముందు చెప్పడం జరిగింది. ఉయ్యూరుకు ప్రక్కగా మఱ్ఱివాడ, పామఱ్ఱుల మీదుగ నేడొక పుల్లేరు, పంటకాలువగా ప్రవహిస్తోంది. కాని చర్చలోని పుల్లేరు ఇది కాదు. ఏనుగులకోడు స్థానికులకు తెలుసు. అది పుట్టినచోటు నుండి తూర్పుకు ప్రవహిస్తూ నిమ్మకూరు (నిమ్మకుఱ్ఱు) ను చుట్టి ఇంకా దిగువకు ప్రవహించి, నిడుమోలుకు దిగువ బందరు బెజవాడ రోడ్డును దాటి, గుడ్లవల్లేరు, కవుతరంవైపుకు ప్రవహించి సముద్రంలో కలిసేది. ప్రస్తుతం ఈ ప్రవాహభాగం పంటకాలువగా మారింది. కృష్ణపై ఆనకట్ట కట్టిన తరువాత తూర్పు కృష్ణా ప్రాంతపు భూభౌతికస్థితిలో చాల మార్పు వచ్చింది. నిడుమోలు తరకటూరు (తరక-టుఱ్ఱు) ప్రాంతాలలో సముద్రంలో నుండి పడవలు రావడానికి ఒక కాలువ ఘంటశాలవరకు ఉండేది. ఈ రేవులలోనికి వచ్చిన పడవలపై సుంకాలు వసూలు చేసేవారు. దాని ప్రక్కన ఉండేది కరపట్నం. శ్రీనాథుడు తన జన్మస్థలంగా పేర్కొన్న కరపట్నం

## మరికొన్ని విశేషాలు

బారా బలోతీలు : గ్రామ సేవకులు. ఇవి పన్నెండు వృత్తులు.

(1) మున్సిఫ్ [రెడ్డి] (2) కరణం (3) షరాబు (4) నీరుకట్టి (5) తలారి (6) కుమ్మరి (7) కమ్మరి (8) కంసాలి (9) వడ్రంగి (10) మంగలి (11) చాకలి (12) జ్యోతిష్యుడు.

గ్రామ ఖర్చులు : పై ఉద్యోగస్తులకు మర్యాదలు జరపడానికి, బాటసారులకు నట్టువరాండ్రకు భోజనాలు పెట్టడానికి ఇంకా ఇతరములైన వాటికొరకు గ్రామస్థులనుండి, గ్రామాధికారులు వసూలుచేసే సొమ్ము. అయితే చాలా సందర్భాలలో స్వంతానికే ఖర్చు పెట్టుకునేవారు.

బారాదరి : పన్నెండు ద్వారాలు గలది. ఉద్యానవనాల్లోని వేసవి విడిది.

చౌదరి : గ్రామంలోని వర్తక వాణిజ్యాలను అజమాయిషీ చేసేవారు.

కళం కాలువ : బుగ్గనుండి ప్రవహించే కాలువ. సూరప్ప కళం అనే గ్రామం లోని కళం ఇదే.

నంజ : మాగాణి భూమి. కృత్రిమంగా నీటి సౌకర్యం కల్పింపబడినది. దీనినే నీరారంభం అనికూడ అంటారు.

నీరావరి : బాగా నీటి సౌకర్యము కలది.

పంద్రా పొలము : తోట భూమి.

పారడి పొలము : బీడు భూమి (పశుగ్రాసము కొరకు వదలినది)

పుంజ : మెట్టపొలము. దీనినే కాడారంభము అంటారు.

మంజ : శివారు

మగ్గవరి : మగ్గంమీద వేసిన పన్ను.

గొల్లాగారము : గొల్లవాండ్ల వద్ద తీసే పన్ను.

బెట్ట శిస్తు : వేసవిలో వేసిన పైరుపై వేసిన పన్ను.

మచ్ఛలీనం : చేపలు పట్టే వారిపైన వేసిన పన్ను. దీనిని చెంబడి పన్ను అని కూడ అంటారు.

**భరత వర్షము :** భరత వర్షము జంబూ ద్వీపమందలిది. ఈ భూమండలమునందు సప్తద్వీపములు కలవు. సప్తద్వీపా వసుంధరా, జంబు, ప్లక్ష, శాల్మల, కుశ, క్రౌంచ, శాక, పుష్కరములనునవి ఈ సప్త ద్వీపములు. లవణ, ఇక్షు, సురా, సర్పి, దధి, దుగ్ధ, జల సముద్రములు (సప్త సముద్రములు) ఈ ద్వీపములను చుట్టియున్నవి.

జంబూ ద్వీపమునందు హిమవంతము, హేమకూటము, నిషధము, మేరువు, నీలగిరి, శ్వేతాచలము, శృంగవంతము అనే కుల పర్వతాలున్నాయి. వీటినంటి ఇలావృత, భద్రాశ్వ, కేతుమాల, హరి, కింపురుష, రమ్యక, హిరణ్మయ, కురు, భరత వర్షములు గలవు.

ఈ భరతఖండము తొమ్మిది ఖండములు. అవి ఇంద్ర, కేతుమంత, తామ్రవర్ణ, గభస్తిమంత, నాగ, సౌమ్య, గాంధర్వ, వారుణ, కుమారికా ద్వీపములు.

ఈ కుమారికా ద్వీపమే భరతఖండమని చెప్పబడినది. దీనికి పేరు వచ్చుటకు గల కారణము స్వాయంభువ మనువు కుమారుడు ప్రియవ్రతుడు. ఈతని కుమారులు తొమ్మిది మందిలో అగ్నీధ్రుడొకడు. ఈతనికి జంబు ద్వీపపాలన మొసగబడినది. ఈతని కుమారులు తొమ్మిదిమంది. అందు ఋషభుడనువానికి హిమవంతమునకు దక్షిణ ఖండమున కాధిపత్యమివ్వబడినది. ఋషభుని కుమారుడు భరతుడు. ఆతడీ భూభాగమును పాలించుటచేత దీనికి భరతవర్షమని, భరత ఖండమని పేర్లు వచ్చెనని ఆంధ్ర మార్కండేయ పురాణము.

కాగా మేరువుకు దక్షిణాన ప్రకాశించే సూర్యుని కూడా భరతుడంటారు. ఆ వెలుగు ప్రసరించినంత మేర భరత వర్షమని ఒక ప్రతిపాదన.

# నాడులు - సీమలు

**అగళి స్థలము :** అనంతపురంజిల్లా మడకశిర తాలూకా ప్రాంతము.

**అత్తిలి విషయము :** పశ్చిమ గోదావరి జిల్లా తణుకు, భీమవరం తాలూకా ప్రాంతము.

**అద్దంకి సీమ :** అద్దంకి, దర్శి ప్రాంతములు.

**అమ్మనబ్రోలు సీమ :** దర్శి, ఒంగోలు ప్రాంతములు.

**అవుకు సీమ :** కర్నూలు జిల్లా, కోయిలకుంట్ల, శిరువెళ్ళ ప్రాంతములు.

**ఆరువేల వెలనాడు :** కృష్ణకు దక్షిణాన గల ప్రాంతము.

**ఏరువనాడు :** మార్కాపురం, పొదిలి, దర్శి (ఒంగోలు), బద్వేలు, సిద్దవటం (కడప) వరకు గల భూభాగము.

**ఒంగేరు మార్గ విషయము :** చిలకలూరిపేటనుంటి ప్రవహించుచున్నది ఒంగేరు. లేక ఓగేరు. ఆ ప్రవాహపు ఎడమ భాగమునగల చిలకలూరిపేట, బాపట్ల తాలూకాల ప్రాంతము.

**ఒడ్డవాది లేక ఒడ్డాది :** విశాఖపట్నం జిల్లా చోడవరం తాలూకా గ్రామము ఒడ్డాది. దాని చుట్టునుగల ప్రాంతము ఒడ్డవాది సీమ.

**కంద్రవాడి :** ఇది అయిదు భాగములు.

(1) ఉత్తర కంద్రవాడి, సత్తెనపల్లి తాలూకా ప్రాంతము. విజయవాడకు పడమరగల కృష్ణాజిల్లా భాగము.

(2) ఈవనికంద్రవాడి : ఈవని తెనాలి తాలూకా గ్రామము. నేటి మంగళగిరి, దుగ్గిరాల ప్రాంతములు.

(3) కంద్రవాడి విషయము : మంగళగిరికి పడమటనుండి అమరావతి వరకుగల భాగము.

(4) గుడ్లకంద్రవాడి : లాము, తాడికొండ ప్రాంతములు.

(5) దొడ్డి కంద్రవాడి : సత్తెనపల్లి తాలూకాలోని ఒంకదొన దొడ్డ కంద్రవాడిలోనిదిగా చెప్పబడింది.

**కడలునాడు :** ద్రాక్షారామము, కాకినాడ ప్రాంతము.

**కమ్మనాడు :** కృష్ణానది నుండి (పేరకమ్మ) గుండ్లకమ్మ వరకుగల భూభాగము కమ్మనాడు.

**కోసలనాడు** : మెదకుజిల్లా సంగారెడ్డి, కరీంనగర్ జిల్లా సుల్తానాబాదు, సిరిసిల్ల ప్రాంతములు.

**కుర్తి దేశము** : కృష్ణాజిల్లాలో పామర్రుకు దిగువ, పుల్లేరుకు ఉభయ పార్శ్వము లందలి భాగము.

**కొండపడమటి సీమ** : కొండవీటి కొండలకు పడమరగల భూభాగము.

**కొండనతవాటి సీమ** : గుంటూరు నుండి అమరావతి వరకు గల భూభాగము.

**కొరవి సీమ** : వరంగల్లు జిల్లా గ్రామము కొరవి. దాని చుట్టుప్రక్కల గల ప్రాంతము.

**కోటభూమి** : ఇందలి కోట ధరణికోట. సత్తెనపల్లి, గుంటూరు తాలూకాల భాగము.

**గుడ్డవాదినాడు** : ఇవి రెండు. (1) కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా ప్రాంతము. (2) తూర్పు గోదావరి జిల్లా రామచంద్రాపురం, రాజోలు ప్రాంతాలు.

**జంతరు నాడు** : విశాఖజిల్లా శృంగవరపు కోట, భీముని పట్నం తాలూకా ప్రాంతాలు.

**ఝాడు** : శ్రీకాకుళం జిల్లా సోంపేట తాలూకా ప్రాంతము.

**తొండ మండలము** : కాళహస్తి నుండి ఉత్తర ఆర్కాడు వరకు వ్యాపించిన భూభాగము.

**దిమిల** : విశాఖజిల్లా ఎలమంచిలి సమీప గ్రామము. దాని చుట్టుప్రక్కల గల భూభాగము దిమిలసీమ.

**దూపాటి సీమ** : మార్కాపురం ప్రాంతము.

**పలనాడు** : గుంటూరు జిల్లాయందలి గురజాల, పల్నాడు తాలూకాలు.

**పాకనాడు** : నెల్లూరు, వెంకటగిరి, కందుకూరు తాలూకాల భూభాగము

**పొన్నార సీమ** : తణుకు, భీమవరం, నరసాపురం తాలూకాల ప్రాంతము

**పూంగినాడు** : కందుకూరు, ఉదయగిరి ప్రాంతములు.

**పెడకల్లు** : నంద్యాల, నందికొట్కూరు, కోయిలకుంట్ల తాలూకాల ప్రాం భూభాగము.

**పెన్నబడి, పెన్నంబడి స్థలము** : అనంతపురం జిల్లా తాడిపత్రి తాలూకాలోని పెన్నానది ఉభయ తీరస్థ ప్రాంతము.

**పొత్తపినాడు** : ఈ పేరుతో రెండున్నాయి.

(1) కడపజిల్లా రాజంపేట తాలూకా ప్రాంతము.

(2) తూర్పుగోదావరి జిల్లాలోని పిఠాపురం తాలూకా ప్రాంతము.

**పొలవాస, పొలాస** : కరీంనగర్ జిల్లా జగిత్యాల తాలూకా ప్రాంతం.

**ప్రోలునాడు** : తూర్పుగోదావరి జిల్లాలోని పిఠాపురం, తుని, కాకినాడ తాలూకా ప్రాంతాలు.

**ములికి రాష్ట్రము** : నెల్లూరు జిల్లా ఆత్మకూరు, కొవ్వూరు, వెంకటగిరి తాలూకా ప్రాంతాలు.

**ములికినాడు** : కడపజిల్లా, కడప తాలూకా, ప్రొద్దుటూరు తాలూకా, కర్నూలు జిల్లా చాగలమర్రి ప్రాంతాలు.

**ముట్టవాడి** : మార్కాపురం తాలూకా.

**రేనాడు** : ప్రధానంగా కడపజిల్లా జమ్మలమడుగు, ప్రొద్దుటూరు, పులివెందుల కమలాపురం తాలూకాలు. వీటితోబాటు హిందూపురం తాలూకా ప్రాంతం (అనంతపురం జిల్లా) మదనపల్లి (చిత్తూరు జిల్లా) తలూకా లోని కొంత ప్రాంతము.

**వేంగి** : పశ్చిమ గోదావరి జిల్లాలో ఏలూరుకు సమీపానగల గ్రామము. తూర్పు చాళుక్యులు వేంగిరాజ్య పాలకులు. స్థూలముగా ఈ వేంగి మండలము ఉత్తరాన మహేంద్రపర్వతం నుండి దక్షిణాన తొండమండలమువరకు, తూర్పు తీరాన్నంటి వుంది.

**వెలనాడు** : వేలము అంటే సముద్రతీరము. నేటి తెనాలి, బాపట్ల, రేపల్లె, దివి తాలూకా ప్రాంతాలు వెలనాటిలోనివిగా శాసనాలలో చెప్పబడింది. ఆరు వేల వెలనాడు అంటే ఏరుల(ఆర్ అంటే తమిళములో ఏరు)తో గూడిన తీరభూమి.

**సకలి మండపనినాడు** : తూర్పు గోదావరి జిల్లా కాకినాడ, రామచంద్రాపురం తాలూకాలోని కొంత భూభాగము.

**సకలినాడు** : కడపజిల్లా బద్వేలు తాలూకా ప్రాంతము.

**సబ్బిసాయిర మండలం** : కరీంనగర్ జిల్లా ప్రాంతము.

# ఊళ్ళ పేర్లు - అకారాది పట్టిక

అక్కాజం పల్లె
అక్కపిళ్ళపూడు
అచ్యుతాపురత్రయం
అడవివరం
అడిగొప్పుల
అత్తిరాల
అధ్వాన్నం నాగాం ముజా కట్టుబడి
అనంతపురం
అనంతవరం
అంతకాపల్లె
అన్నవరం
అప్పాజీపేట
అప్పాపురం
అప్పారావు పేట
అమరావతి
అమానిచిరువెళ్ళ
అమీనబాద
అమృతలూరు
అంబవరం
అయ్యంకి
అయ్యవారిపల్లె
అలమేలుమంగాపురం
అలుగురాజుపల్లి
అల్లాపల్లె
అవనిగడ్డ
అవురుపూడి
అహోబిలం
ఆకుమళ్ళ
ఆకురాజుపల్లె
ఆకులమన్నాడు
ఆచంట
ఆంజనేయపురం సందాయతం
ఆత్మకూరు
ఆర్యవట్టం
ఆసీలుమెట్ట
ఇక్కుర్రు
ఇంజరం
ఇనామతి బోడిరెడ్డిపల్లె
ఇందుగల
ఇమ్మడి చెరువు
ఇరుకుపాలెం
ఇర్లపాడు

ఇల్లిందల

ఈడ్పుగల్లు

ఈదర

ఈలప్రోలు

ఉదక మంతలం

ఉద్దాన రామకృష్ణాపురం

ఉప్పుమిల్లి

ఉల్లంపర్రు

ఉసిరిక లంక

ఎర్లస్వాన్ పేట

ఎనికేపాడు

ఎరడుకెర

ఎర్రబాలెం

ఏలిమాని పెంట

ఎలమంచిలి

ఏలూరు

ఏలేశ్వరం

ఏళంజి

ఒప్పిచెర్ల

ఓక్స్ పేట

ఓటిగుంట

కంకిపాడు

కంచెల

కట్టుగుత్త వెంగన్నగారిపల్లె

కడవకుదురు

కత్తెరగండ్ల

కదిరి

కపిలేశ్వరపురం

కప్తానుపాలెం

కమతంవారి పాలెం

కమ్మపల్లె

కయిదుగాడి కంద్రిక

కలమళ్ళ

కలువచెర్ల

కల్లూరుదశబంధం

కవులూరు

కాకుమాను

కాగిత రామచంద్రపురం

కాజ

కానుగమాకులపల్లె

కాండ్రేగుల

కామేపల్లి

కావూరు

కిదరబాదు

కీలేరికడవసత్తం

కుక్కలగుంట

కుంచవరం
కుందుర్రు
కుందేళ్ళగుంట
కురగల్లు
కుదువపల్లె
[illegible]
[illegible]
కేసినేని[illegible]
కైకరం
కొక్కిరేని
కొక్కిలిగడ్డ
కొడిగెనహళ్లి
కొండకర్ల ఆవ
కొండపల్లి
కొండపీడు
కొణకంచి
కొర్రపాడు
కొసివేపల్లి
కోతులగోకవరం
కోనసముద్రం
కోనేటినాయని పాలెం
కోలలపూడి
కోలవెన్ను

క్విలన్
గంగూరు
గంజాము
గట్టిరాజు పెంట
గడిగరేలు
గణపవరం
గణపేశ్వరం
గండికోట
గన్నవరం
గంపలగూడెం
గారాలమడుగు
గాలిభీమవరం
గుడిపాడు
గుణదల
గుండ్లకమ్మ
గుంపిని
గురజాల
గుర్రప్పుడియ
గుర్రాలబయలు
గూడూరు
గొడవర్రు
గొడుగురాయి
గొబ్బిళ్ళమడుగు

గొరిజవోలు
గొలుగొండ
గోగులమూడి
గోళ్ళమూడి
గోవిందపురం
గ్రియంపేట
ఘంటశాల
చదలవాడ
చనుబంద
చంపాడు
చల్లపల్లి
చావలి
చిక్కాలవలస
చిగురులంక
చిత్రచేడు
చినపుత్త
చినవడుగూరు
చినవాత్తేరు
చింతకొమ్మదిన్నె
చిన్నహోతూరు
చిమ్మిరిబండ్ల
చిలకలూరిపేట
చిలుపూరు

చీపురుపల్లి
చీకటి
చుండూరు
చూడి
చెరుకూరు
చెర్లోపల్లి వ్యవసాయ కంద్రిగ
చేజెర్ల
చేబ్రోలు
చౌటూరు
జక్కంపూడి
జక్క సముద్రం
జగ్గయ్యపేట
జంపని
జలదంకి
జాలాది
జూలకల్లు
జొన్నలగడ్డ
జోడిధర్మాపురం
జోరాపురం
జ్వాలాగ్రాం
ట్రింకోమలి
ఢిల్లీ
తదకలపూడి

తణుకు
తంబళ్ళపల్లి
తర్లుబాడు
తలతంపర
తాడికొండ
తాడిపత్రి
తాతపూడి
తిమ్మభూపాలపురం
తిమ్మసముద్రం
తిరుపతి
తీద
తుపాకులవారిగుంట
తుళ్ళూరు
తువ్వచేనుపల్లె
తూబాడు
తెనుగుబూడి
తెన్నేరు
తొట్టెంపూడి
తొర్రగుడిపాడు
తొస్సిపూడి
తోళ్ళమడుగు
త్రిపురాంతకం
దండమూడి

దనాయని చెరువు
దప్పలంపాడు
దర్శి
దళవాయిపల్లె
దార్వేముల
దుగరాజు పట్నం
దుగ్గిరాల
దేవగుడి
దొమ్మరనంద్యాల
ద్రాక్షారామం
దవళేశ్వరం
నందులపాడు
నందలూరు
నదివంపు
నందివెలుగు
నరవ
నరసరావుపేట
నరసాపురం
నల్లపాడు
నవాబుపేట
నాగలాపురం
నాదెండ్ల
నారాయణపురం

నారాయణవనం
నిజాం పట్నం
నిడమర్రు
నిడిముసిలి
నిధానంపాడు
నీళ్ళులేని తిమ్మాపురం
నున్న
నెకరికల్లు
నెమలి
నెల్లూరు
నేలకొండపల్లె
నేలమామిడి చెలక
నైనవరం
నైనారుఖండ్రిక
పటమట
పడకండ్ల
పదిపుట్లబయలు
పద్మనాభం
పమిడిపాడు
పమ్మి
పరిమెళ్ళ
పలాస
పలుగురాళ్ళపల్లి

పాఘ్నానగరం
పాణ్యం
పాయకరావుపేట
పాలకొల్లు
పిన్నెలి
పుట్టరేణిగుంట
పుత్తూరు
పులిగడ్డ
పులివెందుల
పుల్లలచెరువు
పుసులూరు
పూసపాటిరేగ
పెండ్యాల
పెదకళ్ళేపల్లి
పెదనింద్ర కొలను
పెద్ద బ్రహ్మదేవం
పెనగలూరు
పెనమకూరు
పెనమలూరు
పెనుగంచిప్రోలు
పెనుమూలి
పొత్తూరు
పొన్నూరు

ప్రొసంగుఅన్నాదు
ప్రొద్దుటూరు
ఫిరంగిపురం
బచ్చలికూరపాడు
[illegible]
బదేవరం
బందరు
బత్తేపల్లి
బయనకుంటపల్లె
బల్లిపర్రు
బహదూర్ శేషయ్య ఖండ్రిక
బహర్జలి
బాపనత్తర
బుగ్గ వెంకటాపురం
బుచ్చిరెడ్డిపాలెం
బురక్కాయలకోట
బూతుఖిల్లి
బెండపూడి
బెండి
బెరహంపూరు
బెల్లంకొండ
బెళగళ్
బేజాత్పురం

బేతపూడి
బేతాపల్లె
బొడ్డుపల్లె
బొబ్బనపల్లి
బొబ్బిలి
బోనంగి
బోయల ఉప్పలూరు
భీమవరం
భూప సముద్రం
భోగాపురం
మంగళగుంట
మంగళగిరి
మంచికలపూడి
మణే సముద్రం
మత్స్యపురి
మదనపల్లె
మద్దినాయనిపల్లె
మధురవాడ
మనవర్తి కొత్తూరు
మందపాడు
మల్కాపురం
మల్లాకాలువ
మహాజనంపేట

మాచెర్ల
మారేడు మానిపల్లె
మార్కాపురం
మార్కొండపాడు
మీసరగడ్డ అనంతవరం
ముఖలింగం
ముచ్చింతాల
ముట్లూరు
ముత్యాల చెరువు
ముదినేపల్లి
మునబాలపల్లి
మునమాక
ముమ్మడివరం
మురికిపూడి
ముసలిమడుగు
మేడసానిపల్లె
మేడికొండూరు
మేరికపూడి
మైలాడుదుర్రై
మొఖాసకలువపూడి
మొగలితుర్రు
మొనపాలెం
మోటుపల్లి
మోదుగులపాడు
మోపూరు
మోరుబాగలు
మోర్సిపేట
యాదగిరి
యానాము
రంపచోడవరం
రంపతాడు
రసీదుపురం
రాజమహేంద్రవరం
రాజాపేట
రాపర్రు
రామచంద్రపాలెం
రామాపురం
రాయగడ
రాయచోటి
రాయదుర్గం
రాయికొరడు
రాళ్ళపెంట
రావినూతల
రావూరు
రావెల
రెంటచింతల

రొంపిచెర్ల
లక్ష్మీపురం
లంకపల్లి
లబ్బీపేట
లాం
లింగారావుపాలెం బిల్మక్తా
లొల్ల
వంగలపూడి
వజ్రకరూరు
వడ్డేశ్వరం
వత్సవాయి
వరగాణి
వర్తల్లపల్లి
వలందపాలెం
వలివేరు
వల్లూరు
వసంతవాత
వాత్రేరు
విజయవాడ
విద్వత్ సదాశివపురం
విలాస గంగవరం
విశాఖపట్టణం
విశ్వనాథపురం
విశ్వేశ్వర గోళకి
వీరకుమారయాచసముద్రం
వీరచోడచతుర్వేది మంగలం
వెంకటాద్రిపాలెం
వెలగలపాయ
వెలుగుపల్లి
వెల్లంకి
వేంగ్ర
వేపంజేరి
వేమవరం
వ్యాపులపల్లి
శివరామపురం
శృంగవృక్షం
శెట్టియప్పన్ తాంగల్
శ్రీకాకుళం
శ్రీకూర్మం
శ్రీనివాస ఉదాసిపురం
శ్రీరంగరాయపేట
షేరుమహమ్మదుపురం
సకల కొత్తపల్లె
సంగం జాగర్లమూడి

సంగాల

సంజీవరాయని పట్టడ

సంతమాగులూరు

సంతబయలు

సంతోషపురము

సందెపూడి

సమయపురం

సర్వవరం

సర్వజ్ఞనాం రాఘవాచార్యులపల్లె

సర్వేపల్లి

సాతులూరు

సామంతకుర్రు

సామర్లకోట

సామినేనిపల్లె

సుంకేశుల

సూరప్పకశం

సోమపల్లె

హవేలి లింగపాలెం

హంసవరం

హార్సిలికొండ

హిందూపురం

హిస్సారమురువణి

హిస్సావావినేటిపాడు





# రచయిత గురించి

పేరు : యార్లగడ్డ బాలగంగాధరరావు
తలిదండ్రులు : యార్లగడ్డ కృష్ణమ్మ, భూషయ్యగారలు.
సాకినవారు : మండవ మాణిక్యమ్మ, నాగయ్యగారలు.
స్వస్థలం : పెదప్రోలు, దివితాలూకా, కృష్ణాజిల్లా.

విద్యాభ్యాసం : పోస్టుగ్రాడ్యుయేషన్ : ఎం. ఏ (తెలుగు) ఆంధ్ర విశ్వవిద్యాలయం, వాల్తేరు.
పరిశోధన : పిహెచ్. డి. నాగార్జున విశ్వవిద్యాలయం.
విషయం : అనంతపురంజిల్లా గ్రామ నామాలు.
బోధన : పోస్టుగ్రాడ్యుయేషన్ : తెలుగుశాఖ, ఆంధ్రవిశ్వవిద్యాలయం. ఆగష్టు 93 నుండి నాగార్జున విశ్వవిద్యాలయం.
ప్రస్తుత పదవి : ఆచార్య స్థాయి. ఆగష్టు 95 వరకు శాఖాధ్యక్షత.
ఇతరములు : (1) రెండేండ్లు జూనియర్ రీసెర్చిఫెలోగా, తెలుగు వ్యుత్పత్తి పదకోశ నిర్మాణంలో.
(2) ఎడిటర్, ఆదివాసి ఒరియా–తెలుగు–ఇంగ్లీషు నిఘంటువు.
(3) ఆదివాసి ఒరియా-తెలుగు వాచకాల తయారి.
పరిశోధక దర్శకత్వం : 17 పిహెచ్. డి., 6 ఎం. ఫిల్ పట్టాలు ప్రదానంచేయబడ్డాయి.
పరిశోధక సంస్థలతో గల సంబంధం :
(1) ఉపాధ్యక్షుడు : ప్లేస్‌నేమ్స్ సొసైటీ ఆఫ్ ఇండియా, మైసూరు.
(2) మేనేజింగ్ కమిటి మెంబరు : అంతర్జాతీయ నామ విజ్ఞాన సంఘం, బెల్జియం.
(3) మెంబరు అమెరికన్ నేమ్స్ సొసైటీ, న్యూయార్క్.
(4) ,, ద్రవిడియన్ లింగ్విస్ట్స్ అసోసియేషన్, తిరువనంతపురం.
(5) ,, మిథిక్ సొసైటీ, బెంగుళూరు.
(6) ,, నేమ్స్ సొసైటీ (Plans) కేరళ.
(7) ,, సలహామండలి : తెలుగు సాహిత్య మాసపత్రిక, తెలుగు అకాడమి, హైద్రాబాద్.
విదేశీయానం : రెండు మారులు. కెనడా, ఇంగ్లాండు, ఫిన్లాండు.
పరిశోధక పత్రాలు : జాతీయ సదస్సులలో 28, అంతర్జాతీయ సదస్సులలో 2.
వివిధ పత్రికల్లో వ్యాసాలు, రేడియోలో ప్రసంగాలు.